

శ్రీ చిరుమామిళ్ల-లక్ష్మీనారాయణప్రసాద్ గారు, బి.ఏ

శ్రీ



శ్రీమాలతీవసంతాది గ్రంథకారులును గుంటూరు డిప్యూటీ కలెక్టరువారి
కచ్చేరీ హెడ్‌క్లర్కులును నగు

తురగా వేంకటాచలము బి. యే. గారిచే

రచియింపఁబడి

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడియె

మొదటికూర్పు 1,000 ప్రతులు.

గుంటూరు.

దీనివెల రు 0-12-0.



1910.

శ్రీ

# సరోజిని



శ్రీమాలతీవసంతాది గ్రంథకారులును గుంటూరు డిప్యూటీ కలెక్టరువారి కచ్చేరీ హెడ్‌క్లర్కును నగు

తురగా వేంకటాచలము బి. యే. గారిచే

రచియింపఁబడి

గుంటూరు వాణీ ముద్రాక్షరశాలలో

ముద్రింపఁబడియె

మొదటికూర్పు 1,000 ప్రతులు.

గుంటూరు.

దీనివెల రు 0-12-0.



1910.

ముచ్చటయ్యె లేఁబ్రైరున
నచ్చుపువర్షంబునమాడ్కి ♦ నయ్యెన్నాకున్॥

సీ॥ ఈవిధమున గౌర ♦ వింపంగఁగడచిన
యక్టోబరునెల యం ♦ దఖిలభాష
మేఁబొందియపుడు ప ♦ రీక్షాసమయమహాటఁ
బ్రారంభమునుఁ జేయ ♦ వలనుపడక
మాసాంతమందు స ♦ మారంభము నొనర్ప
నుద్యమింపఁగను ను ♦ ద్యోగవశత
వంగప్రోలొప్ప వంగఁ ♦ బనివడెనాకష్ట
గాని శ్రీకృష్ణుని ♦ కరుణచేత
మరల గుంటూరికే ♦ మార్చిరియంత న
వంబరుతొమ్మిది ♦ వచ్చెనప్డు
ప్రారంభమునుఁ జేసి ♦ పదపడి నేమాగిం
చితిడిశంబరునెల ♦ చేరఁగానె

గీ॥ యంతరాయంబు లింకనే ♦ మగునొయంచు
నడరినారాయణప్రసా ♦ దాఖ్యుఁడప్పు
డచ్చువేయించె జాగుచే ♦ యక స్వకీర్తి
ధరణి వెలయంగ నాచంద్ర ♦ తారకముగ॥

చ॥ సరసుఁడమూల్యసద్గుణవి ♦ శాలుఁడు శాంతుఁడు రాజబాంధవ్రా
త్తరుఁడును మిత్రమానసల ♦ తానవకమ్రవసంతుఁడున్ గళా
కరుఁడును నా ప్రసాద సఖు ♦ గారవమారఁగఁ గృష్ణుఁడో ముతన్
జిరతర సౌఖ్యభోగముల ♦ శేషయశస్సునుఁ గూర్చుచున్ గృపన్॥

గీ॥ పానకములోని పుల్లలా ♦ వలకుఁద్రోసి
నలుసులను నేరి మధురపా ♦ నకముఁ గ్రోలు
నేరసులట్టులు దోష లే ♦ శముల విడిచి
రసము నేఁ గ్రోలుఁడీ కవి ♦ ప్రవరులిందు।

గుంటూరు,
20—1—1910.

ఇట్లు పండిత విధేయుఁడు,
తురగా వేంకటాచలము

# పీఠిక.

విద్వత్కవివరులారా! మాన్యులారా!

నేనీ సరోజినీనాటకమును నాంగ్లేయ మహాకవియగు షేక్స్పియరుకృతమగు "యాజ్ యు లైకిట్" (As you like it) అను నొక సరసనాటకమునుఁ గథాసూత్రముగాఁగొని మనదేశపద్ధతులకును నభిప్రాయములకును ననుగుణముగాఁ గథనుమార్చి వ్రాసినాఁడను దీనికిఁ బూర్వజమై యెనిమిదేండ్ల క్రిందట నాచేవ్రాయఁబడి 1908 వ సంవత్సరమునఁ బ్రకటీకృతమైన మందారవిజయమువలెఁగాక యీ నాటకము శుభలగ్నమున జన్మించుటచేఁ గాఁబోలు సద్యస్స్ఫూర్తితో దేశమునఁ బ్రకాశించు నోమునోచుకొనెను. ఇది 1909 వ సంవత్సరము నవంబరు 9 వ తేదీని నాచేఁ బ్రారంభింపఁబడి యస్మత్పరమాప్తులును రాజబంధువులును బ్రొబేషనరీ డిప్యూటీ తహాశ్శీలుదారును నగు శ్రీ చిదుమామిళ్ళ లక్ష్మీనారాయణ ప్రసాదము బి. యే గారి యమితప్రోత్సాహముచే డిశంబరు 1 వ తేదీని ననఁగా నిరువదిమూఁడు దినములకు ముగింపఁబడి యానెలలోనే ముద్రాపణమున కీయఁబడియె. ఉత్సాహశక్తివలనఁ గదా యింతటి స్వల్పకాలమున నొకనాటకమును వ్రాయఁగలిగితినను సంతోషము మనస్సున నుప్పొంగినను నింతకుమున్ను పెక్కేండ్లు వృథాకాలయాపనముఁ జేసితినను విచారముకూడఁ బొడసూపినది. ధనవంతులును రసజ్ఞులునగు నిట్టి ప్రోత్సాహకారకులు శూన్యమైనందుననే యాంధ్రభాషాకన్య క్రమక్రమముగా క్షీణించుచున్నదను నింకొక విచారముగూడ దీనికిఁదోడయ్యె. అయినను గతజలసేతుబంధనమువలనఁ బ్రయోజనములేదు గనుక భాషాభివృద్ధికై విద్వత్కవిసత్తములఁ బ్రోత్సాహపఱచు నాసక్తి ధనవంతులును బ్రాజ్ఞులునగు రసజ్ఞులమనస్సుల నంకురింపఁజేయ సదాభగవంతుని బ్రార్థించెదను. మఱియుఁ బాఠకులకుఁ గథావస్తువు సుబోధమగునటులఁ గ్లుప్తముగా నీక్రింద నుదాహరించెదను.

## ప్రథమాంకము.

రాధికాపుర సామంతప్రభువగు ధృతకీర్తి జ్యేష్ఠపుత్త్రుఁడగు కలహంసుఁడు దనతండ్రి వ్రాసిన మరణశాసనపద్ధతులకు భిన్నముగాఁ దనసోదరుఁడైన ప్రభాకర కళానిధులకేమియు భాగమొసఁగకుండుటకై దురాలోచనలు సేయుటయు గృహారామమందున్న తనకనిష్ఠ సోదరుఁడగు ప్రభాకరునిఁ గలిసికొని యాతనిఁ దూలనాడి వంచింపఁబడుటయుఁ బిదపఁదన దుర్గతికిఁజింతించి యప్పటిమహారాజగు ధనవర్మచేతఁ గల్పింపబడిన మల్లయుద్ధమునందుఁ దనతమ్మునిఁ జంపింపనుద్యమించి రుద్రమల్లుఁడను మల్లుని పైనాతనిఁ బురికొల్పుటయుఁ దనతమ్ముఁడద్దాని కంగీకరించి మల్లయుద్ధమునందు మల్లునిఁజంపుటయుఁ దమ్ముఁడగు ధనవర్మచేఁ బదభ్రష్టుఁడై యరణ్యములందున్న కీర్తివర్మ మహారాజుగారి పుత్త్రికయు ధనవర్మచేఁ జెఱఁబెట్టఁబడియున్న లతాంగియునగు సరోజినిని మల్లయుద్ధమున సౌధముపైఁ జూచి ప్రభాకరుఁడు మోహించుటయు నాసరోజినియుఁ బ్రభాకరుని మోహించి వెడలిపోవునపుడు ముక్తాహారమును నొడిలోవైచి పోవుటయునను కథ గలదు.

## ద్వితీయాంకము.

సరోజిని తన ప్రాణసమానయు ధనవర్మ పుత్త్రికయునగు కమలినితోఁ బ్రభాకరునిఁగూర్చి ముచ్చటించుచుండ ధనవర్మ ప్రవేశించి సరోజినిపై దేశబహిష్కరణాజ్ఞవిధించుటయు నట్లుచేయవలదని కమలిని దండ్రినిఁ బ్రాధేయించుటయు దానికాతఁడంగీకరింపమి సరోజినిపురుషవేషముఁ దాల్చి కమలినితో రాచనగరువీడిపోవుటయు మల్లయుద్ధమునందు జయించెనను నసూయచేఁగలహంసుఁడు ప్రభాకరునిఁజంపింప గృహమునందుఁ బ్రయత్నములు సేయుచుండుట కృతజ్ఞసేవకుండగు సారంగుఁడు తెలిసికొని యన్నఁజూడ నింటిలోపలకుఁ బోఁదలంచివచ్చిన ప్రభాకరుని వారించి యుద్ధునుఁగలిసి యరణ్యములకుఁబోవుటయు ధనవర్మ తనకూఁతురుకమలినిఁగూడఁ బోవుటచేఁ గోపించి ప్రభాకరునిఁగాని కలహంసునిఁ గాని పట్టితెప్పింపుమని మంత్రికాజ్ఞాపించుటయుఁ గీర్తివర్మదనయవస్థనుఁ గూర్చి

చింతించుచుఁ గడకునీయరణ్యనివాసమే హాయిగా నున్నదని తన మంత్రులతోఁ జెప్పి వేఁటకుఁబోవుటయు సరోజినీ కమలినులు మారువేషములతో నరణ్యము ప్రవేశించి గోవిందుఁడను నొక గొల్లవాని పరిచయమున మేకలనుఁ గుటీరమునుఁ గొనఁ బ్రయత్నించిపోవుటయు నాకలిచే బడలియున్న సారంగునితోఁ బ్రభాకరుఁ డాయరణ్యముననే ప్రవేశించి సారంగుని నొకచోటనిలిపి యాహారమునకై వెదకుచు విందారగించుటకు సిద్ధముగానున్న కీర్తివర్మగారి భోజనశాలఁ గృపాణధారియై ప్రవేశించి తనకు భోజనమిడినంగాని వారును వారిపరివారమునుఁ దినవలను పడదని భయపెట్టుటయుఁ జివరకు వారితోసఖ్యపడి సారంగుని నక్కడకు మోసుకొనిపోయి యాకలినిఁదీర్చుకొని తాను ధృతకీర్తి పుత్రుఁడనని కీర్తివర్మప్రభువుతోఁ జెప్పి వారిదయ సంపాదించుకొనుటయు నను కథ వివరింపఁబడినది.

## తృతీయాంకము.

ధనవర్మ యాజ్ఞాప్రకారము పట్టి తెచ్చుటకుఁ బ్రభాకరుఁడు పట్టణమందు లేమి నాతనియన్న కలహంసునిఁబట్టి భటులు ధనవర్మ కప్పగింపఁగా నాతఁడు కలహంసునితోఁ బ్రభాకరునిఁ దక్షణమప్పగింపకున్న వాని స్వాస్థ్యమునంతయుఁ దా నాక్రమింతునని చెప్పుటయు నాకలహంసుఁడు ప్రభాకరునిజాడఁ దనకుఁదెలియదని చెప్ప ధనవర్మ యాతనిస్వాస్థ్యమునంతయు నాక్రమించుకొమ్మని యుత్తరువుచేసి కలహంసునిపైఁ బురబహిష్కారణాజ్ఞ విధించుటయు నరణ్యమునందునున్న ప్రభాకరుఁడు సరోజినిపై మోహమున మనస్స్వాస్థ్యములేక యామెను వర్ణించుకొనుచు వృక్షచర్మములపైఁ బద్యములు లిఖించిపోవుటయు సరోజిని ప్రభాకరునిపై మోహమున నేమియుఁదోఁచక తనకుటీరమునుండి యొంటరిగా బయలువెడలి కమలాకర సమీపమునందు కదళీవనములోనియొక వృక్షముపైఁ దన్నుఁగూర్చి ప్రభాకరుఁడు వ్రాసిన పద్యమునుఁ జూచి చదువుకొని యబ్బురపడుచుండఁ గమలిని ప్రవేశించి ప్రభాకరుఁడు వ్రాసిన మరిరెండు పద్యములు సరోజినికడఁ జదివి ప్రభాకరుఁడీ యరణ్యమునకు వచ్చెననియుఁ దానుఁజూచితిననియుఁ జెప్పి యానందింపఁ జేయుటయుఁ

గమలినీవాక్యమునుఁబట్టి ప్రభాకరుఁడు కమలాకరమునుఁ జేరి సూర్యనమస్కారములు సేయుచుండ మారు వేషములతోనున్న సరోజినీకమలినులాతనిఁ గలుసుకొనుటయుఁ బురుష వేషముతోనున్న సరోజిని ప్రభాకరునితో నాతనిఁగూర్చి ముచ్చటించుటయుఁ బ్రభాకరుఁడు దనకుసరోజినిపైఁగల మోహముచే మిక్కిలి తపించుచుంటినని చెప్పుటయు మిత్రభావముతో సరోజిని ప్రభాకరునితోఁ దన్ను సరోజినీయని పిల్చుచుఁ దనసహవాసము చేసినచో మోహవికారము క్రమక్రమముగాఁ దగ్గింతునని పల్కుటయు దానికాతఁ డీయకొనుటయు గొల్లవాండ్రగు నానందసానందలాండోరుల ప్రేమలనుఁగూర్చి ముచ్చటించుకొనుటయు నను కథ యున్నది.

## చతుర్థాంకము.

కీర్తివర్మ మంత్రియగు సూక్ష్మబుద్ధి పురుష వేషమున రాజీవుఁడని పేరుతోనున్న సరోజినికడకువచ్చి వేదాంతమునుఁగూర్చి ముచ్చటించిపోవుటయు నంతఁ బ్రభాకరుఁడు ప్రవేశింప సరోజినీమోహవిషయమునుఁగూర్చి మారు వేషముతోనున్న సరోజిని ప్రశ్నించుటయు దానికాతఁడు బదులుపల్కిపోవుటయుఁ గీర్తివర్మ తనకూతురు సరోజిని తనకుఁగనఁబడునేనిఁ బ్రభాకరునకిచ్చి పెండ్లిచేసెదనని నిశ్చయించుకొనుటయుఁ బ్రభాకరుఁ డింకను రాకుండుటకయి వగచుచున్న సరోజినికడ కాతనియన్న కలహంసుఁడు ప్రభాకరుఁడు దన్ను సరోజినికడకుఁ బంపెనని చెప్పుచుఁ బ్రభాకరుని దగునొక రక్తవస్త్రమిచ్చుటయు దానినిఁజూచి సరోజిని విచారించి కారణమడుగుటయు దానికిఁ బ్రభాకరుఁ డీటనుండి పోవునపుడు దారిలో సర్పవృతకంధరుఁడయిన యొక మానవుని రక్షింపఁబోవఁగాఁ బొదలోదాగియున్న సింహమాతనిపైఁ డీకొనెననియు దానినిఁగడకుఁ జంపుటలో గాయముతగిలి రక్తము వస్త్రమునకంటెననియు నామానవుఁడు ప్రభాకరుని యన్నయగు కలహంసుఁడనుపేరుగల తానే యనియుఁ జెప్పుటయు సరోజిని మూర్ఛిల్లి తేఱుటయుఁ గలహంసుఁడు కమలిని మోహించుటయు నను కథ గలదు.

## పంచమాంకము.

ప్రభాకరుని గాయముమానుటతోడనే కలహంసునిఁ గలిసికొని యాతఁడా యరణ్యమునకువచ్చిన కతంబడిగి ధనవర్మ తమ స్వాస్థ్యము నాక్రమించుకొనుటయు సరోజినినిఁ దన్నునుఁ బురమునుండి వెడలఁగొట్టుటయు నాదిగాఁగల సమాచారము నన్నవలనఁ దెలిసికొనుటయుఁ బిదపఁ గలహంసుఁడు దానుగమలినిని మోహించితినని చెప్పి తన కామెతోఁ బెండ్లి సంఘటింపఁజేయవలసినదని కోరుటయుఁ బ్రభాకరుఁ డెట్టకేలకియ్యకొని రేపే వివాహముఁ గావించెదనని చెప్పుటయుఁ గలహంసుఁడు సంతోషించిపోవుటయు నంతఁ బురుషవేషముతోనున్న సరోజిని ప్రవేశించి కలహంసుని పెండ్లిసంగతి ప్రభాకరునివలన విని సరోజినితో నతఁడుగూడ రేపే పెండ్లియాడవచ్చుననియుఁ దన మంత్రబలముచే నామెనుఁగొనివచ్చి సంతోషము ఘటింతుననియుఁ జెప్పి యానందసానందలకుఁ గూడ వివాహము స్థిరపఱచిపోవుటయుఁ గమలిని తనకును సరోజినికిని రేపే పెండ్లియని సరోజినివలనఁ దెలిసికొని సంతోషించుటయుఁ బ్రభాకరునివలనఁ దనకూతురు సరోజినియెల్లియ్యటకేతెంచునని విని కీర్తివర్మ నమ్మఁజాలక సందేహించుచుండఁ బురుషవేషముతో సరోజిని ప్రవేశించి తన మంత్రబలముచే సరోజినినిఁ దెచ్చితినని చెప్పుచుఁ గీర్తివర్మవలన సరోజినినిఁ బ్రభాకరుని కీయవలెనను వాగ్దానమునుఁ బ్రభాకరునివలన నామెనుఁ బెండ్లియాడెదనను వాగ్దానమునుఁగొని సరోజిని నిదిగోఁ గొనివచ్చెదననియుఁ జెప్పుచుఁబోయి తిరిగి సరోజిని స్త్రీరూపమునఁ గమలినితోఁ బ్రవేశించుటయుఁ గీర్తివర్మ పరమాద్భుతపడి యామాంత్రికుఁడేడని సరోజినినడుగఁ గమలిని సరోజినియే పురుషవేషమునుఁదాల్చి యట్టులుచేసెనని చెప్పుటయు దానికిని సంతోషించి ప్రభాకరునికిసరోజినినిఁ గలహంసునకుఁగమలినిని నానందునకు సానందనునిచ్చి యచ్చటఁ బెండ్లిసేయుటయు నంతధృతకీర్తి ద్వితీయపుత్త్రుఁడగు కళానిధి ప్రవేశించితన యన్నదమ్ములనుఁ బెక్కేండ్లకుఁ గాంచినందులకయి పరమానందముఁబొంది కీర్తివర్మతోఁ బశ్చాత్తాపముగలిగి రాజ్యమతనికిచ్చుటకయి ధనవర్మ యరణ్యమునకువచ్చి సిగ్గుపడియున్నాఁడని చెప్పుటయుఁ గీర్తివర్మగారి

యనుమతి ప్రకారమూ ధనవర్మనచటికిఁ బలిపించుటయు ధనవర్మ దన్ను క్షమింపనన్నను గోరి రాజ్యమప్పగించుటయు నింద్రుఁడు ప్రత్యక్షమై వరములొసఁగుటయుఁ గీర్తివర్మ తన బంధుమిత్ర పరివారముతో సుఖముగాఁ బురప్రవేశ మొనరింపఁ జనుటయునను కథ గలదు.

ఈ నాటకమునందు శృంగారము ప్రధానరసమైనను రౌద్రము దానికిఁ బ్రధానాంగముగా నుండును. మఱియు నియ్యది నవరసాశ్రయ మని చెప్ప నొప్పియున్నది.

గుంటూరు,
20—1—1910.

ఇట్లు బుధవిధేయుఁడు.
తురగా వేంకటాచలము.



# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు

## పురుషులు.

కీర్తివర్మ—పదభ్రష్టుఁడై యరణ్యాగతుఁడయిన మహారాజు.

ధనవర్మ—ఇప్పుడు పాలించుచున్న మహారాజు.

ప్రభాకరుఁడు—ధృతకీర్తి తృతీయపుత్త్రుఁడును గథానాయకుఁడును.

కలహాంసుఁడు—ప్రభాకరుని జ్యేష్ఠభ్రాత.

కళానిధి—ప్రభాకరుని ద్వితీయభ్రాత.

సూక్ష్మబుద్ధి—, సులోచనుఁడు— } కీర్తివర్మ మంత్రులు నాతనితో నరణ్యము చేరిన వారును.

సరసబుద్ధి—ధనవర్మ మంత్రి.

సారంగుఁడు—ధృతకీర్తి కృతజ్ఞసేవకుఁడు.

దమనుఁడు—కీర్తివర్మ సేవకుఁడు.

వృద్ధుఁడు—ఒక పురవాసి

సువేగుఁడు—వృద్ధుని జ్యేష్ఠపుత్త్రుఁడును శూరుఁడును.

సుకాయుఁడు—వృద్ధుని ద్వితీయపుత్త్రుఁడును శూరుఁడును.

రుద్రమల్లు—మల్లయుద్ధముఁ జేయవచ్చిన శూరుఁడు.

ఆనందుఁడు—, గోవిందుఁడు— } ఇద్దఱు గొల్లవాండ్రు.

ఇంద్రుఁడు—దేవతల కధిపతి.

## స్త్రీలు.

సరోజిని—కీర్తివర్మ పుత్రికయుఁ గథానాయికయు.

కమలిని—ధనవర్మ పుత్రికయు సరోజిని నెచ్చెలియు.

సానంద——ఒక గొల్లపడఁతి.

(మఱికొందఱు స్త్రీలునుఁ బ్రవేశించుచున్నారు)



# శుద్ధపత్రిక.



| పుట | పఙ్క్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 3 | 9 | శాఖయు | శాఖుఁడు |
| 22 | 2 | లాయొగాఁబ్రియ | లాయొగాప్రియు |
| 25 | 18 | సుగంధి | ఉత్సాహ |
| 44 | 26 | విడురచో | వీడుచో |
| 49 | 21 | మఝ్యర | మైర |
| 59 | 15 | లనూతన | లనూనత |
| 60 | 6 | వృద్ధుఁడ | వృద్ధుఁడు |
| 67 | 20 | సేవకుల వెంటరా | సేవకులు వెంటరా |
| 76 | 24 | గతినియ | గతినీయ |
| 99 | 20 | ప్రియమైన | ప్రియయైన |
| 100 | 2 | సరోజినీకనులు | సరోజినీకమలినులు |
| 105 | 4 | మతృష్టము | మదృష్టము |
| 106 | 23 | దుష్టబుద్ధితన | దుష్టబుద్ధిఁదన |
| 107 | 7 | యూపయిల్ | యూపయిన్ |
| ,, | 8 | ప్రాణముల్ | ప్రాణమున్ |
| ,, | 15 | తరుణ | ప్రథిత |
| 111 | 19 | నుబ్బైయది | మబ్బైనది |
| 122 | 26 | పెండ్లోఁ | పెండ్లైనఁ |

| | | | |
|---|---|---|---|
| 129 | 24 | నిన్ను | నన్ను |
| 137 | 6 | వాంఛమయి | వాంఛమెయి |
| 139 | 21 | వాఁడయిన | వాఁడైన |
| 140 | 3 | ములుకులయి | ములుకులై |
| 142 | 6 | వయిరాగ్య | వైరాగ్య |
| 144 | 3 | ధార్మికులయి | ధార్మికులె |



శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# సరోజినీ నాటకము

## ప్రథమాంకము.



[నాంది]

శా. శ్రీరాధారమణీమణీమృదుతను ♦ శ్లేషాభిలాషన్ శుభా
కారుండై హరి సేరఁబోవఁ బొలయ ♦ ల్కన్ దూరమా రాధతోన్
దూరంబైనను హృద్గతుండఁ జుమి య ♦ న్చున్ దేల్చి క్రీడించు నా
త్మారాముండు యదూద్వహుండిడుతమీ ♦ కానందకల్యాణముల్.

ఉ. పాండవులన్న న్యాయగుణ ♦ భాసితులంచుఁ దలంచి వారికిన్
భండనమందు నేర్పునన ♦ పార సహాయముఁ జేసి కౌరవ్రా
ద్దండుల న్యాయహీనులమ ♦ దంబడగించిన కృష్ణుఁడీసభా
మండనమౌచు మీకిఁటన ♦ మందశుభంబు లొసంగి ప్రోచుతన్.

[నాంద్యంతమున]

సూత్రధారుఁడు-- కాలవిలంబనమేల?

గీ. సరసకవితావిలాసులై ♦ శశ్వదమల
కీర్తిఫలవృక్షపికములై ♦ యార్తిహరణు
లగుచు వెలుగొందినట్టి మ ♦ హాకవీశ్వ
రులను ధ్యానింతు వాక్సిద్ధి ♦ ఫలమిడంగ.

(ముఖమెత్తి) అదిగో! నాయిల్లాలిటు వచ్చుచున్నది.

క. తొలుకరిమెఱుపోయన ని
స్తులసౌందర్యంబుఁదాల్చి ♦ శోభనవతియై
కులకాంతయిటు లెవచ్చెఁ
గలువలచెలిఁబోలుముఖము ♦ గ్రాలుచునుండన్.

నటి.— (ప్రవేశించి) నాథా! నమస్కారము నన్ను సత్వరముగా ర మ్మని సెలవిచ్చివచ్చితిరి. ఏమికారణము.

సూ.— కళ్యాణమస్తు. కాంతా! నీకుఁ బ్రతిదినమును గారణము చెప్ప వలెనా? మన దైనందినవర్తకము మఱచిపోయితివా?

నటి.— నాథా! అట్లనుచున్నా రేమి? మనము వర్తకులమా? నర్త కులనఁబోయి యట్లంటి రేమో!

సూ.— ప్రేయసీ! కాదు. ఇదివినుము.

చం. కవిహృదయంబుపాదు; రస ♦ గర్భితసత్కృతి తీయమావి; సాం
ద్రపురసపద్యరాజి సము ♦ దారమరందవిపాకమాధురీ
ద్రవవిలసత్ఫలంబులు; స ♦ దస్య లపారరసజ్ఞులౌ ధనుల్
నవకవితాగుణాసవము ♦ నారతమమ్మెను వారికిచ్చుటన్.

నటి.— (నవ్వుచు) బహుసరసముగావచించితిరి. అవునుగాని యీఫలా సవమందఱకు రుచించునా?

సూ.— చెలీ! అసూయారోగగ్రస్తులగువారికిఁదప్ప,

సీ. సహజమాధురిఁగ్రాలు ♦ సహకారసత్ఫలం,
బొకనోరఁదిక్తమై ♦ యొనర లేదె?
సహజశీతకరుండు ♦ చంద్రుండు నొకవేళఁ,
గొందఱికిని వేడి ♦ గూర్ప లేదె?
సహజకర్ణావతం ♦ సముగాన మొకవేళఁ,
గొందఱికివిరక్తి ♦ గొల్ప లేదె?
సహజసౌరభమిచ్చు ♦ చంపకాదిసుమంబు,
లొకవేళ వెగటుగా ♦ నుండ లేదె?

గీ. యట్లె యీర్ష్యామయావేశు • లైనజనుల
చెవులకుఁగటువుమాధురీ • కవితగూడ
నంతమాత్రంబు చేతనా • యాయివస్తు
వులకుఁగవితకుఁదగ్గునే • వెలయొకింత.

నటి.-- నాధా! మీరువచించినది సత్యమే. ఇప్పుడు మీరేరూపకము
ను బ్రయోగింపనుద్యమించితిరి ?

సూ.-- సఖీ!

చ అలఘుకవిత్వనుత్యతుర • గాన్వయచారురసాలసాలస
ద్విలసితసారశాఖయు సు • ధీనిలయుండునునైన వేంకటా
చలకవివ్రాసె సూరిజన • సమ్మతమై తనరన్ సరోజినీ
సలలితరూపకంబు సఖి! • సత్సదనీసభఁ దత్ప్రయోగముఁ.

నటి.-- ప్రాణేశ్వరా? ఈరూపకనామము నేనెప్పుడు వినినట్లులేదే?

సూ.-- నిజమే నీవు వినియుండవు. ఇది యాంగ్లేయ మహాకవియగు
షేక్స్పియరుచే రచింపఁబడిన రోమియో జూలియట్ యొక్క సరసనాటకమును గథా
సూత్రముగాఁగొని యభినవముగా నీరూపక మీయాంధ్రకవి
వ్రాసె.

నటి.-- నాధా! ఈనూతనకృతి పీరల రంజింపఁగలుగునా ?

సూ.-- ప్రియా! ఏమి యట్లులంటివి ?

ఉ. ప్రాఁతరకంపుఁజీరలును • బ్రాఁతరకంపు విభూషణంబులున్
బ్రాఁతరకంపుసంస్కృతుల • భామినిమెచ్చునె యీశతాబ్దమం
దోతరుణీ! యగణ్యముగ • నుద్భవమయ్యెను మార్పులన్నిఁటన్
బ్రాఁతపురాణగాథల స • భాసదు లొల్లరు పూర్వమట్టులన్.

నటి.-- నిజమే. తాముసెలవిచ్చిన మార్పులన్నియుఁ జూచుచునే యు
న్నాను. అట్లైన నీ నవరూపక మీ సభాస్తారుల నానందింపఁ
గలుగునని నమ్మెద.

సూ.-- అవును. విస్తారమెందుకు?సభాసదులు కాలవిలంబమునకుసహిం
పరు. కావున నీవిప్పుడు శరదృతువునుగూర్చి గానముసేయుము.

నటి.-- చిత్తము. ఈశరదృతువునందు

ఉ. శారదచంద్రికాభయును ♦ స్వచ్ఛపయోధరశోభయున్ నిజో
దారయశంబుఁదెల్పఁగ వి ♦ యత్పదలక్ష్మి చెలంగెడుఁ సుఖా
హారమృణాళపఙ్క్తికయి ♦ హంసలు వ్రాలు జలాశయంబులన్
శారదమేఘముల్ స్వజన ♦ సంపదఁగాంచఁగవచ్చెనోయనన్.

సూ.-- (నవ్వుచు) సఖీ! లెస్సగావర్ణించితివి. మొన్నటిదినమున మన గృహారామసరస్సునందు నేత్రానందముగ నేను జూచినవిషయమునకు నీవు వర్ణించిన రెండవయంశము తూచినట్లు సరిపోయినది.

నటి.-- (నవ్వుచు) ఆవిషయమేమి?

సూ.-- చెలీ! శరదృతువు లభించినదను నాతురతతోఁగాఁబోలు మొన్న యుదయమున నొక కలహంస మన సరస్సునఁజేరి నిశాదివవిచక్షణలేక యీయుదయమువర కచ్చటనేయున్నది.

చ. అరిధృతకీర్తిఁబోవఁ గమ ♦ లాకరసద్మముఁ జేరఁగాఁ బ్రభా
కరునిఁగళానిధిన్ గణన ♦ గాంచకయా కలహంసుడద్దిరా
చరచరబోవుచున్ స్వగృహ ♦ సామ్యముగా నివసించెనందులఁ
దరుణముఁబక్షపాతులు స ♦ దాపరికించుచు నుందురేగదా.

(తెరలోపలఁ దిరస్కారముగా) ఓరి నటాధమా! పరరంధ్రాన్వేషణపరాయణా! వృథా నిందాగర్భప్రలాపా!

చ. గరువమొ పోతరంబొ కను ♦ గానక ప్రేలెదవేల? నాసహో
దరులగణింపకుండినను ♦ ద్రవ్యమునే గణియింపఁజూచినన్
జిరతరసౌఖ్యభోగములఁ ♦ జెందఁగనెంచిన నీకుభారమే
కరణినిగల్గె? సభ్యులడుగ ♦ న్వినిపించితె నాచరిత్రమున్.

ఇదిగో నిప్పుడేవచ్చి నాకరవాలమునకు నిన్నాహారముచేసెదను.

నటి.-- (సాధ్వసముతో) నాథా! ఏమి యీయుపద్రవము. నాదేహమూ కంపమెత్తుచున్నది అమంగళము తొలఁగుఁగాక. (అని మగనిని కౌఁగలించుకొనుచున్నది)

సూ-- (నటిని గట్టిగఁ బట్టుకొని)

క. అడుగులుతడబడనిటుభయ
పడియెడలిని ద్రఢిమయడఁగఁ బడఁతీ! నీవి
య్యెడనిట్లు వడఁక నేటికి
నడ రేటికి జడుని నుడుల కర్థముగలదే?

నీ నేత్రాంబుజముల వికసింపఁ జేయుము. భయము లేదు.

నటి-- అయ్యో! నాకు భయము వేయుచున్నది. ఆజడప్రాయుఁ డెవ్వఁ డో నిష్కారణముగా మిమ్ము————చో నాకేమిగతి?

సూ-- ఓసి యబలా! వినుము. ధృతకీర్తి జ్యేష్ఠపుత్రుఁడగు కలహంసుఁడు నేనుజడవినపద్యమున కపార్థముఁగల్పించి సాపరాధుఁడు గనుకఁ దనయం దారోపించుకొనుచున్నాఁడు. నాపద్యార్థమిదిగదా.

అరి=తన విరోధియైన, ధృత=ధరింపఁబడిన అనఁగా నిదివరకందున్న, కీర్తి=బురద, పోవన్-ఎండిపోవఁగా, కమలాకరసద్మము-సరస్సనెడుగృహమును, చేరఁగాన్-ప్రవేశించుటకు, ప్రభాకరునిన్-సూర్యుని అనఁగాఁ బవలును, కళానిధిన్-చంద్రుని అనఁగా రాత్రిని, గణనగాంచక-పాటింపక, యాకలహంసుఁడు-ఆకలహంస, చరచరబోవుచున్-వడివడిగా నడచుచు, అందులన్-ఆసరస్సునందు, స్వగృహసామ్యముగా-తన యింటియందువలెనే, నివసించెన్-ఉండెను, పక్షపాతులు-పక్షులు, తరుణము-మంచికాలమును, సదా-ఎల్లప్పుడు, పరికించుచు నుందురేగదా-చూచుచునేయుందురుగదా.

అయినను మనకీ వృథాకలహములతో నేమిపని. ఇఁక మనము పోవుదమురమ్ము.

నటి—— అదియే మంచియుపాయము.

(అని నిష్క్రమించుచున్నారు.)

## ప్రస్తావన.

[తర్వాత సాహంకారుఁడై కలహంసుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కల— ఆ! నటాధమ? పరరంధ్రాన్వేషపరాయణా! వృథానిందాగర్భప్రలాపా!

"చం॥ గరువము పోతరంబు" అను పూర్వోక్తపద్యమును మరలఁ జదువుచున్నాఁడు. (నలుగడలఁబరికించి). ఆహా! ఆనటాధముఁ డింతలో మాయమయ్యెనే? ప్రాణములు దక్కించుకొనుటకుఁ బారిపోయెను గాబోలును. అయినను నాక్షుద్రనటునితో నాకేమిపని? ఇఁక ముందు నాయుద్యమము విచారించుకొనెదనుగాక. అన్నా! అవసానకాలమునందు మాతండ్రిగారు ధృతకీర్తి వ్రాసిన మరణశాసనము చూడఁగా నాకెంతయుఁ జింతాకరమగుచున్నది. ఆయన సోదరులమగు మామువ్వురను నైకమత్యముతో నుండుఁడనియుఁ గడు వన్నెఁగాంచిన తమవంశమునందుఁ గీర్తిప్రతిష్ఠలు నిలుపుఁడనియు మొదలగు హితబోధల నెన్ని చేసినను దాను జివరకుఁ గల్పించిన మరణశాసనపద్ధతుల నిదానముగాఁ బరికించినచో నవియన్నియుఁ బక్షపాతమును సూచించుచున్నవి. నాపెద్దతమ్ముఁడైన కళానిధికిఁ బాపము చతుర్థభాగమును, నాకుఁ దృతీయభాగమును, జిన్నతమ్ముఁడగు ప్రభాకరునకు సశేషమంతయును నొక పారసీకహయమును దనమేలికవచమును ధనుర్బాణాదిపరికరములును నేర్పాటుచేసె. ఈవిభాగములవలన మాలోమాకుఁ బరస్పరభేదములు కల్పించె. మాతండ్రి యభిప్రాయము తమయాదాయమంతయు స్వార్జితమని కాఁబోలు. మేముమాత్రము వారికి స్వార్జితులము కామా! ప్రభాకరుఁడొక్కఁడే శౌర్యధనుఁడనియుఁ, గీర్తికాముఁడనియు నాయన పలుమాఱు నొక్కి చెప్పుచువచ్చెను. అయిననేమి? మాకుటుంబస్వాస్థ్యమంతయును నామరణశాసనమునుగూడ నిప్పుడు నాస్వాధీనములోనే యున్నవిగదా! తన శాసనప్రకారము నాతమ్ములకు నేను బంచిపెట్టకున్న మరణించిన యాయన నన్నేమి చేయఁగలఁడు. పోనీ! తమ్ముల బాధ చూచుకొన్నను నిదివరకే వారణాసిపట్టణమునకుఁబోయి శాస్త్రాభ్యాస మొనరించుచున్న

నా పెద్దతమ్ముఁడు కళానిధికి జోక్యమక్కఱయే లేదు. చిన్నతమ్ముఁడు ప్రభాకరుఁడు వయస్సునఁగూడ నిరువదేండ్లవాఁడగుటచే నంతఁగా నన్నెదిరింపఁజాలఁడు ఈస్వాస్థ్యమునకంతయు నాపోశనముపట్టుట కిదియే మంచిసమయము. ధనవంతుఁడగుటకన్న మిన్నయగుపదార్థమున్నదా?

సీ. చదువకున్ననుసర్వ ♦ శాస్త్రభాండాగార,
ముండుచోనాతండు ♦ పండితుండు
ఈయకున్న ననంత ♦ హేమరూప్యంబులఁ,
దనయొద్దఁగలవాఁడె ♦ దానమూర్తిఁ
పెట్టకున్ననుజతు ♦ ర్విధభక్ష్యముల్ నిత్య,
మారగించెడువాఁడె ♦ యతిథిరతుఁడు
కలిసిమాట్లాడుచు ♦ గౌరవింపకయున్న,
బదిమందిగలవాఁడె ♦ బంధుసఖుఁడు
గీ. ధనముగల్గినమాత్రాన ♦ ధన్యుఁడగును
సర్వమూలంబునని మనం ♦ బలరుచుండు
వెండిలేకున్న జీవన్మృ ♦ తుండుగాన
దానినార్జింతు సమయంబు ♦ దాఁటనీక.

ఆహా! ధనమహాదేవియొక్క ప్రాభవ మింతయని వర్ణింప నెవ్వారి తరము.

చ. సరసునిఁ జేయు మూర్ఖజనుఁ; ♦ సంకరుసత్కులజాతుఁ జేయు; మే
దురసుగుణాభిరాముని ♦ దుర్గుణునిన్ బచరించుఁ; గోరకే
చిరతరసద్యశంబును వి ♦ శేషసుఖంబును సంఘటించు; నీ
వరధనదేవతాశ్రయ మ ♦ పారశుభాస్పదమెంచి చూడఁగన్.

మఱియు,

చ. నరునకు దార్ఢ్యహైన్యము న ♦ నల్పరుజార్తియు సంచితౌషధో
త్కరమున నేతొలంగునని గాఢ ♦ ధనార్జనవృత్తిచే భిష
గ్వరులుదలంతురయ్యది య ♦ బద్ధ మసత్యము; సత్యమేదనన్
బరమరహస్యమూలిక ధ ♦ నంబెసుఁడీ సకలామయాళికిన్.

కాఁబట్టి,

గీ. అట్టిమూలికగలవాఁడె ♦ గట్టివైద్యుఁ
డనఁగఁజెల్లునుగాని సి ♦ ద్ధౌషధంబు
లంచుఘుటికలఁజూచి హ ♦ ర్షించునతని
ననగవచ్చునె వైద్యుఁడ ♦ టంచుభువిని.

మఱియు,

క. భవరోగవైద్యుఁడంచును
భువి నారాయణునిఁదలఁచి ♦ పొగడెదరయయో!
యవితర్కితబుద్ధులుగా
చవిగొని శ్రీదేవిఁగొలువఁ ♦ జాలనివారల్.

ఈశ్రీదేవియొక్క మహాత్మ్య మనిర్వచనీయముగదా.

సీ. పార్థివోత్తముపుత్త్రిఁ ♦ బరిణయం బాడంగఁ
జేయించునెయ్యది ♦ చెనటినైన
బంగారుమేడలోఁ ♦ బాన్పుపైఁబవళింపఁ
బచరించునెయ్యది ♦ పందనైన
వలదన్న బూర్ణవి ♦ ద్వాంసులఁజెంతకుఁ
గూర్చెడునెయ్యది ♦ కూళకైన
వాంఛింపకయె యాప్త ♦ వర్గముల్ కల్పించుఁ
జనవుమైనెయ్యది ♦ జడునకైన
గీ దూరదేశోద్భవంబు న ♦ ద్భుతమపూర్వ
మైనవస్తుప్రతాన మె ♦ య్యదిఘటించు
నంగరక్షగఁబతికినె ♦ య్యదిచెలంగు
నట్టిశ్రీదేవి ధ్యానింతు ♦ నాశ్రయింతు.

(తన్నుఁ జూచుకొనుచు) ఓయీ! కలహంసుఁడా! భావిధనార్జన మదాంధతచేతఁ గన్నుగానక భవత్పితృశాసనములనెల్ల నేటఁగలిపితివి గా! ఆయన మరణించునపుడు బోధించిన హితోపదేశములను నాయన తోడనే యంతరింపఁజేసితివిగా! ఛీ! మూర్ఖా! భ్రాతృనాశనమును స్వ

పురోవృద్ధియుఁ గోరెడు నిన్నే దైవము బాగుచేయునురా! ఐకమత్య ముకన్న మిన్నయగు పదార్థమును బరస్పరానురాగముకన్న వన్నె దెచ్చెడు కులాలంకారమును వేఱున్నవే? వీరుమువ్వురు నొక్కకడుపునఁ బుట్టినవారుగారా? ఒక్కచెట్టుకొమ్మలుగారా? ఒక్కగూటి పిల్లలుగారా? జ్యేష్ఠుఁడవైయుండుటచే నవరజులనుగాపాడి వారిబాగుఁగోరుటకు బదులుగా నీవే పెడత్రోవలఁబెట్టి ధనాశచే వారలఁ బాడుచేయుదువా? ఈబుద్ధి యిఁకవిడనాడి వారిని బ్రేమించి తండ్రిపోయినతర్వాత నంతటివాఁడవైన నీవు వారినిఁ గడునాదరించి నీమనస్సును గడునిర్మలముగాఁ బ్రకాశింపనిమ్ము. దురాలోచనల కెడమీయకుము. ఆఁ! ఛీ! ఇవి యేటివాక్యములు. ఏమిది! నామనస్సిప్పుడునన్నిట్లు త్రిప్పివేయుచున్నది. ఇంతకుమున్ను నానోరినుండి వెడలిన హితబోధయంతయు నీచునకు నప్రయోజకునకుఁగాని నావంటిపూరుషవర్యుని కన్వయించునా? రుజోద్రేకంబునను సంధిజ్వరమువలనను నీలోకమువిడుచునపుడేమియుఁ దోఁచక ప్రేలిన నాతండ్రిమాటలకా యింతవిచారము! ముసలితనమున ఘోషించిన వాక్యములు శుక్రనీతులగునా! అట్టివాండ్ర వాక్యములు వాయుధూతములగు నిసుకతిన్నెలపై వ్రాయబడిన యక్కరములవంటివి. పోయినవాఁడువ్రోయె. ఆయన పునర్జీవించి నాకార్యముల కీడు మేళ్లను గుర్తెఱుఁగఁగలుగునా? నాసాంసారికకష్టములలో సాయము సేయనోపునా? కావున నాతనిహితోపదేశ మాతనితోడనే గతింపనిచ్చెద. ఆత్మబుద్ధిహితమ్మనియున్నదిగాన నట్లుఁ జేయనిశ్చయించెద. తమ్ములనుండి నాకేమయినభయముగలదాయన నట్టిది లేదనుట స్పష్టము. పెద్దతమ్ముఁడు కళానిధి కాశిలోనున్నాఁడుగదా. చిన్నతమ్ముఁడు ప్రభాకరునిపై నిదివరకే యొక కన్నుంచితిని. కపటకవృత్తిలోఁబెట్టి వానిబుద్ధి మందగింపఁజేసితి. సహజముగా సుగుణములు వానియందున్నమాట సత్యమయినను వానినన్నిటిని మాయాచాతుర్యముచే దుర్గుణములుగా మార్చితి. వేయేల? వానిని నాయింటఁ బెద్దసేవకునిగాఁ జేసితి. ఇట్లు వీరిద్దఱు వశ్యమయినతర్వాత నాకువశ్యముగాని దిఁకేమిగలదు. ఇదియే మంచిత్రోవ. అయినను నేనొకసారి ప్రభాకరుఁడున్నయెడకుఁ బోయి

వాని విధేయతాగుణ మించుకం బరికించెద. ఈసమయమునకు వాఁడు గృహారామమం దుండునుగదా?

(అని నిష్క్రమించుచున్నాఁడు)

రంగము 2. గృహారామము.

[ప్రభాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ప్రభా-- అన్నా! నాయవస్థ కడువిచారకరము ఏలయనిన,

చ. పిత గతియించుటన్ మదిఁ ద♦పించుచునుంటిని నేటినుండి వి
ఖ్యతగుణ మాతయ్యాయి మ♦నసుల్ జననాఁటనె చిన్నపుచ్చనీ
క్షితిగల యన్నగారొకరు♦ ఖేదముఁ బెంచుదురింతె కాని నా
స్థితియణుమాత్రమున్ సరకు♦ సేయరుగా! యిక నేటిసౌఖ్యముల్.

నాయన్న నన్నింత దుఃఖపెట్టుచున్నాఁడు?

సీ. తనగుఱ్ఱమును బ్రతి♦దినమును సాహిణి
చేతనన్ దోముగాఁ♦ జేయుమనుట
తనవంటవారికిం♦ధన శాకముఖ్యముల్
మాపు రేపును నన్ను♦ మర్చుమనుట
తనకపకారులచేత♦ ననయంబు సేవ్యంపుఁ
బను లెల్లఁ జేయింప♦ వలయుననుట
తనపూలకోటకు♦ ఘనయంత్రజలధార
లేపుమైనన్నుఁ బో♦యింపుమనుట
గీ. అకట! మత్కర్ణశూలమై♦ యంతరంగ
గాఢనిర్ఘాతపాతమై♦ కనలుచున్నఁ
దగినసమయంబు గామినిం♦ దాఁక నేను
దాళియుంటిని దన్నిరా♦ దరణమునకు.

మఱియు,

గీ. సానపెట్టని వజ్రంబు♦ చాయఁ జక్కఁ
జేయనివాలంబుమాడ్కి‌ను♦ పాయముగను

పన్నె దేర్చని మృదుకాచ ♦ పాత్రయట్టు
లధ్యయనశూన్యమగుచుమ ♦ మ్మయ్యెబుద్ధి.

అన్నా ! తలఁపఁగా వీఁడు నాసహోదరుడగునా?

ఉ. అన్నలు లేరొ! లోకమున ♦ నక్కట!తమ్ములు లేరొ! యర్థకా
మోన్నతినిట్లు జేసిన స ♦ హోదరుఁడింకొకఁ డెందు లేఁడు నా
పున్నెపుఁజెట్టదొక్కటియె ♦ బో, యిటులన్ ఫలియించెవానిచే
బన్నమునొందితిన్ విపుల ♦ భాగ్యసుఖంబులఁ గోలుపోయితిన్.

గీ. అగ్రజుఁడుపితృతుల్యుఁడ ♦ టంచుభువిని
నార్యజనములచేవిని ♦ యతులభక్తి
నింతకాలంబు నెంతెంత ♦ యిడుమలైన
నోర్చియుంటిని క్షణమైన ♦ నోర్వనింక.

మఱియు,

సీ. కడుపారభుజియింప ♦ గాసీఁడు తనధన,
మంతయుగంగ పాఁ ♦ లైనకరణి
మంచిబట్టల నేధ ♦ రించి బైటకుఁబోవఁ,
గన్నులనిప్పుకల్ ♦ గ్రక్కుచుండు
న్యాయశాస్త్రంబుల ♦ నభ్యసింపఁగఁజూచి,
యిది యేటికనుచున ♦ న్బెదరఁగొట్టు
క్రీడారతుఁడనైయె ♦ కించుకయటుబోవఁ,
బనియొట్టులనిపట్టి ♦ పల్లలార్చు

గీ. అక్కటా! యన్నవస్త్రాదు ♦ యనసుఖంబు
లకునునోచియు నోచని ♦ వెకలుబోలె
మెత్తగానుండుటంజూచి ♦ మొత్తబుద్ధి
యయ్యెమాయన్న కింతటి ♦ యల్పుఁడున్నె?.

నోరు వెలితిచేసికొనఁ దలఁచిన నిట్టివియే యినుకపాతరలవలె నెన్ని యోగలవు. అవియన్నియుఁ జెప్పుకొని నిష్ప్రయోజనముగదా! వానిట్లో నెడిరించిపోరాడి నాభాగమును నేనుసాధించుకొనుటకన్న నీక

సాంత్వనవచనములతోఁ గాలక్షేపము చేయవలనుపడదు. ఓయి కలహంసుఁడా!

ఉ. జాగ్రతఁ గాచుకొమ్ము వర ♦ జాతుల భాగము వారి కిమ్ము, నీ
వ్యగ్రతఁ దాచుకొమ్ము సరి ♦ వారలలోఁ దల యెత్తుకొమ్ము నీ
యాగ్రహబుద్ధి వీడి నిర ♦ పాయతనుండుము కాకయున్నచో
విగ్రహముల్ ఘటించుమన ♦ విగ్రహముల్ నశియించువానిలోన్.

[అంతటఁ గలహంసుఁడు ప్రవేశించుచున్నాఁడు].

కల-- (తనలో) ఈదినమునఁ బ్రభాకరుఁడేలొకో యాగ్రహవశుఁడైన ట్టులున్నాఁడు. గంభీరముగా మాట్లాడి చూచెదను. (ప్రకాశముగా) ప్రభాకరా! ఈదినమున దినకృత్యములన్నియు నెరవేరినవా?

ప్రభా- ఆకృత్యములేమి?

కల-- ఏమి? నీకృత్యములే నీకుఁ దెలియవుగాఁబోలు.

ఉ. పూవులతోటకున్ జలము ♦ పోయఁగఁ జూచుట, వంటవారిచేఁ
దావులు గ్రమ్ము భక్ష్యములు ♦ దారతసిద్ధముగా నొనర్చుటల్
గోవుల మేఁకలన్ దినము ♦ గోష్ఠమునందునఁ గట్టుటాదిగా
నీవొనరించు కార్యముల ♦ నేఁడిదెలక్ష్యము సేయ వేటికిన్.

ప్రభా- కలహంసా! ఇది బాగుగ వినుము.

ఉ. ఐనది యేమొ యయ్యె నిపు ♦ డాడినమాట మఱొక్కసారి న
జ్ఞానతఁ బల్కెదేమొ కడు ♦ జాగ్రత; యగ్రజుఁడన్న బుద్ధిచేఁ
బూనితి శాంతమిందనుకఁ ♦ బూర్వజుఁ డన్న గురుత్వముంచుకోఁ
బూనితి వేని భాగమును ♦ బూర్తి నొసంగుము స్వస్థచిత్తతన్.

కల-- ఔరా ప్రభాకరా? ఎంతటివాఁడవైతివిరా?

ఉ. చనవునఁ బిల్చి పల్కరభ ♦ సంబున నాతల కెక్కినాఁడవే?
కననిది యేఫలంబు పలు ♦ గాకి! నినున్ గరుణావలోకనం
బునఁ జిననాఁటనుండి నుతు ♦ పోలికఁ బోషణ చేసినందుకున్
దినఁగఁ దినంగ గారెలకుఁ ♦ దిక్తత వచ్చుట యట్టిదే కదా!.

ప్రభా- కలహంసా! చిన్ననాటనుండియు సుతుపోలిక నన్ను నీవేపోషించితివిగా! నిన్ను సోదరుఁడని పిల్చుటకు సిగ్గగుచున్నది.

సీ. అవరజస్వాపతే ♦ యాంబుధినింకింప,
నందుఁబుట్టినబడ ♦ బాగ్నియనఁగ
సత్కులకల్పభూ ♦ జశ్రేష్ఠమునకును,
మొదలమొల్చినగచ్చ ♦ పొదయనంగ
నతులకీర్తిప్రభా ♦ యుతుఁడగుజనకేతు,
కాండంబునకునెన్ను ♦ కణుపనంగ
సద్వంశదుగ్ధాబ్ధి ♦ జనితకీర్తిమృగాంకు
కరముఁబట్టినరాహు ♦ గ్రహమనంగఁ

గీ. బుట్టితివినీవు మాతోడఁ ♦ బుట్టినాఁడ
వనగలజ్జాకరంబదే ♦ మనఁగవినుము
భ్రాతృభాగంబునపహరిం ♦ పంగఁదలఁచు
చెనఁటినేమనిపిలువ వ ♦ చ్చునొయెఱుంగ.

కల--ఓరీ! నిన్నేమో విధేయుఁడవనుకొంటిని.

ఉ. ఎంతకు లేవునీవుగణి ♦ యింపఁగనింతటివాఁడవైతె? నా
బంతిని భక్ష్యభోజ్యము ల ♦ పారముగాఁదినిచియ్యబట్టికా
సంతభయంబులేక తెగ ♦ సాగెదవిట్టులుమూర్ఖబుద్ధి, నా
చెంతకుఁ జేరనీయనిఁక ♦ ఛీ! యెటుబోయెదొచూతమీపయిన్.

ప్రభా- ఆ! యేమి యీకండక్రొవ్వుమాటలు!

ఉ. ఎంతకు లేవునీవు గణి ♦ యింపఁగ నింతటివాఁడవైతె? నీ
బంతిని భక్ష్యభోజ్యము ల ♦ పారముగాఁదిననేలనాకు? కా
సంతయుజాలిలేకయిటు ♦ లాడెదె! భాగముఁబంపకున్న ని
శ్చింత మెయిన్ జరించెదవె? ♦ ఛీ! చవిచూడవె మత్ప్రతాపమున్

కల--ఓరిమూర్ఖా! నీప్రతాపమునంతయు నామీఁద నేచూపెదవుగా! అయిననిప్పుడు నీకేమికావలయును?

ప్రభా-పితృమరణశాసనప్రకారము నాయావద్భాగము నాకుఁగావలెను.

కల-- అదియెక్కడనున్నదిరా? తీసుకొనిరమ్ము అట్లులనే చేసెదను.

ప్రభా-మరణశాసనమే నీయొద్దలేదా? ఇంతద్రోహచింతయా?

కల-- ఓరితులువా? నీకుభాగమెక్కడిదిరా? నోరుమూసికొని పడియుంటివా నీకింతయన్నవస్త్రములిచ్చి కాపాడెదను.

ప్రభా-ఇఁకనీకు గౌరవము నెఱపనక్కరలేదు. నాశౌర్యము నెఱపి నాధనమును భూములును రాఁబట్టుకొందునులే.

కల-- ఓరిభ్రష్టా! నీకు ధనముగావలెనా? బంధనమిప్పించెదను. భూములుగావలెనా? బాములఁబెట్టించెదను.

[అని తోటమాలులను బిలుచుచున్నాఁడు].

తోట-(ప్రవేశించి) మహాప్రభూ! దండములు.

కల-ఈదండములకేమిగాని మీదండములతో నీపలుగాకినిగొట్టి బంధనములఁగట్టి పలుబాములఁబెట్టి నాయొద్దకుఁగొనిరండు. మీకు మంచి పసదనమిచ్చెదను.

తోట-(తమలో) పెత్తనము కలహంసప్రభువుగారిదిగదా. పాపము ప్రభాకరుఁడుగారును గడుమంచివారు. ఇప్పుడు ప్రభువుగారుచెప్పిన చొప్పునచేయకున్న మనపనిసరి. (ప్రకాశముగా) చిత్తము.

ప్రభా- ఓమూర్ఖులారా! బంగారుకత్తి దొరకినదని కుత్తుకలు దెగఁగోసికొందురా ?

ఉ ఓపలుగాకులార! విన ♦ రో! జమునింటికిఁబోవఁ జూతురో
కాపురుషుండు పాపముల ♦ కందువద్రోహపుఁబుట్ట వీనితో
మీపరమార్థమెల్ల సెడఁగ ♦ మీరును గూడెదరేకృతఘ్నులై
పాపమునాఁక మిమ్ములను ♦ బట్టెదఁగట్టెదఁ గొట్టెదన్ జుఁడీ.

తోట-చిన్నబాబుగారూ! మీరొక్కరు మమ్ములను గొట్టఁగలరా ? ఏదీచూతము. [అని ప్రభాకరునిఁ గట్టఁబోవుచున్నారు]

ప్రభా-ఓరిసేవకులారా! నాహితబోధమీకు రుచింపదుగా!

పంచచామరము. ధనంబొసంగువాఁడె మీకు ♦ దైవతుల్యుఁడౌనొకో
ధనార్థులొచ్చుబంధనంబుఁ ♦ దక్షణంబొనర్తురే?
ధనం బెటున్న నింధనంబు ♦ దారుణాగ్రహాగ్నికిన్
గనంగమీర లైతిరిప్డు ♦ కాచుకొండు జీవముల్.

మ. ననునాతండ్రినిఁ దాతనున్గొలిచియు ♦ న్నాళ్లీరు సేవింపఁగా
ఘనవిశ్వాసకృతజ్ఞ బుద్ధులని లో ♦ గర్వించితిన్ గాని యీ
దినముం జేసిన దుష్టకృత్యమునకా ♦ తిన్ంజెంది మీరందఱున్
ధనమీ నేపని నే నొనర్తురనిసం ♦ తాపించి శిక్షించెదన్.

[అని గదతోఁ గొట్టుచున్నాఁడు].

(అందఱును బరుగువారుచున్నారు).

మ. అకటా! సేవకులార! యర్థమునురో ♦ యంజూతురే? రండుమీ
ప్రకటానర్గళశౌర్యజృంభణము స్వ ♦ ల్పంబయ్యెనే యింతలో
సకలానర్థకుఁడస్మదగ్రజునివాం ♦ ఛన్ దీర్పఁగా లేరొకో!
శకలంబయ్యెనువానిపూన్కి; ధనన ♦ ష్టంబయ్యె మీ కెంతయున్.

అయినను వాండ్రననఁబని యేమి? ఈయనర్థకారకుఁ డీపలుగాకి యేగదా? వీనికి జ్ఞానమున్న వాండ్రేమి చేయఁగలరు? వీనికి గట్టిపాఠము జెప్పవలెను. ఓయీ కలహాంసుఁడా!

ఉ. ఏటికి నీదుజీవనము ♦ లేటికిఁ బెద్దతనంబునీకు, నిం
కేటికిఁ దండ్రిగౌరవమ ♦ దేటికి నీదగు బుద్ధి కాల్పనా?
బోటివె? పౌరుషంబనఁగఁ ♦ బూజ్యమెత్యాజ్యమె మానకీర్తులీ
పాటికి నిన్నుఁ గాటికినిఁ ♦ బంపెదఁ ద్రెంపెద మోహబంధమున్.

కల.-- (భయపడి) నాయనా! ప్రభాకరా! నన్నుఁ జంపెదవా? కొంచెము శాంతింపుము.

ఉ. చంపకుమన్న నన్నలఘు ♦ శౌర్యధురంధర! రోషవహ్నినిన్
జెంపకుమన్న నాపయిని ♦ ప్రేమ గణింపఁగదన్న! భాగముల్

పంపక మెట్లు చేయుమని ♦ పల్కెదో యట్టులొనర్తునన్న, నా
లింపగదన్న నీవనఁ జ ♦ లించెదనన్న భయావహుండనై.

(అని చేతులు పట్టుకొనుచున్నాడు).

ప్రభా- ఓరీ? ఇదియేనా నీపౌరుషము.

గీ. ఆడుదానిఁబోలె ♦ నాడెదుమాటల
నందుచున్న సిగయు ♦ నందకున్న
కాళ్లుబట్టుకొనెడు ♦ ఘనుఁడవీవారయ
నింతక్షుద్రబుద్ధి ♦ యెట్లుగల్గె.

శరణమన్నవానిని బాధింపఁగూడదు.

ఉ. మంచిదిచూతమీపయి స ♦ మంజసబుద్ధిఁ జరింపకున్న శి
క్షించెదనిన్ను నప్పుడెక ♦ సిగ్; బెలువాఁడవుగామి నేయుపే
క్షించితినింతకున్ దొలుత ♦ సేగునకోర్చి; మదీయభాగమున్
బంచియొసంగి భ్రాతృజన ♦ పద్ధతిగాఁజరియింపుమీపయిన్.

అట్లు చేయకుంటివేని,

మ. ఇదిగో! భీషణభీషణోత్కటమహా ♦ హింసప్రకాశంబునై
మదవద్దృప్యఖలారిదోర్బలసము ♦ న్మదాబ్ధిగర్భాగ్నియై
విదితాస్మత్ప్రధులాన్వవాయఖరదో ♦ ర్వీర్యాంకమై మత్కుభా
స్పదమై వెల్గెడు మండలాగ్రము భవ ♦ త్ప్రాణంబులం గ్రోలెడున్.

[అనికరవాలము ఝుళిపించుచున్నాఁడు]

కల-.(సాధ్వసముతో).

ఉ. ఓకరవాలమా! యిటుల ♦ నుల్లముఝల్లుమనన్ నినుంగనన్
బ్రాకటశౌర్యరాశివి కృ ♦ పాఖనివౌపయి; నన్ను మ్రింగఁగా
నాకలియెట్టులయ్యె? శర ♦ ణార్థినిఁ బ్రోచుట లెస్సగాదె నే
నీకిడువందనంబుఁగొని ♦ నెమ్మిభవత్ప్రభుఁదేర్చి కావవే.

(అని మ్రొక్కుచున్నాఁడు.)

ప్రభా--(నవ్వుచు).

చ. జనకసమిష్టకృన్మరణ ♦ శాసనకార్య మలంఘ్యమంచు నీ
యనుజవిభాగ సంహృతిన్వ ♦ హానికి మూలమటంచు వారితో
ననఁగి పెనంగి యేకమతి ♦ హాయిగనుండుట మేలటంచుహృ
ద్వనములరింపుమంచుఁగర ♦ వాలము! చెప్పఁగరాదెవీనితోఁ.

కల-- (తనలో) ఇంకనునన్ను వీఁడు భయపెట్టుచున్నాఁడు (ప్రకాశము గా) ఓతల్లీ! శౌర్యవల్లీ! కరవాలమా!

గీ. నడచుకొనియెద నీచెప్పి ♦ నట్లనేను
నేడుమొదలుగ నాతప్పు ♦ నేడుగాచి
నన్నుఁబోనిమ్ము ప్రాణధ ♦ నమ్ముతోడ
నిన్ను మఱువను నాజన్మ ♦ మున్నవరకు.

ప్రభా- (తనలో) వీనికిఁబశ్చాత్తాప మంకురించినట్లులున్నది. దీనిఫలము ముందుచూతముగాక (ప్రకాశముగా) కరవాలమా! క్షమించితి ననియుఁ బొమ్మనియుఁజెప్పుము.

కల-- మంచిదితమ్ముఁడా! పోవుచున్నాను. [నిష్క్రమించుచున్నాఁడు].

ప్రభా- ఈసంగతియంతయుఁ గృతజ్ఞసేవకుఁడగు సారంగునితోఁ జెప్పవలసియున్నది నేనునుబోయెదను. (నిష్క్రమించుచున్నాఁడు).



రంగము 3- కలహాంసునిగృహము.

కల--(తనలో) అన్నా ! నాబ్రదుకింతవరకువచ్చె ! మొన్నటివివాదములో నేశరణముజొచ్చుట మేలిచ్చినదిగాని లేకున్న నాతండ్రి కడకు నేనును బోవలసినవాఁడనేగద ! ఇప్పుడుమాత్రమేమైనది?

ఉ. భాగముపంపకున్న ననుఁ ♦ బంపకతప్పఁడు కాలుపీటికిన్
బ్రాగఘుమిట్లుపండెఁబితృ ♦ వాగనుశాసనమూలకంబుగా
నేగతినింకఁబోదునిఁక ♦ నేగతిఁ దమ్ముని సంహరింతు ; దు
ర్యోగముఁనాకు వానికిను ♦ యోగముఁగూర్చె విధాతకూళయై.

చ. కరమునగాండివిం దనదు ♦ కన్నుల ఫాలవిలోచనుం హృదిం
సిరిమగనిం గణించుకొని ♦ చిన్నలవన్నెలఁదేలు తమ్ముని
గరమరుదారఁజూచి ♦ ప్రతికార్యముఁ జేయఁగలేక సిగ్గుమై
శరణముఁజొచ్చునాకునిఁక ♦ సౌఖ్యములేడ? మరేడభాగ్యముల్.

చ సకలఫలప్రదాతల యి ♦ సౌఖ్యమొసంగెడు భూములార! వా
రకమదిరాక్షి గాఢపరి ♦ రంభతరంగవినోదరంగసాం
గకజనితోత్సుకంబులయి ♦ క్రాలెడుసౌధములార! నేటితో
నకట! ఋణంబుదీఱెనుగ ♦ దా! యిఁకమీకునునాకునిట్టులన్.

గీ. అతనిభాగంబునతనికీ ♦ యఁగనోప
దెవిరితోఁబోరిప్రాణంబు ♦ లీయనోప
దకట! నామానసంబిట్టు ♦ లడవివహ్ని
మృగయుమధ్యనుబడినట్టి ♦ మెకముపోల్కి.

ఈమనోరుజనుండి తప్పించుకొను నుపాయమేమియున్నది?

చ. కలికుమనంబ! నీవిటుల ♦ గాఁటియఁబెట్టుటనాయమా? సహో
దరుఁడనివానిభాగమును ♦ దప్పకవానికొసంగనొనటం
చెలుగవొ? తెల్వి లేదొ! యిటు ♦ లీపక్షనుబూనుచురాత్రులెల్ల జా
గరమునుఁజేసెదో? యిఁకవి ♦ కాసముదొకో! మేలు లేదుకో?

అయినను దీనినిట్లు దూషింపనేల? ఇదినామంచినే ఘోషించుచున్న
ది. పోనీ? కొన్నాళ్ళు పట్టణమువిడిచి పారిపోవఁదలంతునేని,

చ. జనములునవ్వరో? హితులు ♦ చాటునమాటునఁ గేలిసేయరో?
యనయము సేవకాళియప ♦ హాస్యముసల్పదొ? నాదుకామినీ
జనములుసిగ్గుఁజెందితమ ♦ సౌఖ్యములేటను గల్వఁదిట్టరో
యనుపమవంశకీర్తినిటు ♦ లాఱడిపుచ్చఁగనేలకూళనై

ఎటులైనఁ బ్రభాకరుఁడు చంపఁబడు నుపాయముదొరకిన సర్వ
శ్రేయోమూలముగనుండును. ఆకార్యము నాచేతులారఁగానోపదు. దీ
నికి సహాయమగు నుపాయమన్వేషించెద.

(అంత ఢంకారవము వినఁబడుచున్నది).

(మొగమెత్తి) ఈఢంకారవమేమియో ! నాప్రయత్నము జయ సూచకమయ్యెనా?

(అంత నొకసేవకుఁడు ప్రవేశించుచున్నాఁడు).

కల— సేవకా! ఏమియీవాద్యఘోష?

సేవ-నివేదించెద. రేపుమహారాజుగారి గరిడీశాలలో మల్లయుద్ధముజరగునఁట. మనయూరఁ బ్రసిద్ధికెక్కిన రుద్రమల్లునితోఁ బోరఁ దగిన ప్రతివీరునకై చాటించుచున్నారు.

కల--(సంతోషముతో) అట్టులనా? మహారాజుగారు బాగుగనాలోచించి యీకార్యము సంకల్పించినారు.

సేవ- ఎందులకయ్యా!

కల-- సకలసుగుణాకరుండయిన మన కీర్తివర్మమహారాజును బదభ్రష్టునిఁజేసి తానురాజ్యభారము వహించిన పిదప రాజ్యములోని మహాశూరులకందఱకు నీరాజుపయినయిష్టముకలిగినది.

సేవ.. అది తెలిసిన విషయమే?

కల--వారందఱునుబనిలేక తీరికకూర్చుండినయెడలఁ దనపై నెట్టియాలోచనలఁజేయుదురోయను నొకతలంపును నిట్టి మల్లయుద్ధముల నేర్పాటుచేసినయెడల వారందఱు బయలువెడలి యొకరివెంబడి యింకొకరు యుద్ధములయందుఁ జనిపోవుదురను నింకొకతలఁపునుగలిగి యిట్టులనేర్పాటుచేసినాఁడు అవునుగాని యారుద్రమల్లు మంచిశూరుఁడేనా?

సేవ-దేవా? ఆయనమల్లుఱలో మంచిశూరుఁడు.

కల--మంచిది నీవు పోవచ్చును.

సేవ-చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు).

కల--(తనలో) ఆహా! దైవమునాయందేయున్నట్టులున్నాఁడు. ప్రభాకరునిఁ జంపించుటకు మంచిసమయముదొరకినది. అతనినిఁ జల్లనిమాటలనుబ్బించి వంశప్రతిష్ఠల నిలుపుమని బుజ్జగించి యారుద్రమల్లుపైఁ బురిగొల్పితినా యాతఁడు నిక్కముగా వధింపఁబడును

ఇదియేమంచి యుపాయము.

మ. ప్రియుఁడా! యంచును జేరినమ్మకము ప్రా • పింపంగమాటాడిసం
శయముల్ మాని పిమల్లుపైఁజనఁగను • త్స్నేహంబుసంధింతు; ని
శ్చయమాజిన్ మనతమ్ముఁడోడియసువుల్ • చాలించుటల్ మల్లుచేన్
బ్రియముల్ సేకుఱుదానినాకు భగవ • త్ప్రేరేపణంబిట్టిదే.

మఱియును,

చ. ముదమునమల్లుఁ జేరిమన • మోసము వానికెఱుంగఁదెల్పి, స
మ్మదముఘటింతు వేని బహు • మానమునీశ్వనొసంగువాఁడనం
చెదఁబెనునమ్మకంబు ఘటి • యించి స్తుతించెద వానినెంతయుఁ
బిదపనుదీరదే మన య • భీష్టము; మల్లుడసాధ్యుఁడేగదా?

ఇదియే మంచియుపాయము. ఇట్లుఁ జేసెదగాక. (అని నిష్క్రమించుచున్నాఁడు.)

---

రంగము 4. ప్రభాకరుని సౌధము.

ప్రభా—(తనలో) సోదరుఁడగు కలహంసుఁడు మొన్న నాతో భాగము పంచియిచ్చెదనని నమ్మించిపోయి యింతవరకు నిశ్శబ్దమువహించి యున్నాఁడు. దీనినిఁజూడఁగా ముందపకృతినిఁ జేయఁదలంచి యప్పటిబాధానివారణమునకై యాపన్నాగముఁబన్ని తీపిమాటలతోఁ గాలముగడపినట్లున్నది.

గీ. అపకృతినిఁ జేయఁబూనిన • యట్టిఖలుఁడు
మేలిమాటలముందు న • మ్మింపఁ జేయు
విషముఁబెట్టఁదలంచు వి • ద్వేషిమధుర
భక్ష్యముల దానినిమిడించి • వాడినట్లు.

అయిన నిది ప్రథమపర్యాయముగనుక మోసపోయితిని.

గీ. గట్టినేలయటంచు నో • కండుకాలి
నూదినిలుపును నది దొంగ • యూబియైన

చరణమా వెన్కనిడు నే? మో ♦ సంబుఁబొంది
మరల నెటువిశ్వసింతు సో ♦ దరుని నైన.

కావున సారంగునితోఁగలిసి కలహంసుఁడున్న యెడకుం బోయి వానిని సాధించియైన నాభాగమును సంపాదించుకొనెదనుగాక.

[అంతఁ గలహంసుఁడు ప్రవేశించుచున్నాఁడు]

కల—తమ్ముఁడా! క్షేమమా? నిన్నటి నావిలంబమునకోర్చి క్షమింతు వని తలంచెద.

ప్రభా—క్షేమమే! విలంబమున కాత్రపడుచుంటినిగాని నీరాక నామన స్సున కుపశాంతి కలిగించెను.

కల—అట్లయినఁ బరమసంతోషము.

ప్రభా—ముందు జరుగవలసినపని యేమి?

కల—తమ్ముఁడా! వేఱె చెప్పనది యేమి? పెక్కుమాటలవాఁడఁగాను. పితృమరణశాసనప్రకారము నీభాగము నీవు తప్పక కైకొనవల సినదే. దానికేమియాక్షేపణ. ఇదిగో మరణశాసనము. (అని చూపుచు) నేనిదివర కాతంక పెట్టినకారణ మిదిసుమా!

ఉ. చిల్లరవాండ్రతోఁగలిసి ♦ చిన్నతనంబునఁ గోడెగాఁడవై
పల్లవపాణులంగవిసి ♦ భాగ్యముఁ జూఱఁగఁబుత్తువంచు నే
నుల్లమునందలంచి యటు ♦ లూరకయుంటిని; సద్గుణుండవౌ
టెల్లయెఱింగినేఁడిదె త్వ ♦ దీయవిభాగముఁ బంచియిచ్చెదన్.

ఈసంగతి నిదివరకేల చెప్పకుంటివంటివేని,

చ. చనవుననుండుటల్ బెదరఁ ♦ జాలెదుమాటలనంచు నేనటుల్
గనలఁదలంచితిన్ వొలుత; ♦ గౌరవహాని ఘటించువేళ నీ
ధనమును నీకె పాలిడుచుఁ ♦ దమ్ముఁడు నన్నుయుఁబోలెనుండుటల్
ఘనమనినీదుకోరికప్ర ♦ కారమొనర్పఁగఁబూనితిన్ మదిన్.

భాగముఁబంచియీయాయ నీయకొనలేదను నపఖ్యాతి యొక్కటియే నన్నుఁ జెందవలసియున్నది మనముప్వురలోఁ బ్రియసోదరుఁడు గళానిధి విద్యాభ్యాసంగమునకై కాశికిఁబోయియున్నాఁడుగదా?

(కన్నీరు పెట్టుకొని)

గీ. బహుదినములాయెగాఁబ్రియ ♦ భ్రాతతరలి
కాశికై; కండ్లు కాయలు ♦ గాచె వానిఁ
జూడకునికిని నే నెట్లు ♦ చూడఁగలనొ
కాశికిని గాటికేగుటో ♦ క్కటియెయండ్రు.

వాని భాగమును నా దానినిఁగూడ నీవే యనుభవింపవచ్చును. వంశ ప్రతిష్ఠల నిలిపినంజాలు. గతకార్యమునకువగచి యింతదూరము నీతో వివరింపవలసివచ్చినది. ఏమోయంటనని గమనింపకుము.

ప్రభా—(నమ్రు) భ్రాతా! నీవింతగా నాకడఁ జదువనక్కర లేదు.

గీ. బహుళపశ్చాత్తపనమొంది ♦ భ్రాత! నీదు
దుష్టహృదయంబుమాఱుచు ♦ దొడ్డదయ్యె
మలినహేమంబు కుంపటి ♦ మంటలోని
కాకచే వర్ణముల్ దేలి ♦ క్రాలినట్లు.

కల— తమ్ముఁడా! నీతో నొక్కసంగతి ముచ్చటింపఁదలఁచి సంశయ పీడితుఁడనై యున్నాను.

ప్రభా—సంశయమువలదు. తేటపఱుపుము.

కల— తమ్ముఁడా! నామీఁద నీకెట్టి సంశయమును లేదని నామీఁదనొట్టు పెట్టుకొని యొక్కసారి గాఢాలింగనముఁ జేసుకొమ్ము.

ప్రభా--మంచిది. (అట్లుచేయుచున్నాఁడు)

కల— వినుము. ఇప్పటి మనమహారాజు ధనవర్మ మన శత్రుకోటిలోని వాఁడు.

ప్రభా--అవును. మనతండ్రిగా రప్పుడప్పుడాసంగతి నాతో వాక్రుచ్చుచు వచ్చిరి. అయిననేమి?

కల— ఆతని నిరంకుశప్రభుత్వతీక్ష్ణతకోడి మహాశూరులందరు మూల మూలల దాఁగుచున్నారు.

క. ఖరకిరణుఁడు దన తేజము
హరిదంతములందుఁబవలు ♦ వ్యాప్తము సేయున్

నెఱిపొందితారకావళి
మఱుఁగునఁబడియుండుగాదె ♦ మహిమలడంగన్.

ప్రభా-- నిజమే! అయిన నిప్పుడు చేయవలయునది యేమి?

కల— ఆమహారాజుతో సఖ్యముచాటించుకొనుటమన కెంతయుమంచిది.

ప్రభా--అది యెట్లు సంఘటిల్లును?

కల— దానినేఁజెప్పుటకు సంశయపడుచున్నాను.

ప్రభా—సంశయము వలదంటినిగదా.

కల — తమ్ముఁడా! గరిడీశాలలో శేషాక మల్లయుద్ధముజరుగును. రుద్ర మల్లుఁడే యచట వీరుఁడు. వానితోఁబోరి జయించుశూరుఁడు గావలెనని పురవీధుల నీదినము చాటఁబంచినారు

ప్రభా—అట్టులనా అందుకుఫలము?

కల— మహారాజు దనకన్యనిచ్చి వివాహముసేయునఁట. ఇదిగో నా రతనాలబొమ్మ చిత్రపటము. (అని చూపుచున్నాఁడు)

ప్రభా—(అందుకొని యొకసారితిలకించి తలపంకించుచున్నాఁడు)

కల— నీవేమనినను సరేగాని యీకన్య నాముద్దుమఱందలుగానోచె నేని నేనెంతయు సంతసింతును. చూచితివా యీరామామణి సౌందర్యము.

గీ. రామగాదిది సుగుణాభి ♦ రామగాని
లేమగాదిది ముఖజిత ♦ సోమగాని
భామగాదిది సౌందర్య ♦ ధామగాని
రమణిగాదిది మరునిహా ♦ రమణిగాని

ఉ. మాకొఱకై సృజించెవిధి ♦ మాన్యసదన్వయకీర్తిఁబెంపఁగాఁ
బ్రాకటశౌర్యధుర్యదృఢ ♦ బాహుబలాకరమూర్తిగానినున్
నీకొఱకై సృజించె రమ ♦ ణీమణి బంగరుబొమ్మ సద్గుణా
నీకవిరాజితన్ రుచిర ♦ నీలసుకుంతల రాజపుత్రికన్.

ప్రభా—(తనలో) ఈపటము నన్ను మోహపెట్టుచున్న దే.

గీ. చిత్రగతయగుకన్యపైఁ జిత్తమెల్ల
కుదురువడియెను గోరికల్ కొనలుసాఁగెఁ
బ్రసవసాయకుఁడిట్టుల రాగబీజ
ములనువెదచల్లి తుదకునే ఫలములిడునొ?.

(ప్రకాశముగా) అన్నా! నీసంకల్పము తేటపడినది గాని మీకోటి మహాశూరులు వేనవేలుండ నేనా యీపనికిఁ బూనుకొనువాఁడను.

కల— (నవ్వుచు) నేనా పూనుకొనవలసినవాఁడను. సరిసరి. పురమెల్ల నిన్నే తగుజోడుగా నేర్పఱిచెను.

శా. ఔరా! రాష్ట్రమునందు నిన్మిగులు శూ రాగ్రేసరుండేఁడ? వి
స్ఫారోదారపరాక్రమంబునను దో స్సారంబువాటించి నీ
వారంగంబునఁగల్వ మల్లుఁడఁటఁ దోఁ కాడించి వెన్నీయఁడే?
యీరాజాత్మజఁజెట్టఁబట్టుటకు నీ వేకావె పాత్రుండవొ.

మఱియు నన్నుఁ రంగమునకుఁ బొమ్మనెదవా యది నీకేకాదు వంశమునకుఁగూడ నపఖ్యాతి గలిగించును. నీయెడల నాకేకాదు మనతండ్రికిఁగూడ నెట్టి యభిప్రాయమున్నదో నీవెఱుఁగవా?

చ. పలికె గతించువేళను బ్ర భాకర! మత్ప్రితివేమొగాని స
త్కులమున కెల్ల నీవలన గొప్పయశంబు ఘటిల్లునంచు; నేఁ
బలుమఱుఁజెప్పనేటికి న పారపరాక్రమువిజితారివై
చెలఁగెదు నీకు; నాపయిని జిత్తముపోలినలీలఁ జేయుమా.

ప్రభా—అగ్రజా!

గీ. ఈవుపల్కినపల్కుల నెంచియెంచి
తండ్రిగూడినవాక్యముల్ తలఁచితలఁచి
యధిపువియ్యంపుఫలముల నరసియరసి
పోయివచ్చెద మల్లుతోఁ బోరుటకును

కల— తమ్ముఁడా! బహుసంతోషము. కరవాలకవచాదుల సేవకులచే నాయత్తముచేయించుకొమ్ము. నీకువిజయమగుఁగాక. భాగముల సంగతి మెల్లుట మాట్లాడుకొనవచ్చును.

ప్రభా—మంచిది. (ఇద్దరు నిష్క్రమించుచున్నారు.)

---

రంగము 5. కోటయందలి గరిడీశాల.

[ధనవర్మయు, సరసబుద్ధియు, దదనుచరులు నొకప్రక్క నాసనములమీదను, పౌరులొకప్రక్కను, నంతఃపురస్త్రీలు సౌధోపరిభాగమునను గూర్చుండియున్నారు.]

ధన—సరసబుద్ధీ! పౌరులందఱు వినోదావలోకనాభిలాషులై యున్నారు గనుక నిక రుద్రమల్లునిఁ బిలిపింపుము. జాగుచేయవలదు.

సర—చిత్తము. సేవకా! రుద్రమల్లుని వైళమగొనిరమ్ము. పొమ్ము.

సేవ—చిత్తము. (అని నిష్క్రమించుచున్నాఁడు)

ధన—మంత్రీ! రుద్రమల్లుతోఁ బోరువారెవ్వరైన నున్నారా?

సర—రంగభూమి మల్లుఁడు ప్రవేశించినంగాని పౌరుల పౌరుషాతిరేకములు బయల్పడవు.

ధన—అట్టులనా? మంత్రీ! నాకిట్టివినోదములయం దత్యుత్సాహము సుమీ.

సర—అతిబలభుజాదండప్రకాండులగు దేవరవారికిం దుత్సాహ ముండవలసినదే. అదుగో సేవకుఁడు రుద్రమల్లుతోఁ బ్రవేశించుచున్నాఁడు.

ధన—అబ్బా! ఆమల్లుఁడు పేరునకుఁదగిన ట్లతిరౌద్రమూర్తియై వెలుగొందుచున్నాఁడు.

మ. కనులన్ గుంకుమరేఖలుల్లసిల న♦ల్కన్ భ్రూయుగం బెత్తి సా
ధనముఖ్యంబులఁద్రిప్పుకొంచు నతిరౌ♦ద్రంబిట్లు రూపొందెనో
యనగన్ భీషణరోషవిస్ఫురణ బా♦హాస్ఫాటనంబొప్ప సం
హాననవ్యాప్తినిదుర్నిరీక్ష్యుఁడయి యా♦హా!మల్లుఁ డేతెంచెడిన్.

(అంత సేవకుఁడు రుద్రమల్లునితోఁ బ్రవేశించుచుఁన్నాఁడు)

రుద్ర--పంచచామరము. జోహారు రాజవర్య! ధీర! ♦ శూర! మీకు దేవికిన్
జోహారు సభ్యపాళికెల్ల ♦ శుభ్రకీర్తి మంత్రికిన్
విహారమే నొనర్ప రంగ ♦ వీథిఁ జూచి మెచ్చి తా
రహాయనంగ శత్రువార ♦ మారఁ దేరి కేరెదన్.

(అని గదను త్రిప్పుచున్నాఁడు)

(సభ్యులవంక దిరిగి)

ఉ. ఏనిబలాన వైరివరు ♦ లెల్లరు స్వర్గసుఖంబుఁ జెందిరో
యేని యవక్రవిక్రమ మ ♦ హీనత నెందును మొక్కవోవదో
యానిశితప్రతాపుఁడను ♦ నందురు నన్నిల రుద్రమల్లుఁడం
చో నరులార! రండు చవి ♦ చూనఁ దలంచిన మత్ప్రతాపమున్.

(అని కాలుదువ్వి బాహాస్ఫోటనము సేయుచున్నాఁడు)

[అంతనొక వృద్ధశూరుఁడు తనకుమారులు సువేగుఁడు, సుకాయుఁ
డను నిర్వురతో రంగభూమిఁ బ్రవేశించుచున్నాఁడు]

సువే-- మహారాజప్రభో! వందనము చేసెద. సెలవైన నొక్క సారి
యీమల్లునితో రణరంగమందు విహరింపఁదలఁచెద.

ధన— మంచిది. పరమసంతోషము.

సువే-- (సన్నద్ధుఁడై) చిత్తము. (మల్లునిఁజూచి) ఓరిమల్లుఁడా!

సుగంధి॥ దంభమేల కూళ! నీప్ర ♦ తాపమేపు చూపరా
సంభ్రమంబదేల సాక్షి ♦ శౌర్యమొండెదీన; నా
రంభ మయ్యె సంగరమ్ము ♦ రమ్ము వమ్ము నర్తు నీ
శుంభదఖిలవిక్రమమ్ము; ♦ సొమ్ము నా జయమ్ముఁ గల్గ.

రుద్ర-- ఓరీ ప్రేలరీ? నాదిదంభమా! జయమునీసొమ్మా!

పంచచామరము. బిరానఁ బోరికేగుదెంచి ♦ బిట్టుచుట్టి ముట్టెదే
సరోషవహ్ని ప్రజ్వరిల్ల ♦ శౌర్యవార్ధి ముంచెదన్
ధరాధినాథుఁడాత్మలోన ♦ దభ్రహర్ష మొందఁగన్
బోరింబోరిన్ రణానఁ బోరి ♦ పోకుమోఘశూరుఁడా!

సువే--నేనా పారిపోవువాఁడను. రమ్ము.

(అని డీకొనుచున్నాఁడు. మల్లుఁడుపైకుఱికి కుత్తుకఁ బట్టుకొని నేలపైవైచి కొట్టుచున్నాఁడు. సువేగుఁడు రామరామాయని మరణించుచున్నాఁడు)

ధన-- హరిహరీ! (అనుచున్నాఁడు)

సరస-- ఎంతపాప మెంతపాపము.

సరో-- అక్కా! కమలినీ? ఎంత ఘోరము.

కమ-- సోదరీ! నిజమే. నాయొడలు ఝల్లుమనుచున్నది.

వృద్ధుఁడు-- (రోదనముచేయుచు)

మ. అకటా! దారుణకర్మమా! సుతుని బా♦హాటోపశౌర్యాబ్ధిమా
మకభవ్యాన్వయదీపకున్ వినయు స♦న్మాన్యున్ లసల్లక్షణున్
సుకృతిన్ గన్నుల చందమామఁ ద్రుటి ని♦చ్చో మల్లుచేఁజంపి కౌ
తుకమున్ నామదిలోనఁ ద్రెంపి జగమెం♦తో చీకటిన్ గప్పితే?.

(అని సుతునిపైఁబడి యేడ్చుచున్నాఁడు)

సుకాయుఁడు- (తండ్రినిఁజేరి) తండ్రీ! దుఃఖించి యేమిప్రయోజనము?

గీ. జనక! శూరులు పోయిన♦సరణిఁబోయె
శూరవరుఁడైన మద్భ్రాత♦శోక మేల?
జగతిఁ బ్రాణంబునిత్యమే?♦సర్వమెఱిఁగి
యకట! శోకింపనగునె మీ♦యంతవారు

మఱియు గీ. కొదువయేటికి నాయంత♦కొమరుఁడుండ
నన్ను దీవించిపంపుఁడీ♦యన్న యున్న
యెడకుఁబంపెద నామల్లు♦నిపుడెమీర
లందరునుమెచ్చ ధరణీశుఁ♦డౌననంగ.

వృద్ధుఁడు--కుమారా! శౌర్యనిధీ! నిజమే దుఃఖించుటవలనఁ బ్రయోజనము లేదు. జాగ్రతగాఁ గృషిచేసి మల్లుని వధించిరమ్ము. నీకు జయమగుఁగాక.

సుకా--చిత్తము. మహారాజా! సెలవిచ్చెదరా?

ధన-- మంచిది.

సుకా--(రంగమునకుజికి బాహాస్ఫాటనముఁ జేయుచు)

మత్తకోకిల. ఓరిమూఢ! మదీయసోదరు♦నుత్తమోత్తమశౌర్యదు
ర్వారధీరు నపారవీరప♦రాక్రమాన్వితుఁజంపితే
పోరనిల్వుము మద్భుజాంతర♦భూరిపంజరసీరిని
గ్రూర! గ్రుచ్చుచుఁజంపెదన్నినుఁ♦గూడఁబంపెదనన్నతోఁ

రుద్ర--పంచచామరము. అరే దురాత్మ! పోరఁజంప♦నోనెనన్ను నీకుర
మ్మెఱుంగవేత్వద గ్రజున్నఁ♦డెట్టిపాటుఁజెందెనో
సరేయటంచునత్తు వేనిఁ♦జావునిక్క మిందునీ
శిరంబునుగ్గుచేసి పొట్టఁ♦జీల్చెదన్ క్షణంబునన్.

(అని పైకుజికి వక్షస్థలముగ్రద్ది మెడవిఱిచి చంపుచున్నాఁడు.
సుకాయుఁడు కృష్ణకృష్ణాయని మరణించుచున్నాఁడు)

ధన--సరస- ఎంతపాప మెంతపాపము! వీఁడునుఁగూడనిహతుఁడయ్యెనా?

సరో-- కృష్ణాకృష్ణా! సంతాపము సంతాపము.

కమ-- సోదరీ! ఇదిభయనిదానమైనసంగతిగదా? ఈమల్లునిఁజంపువారుం
డిన సంతోషింతునుసుమీ

వృద్ధుఁడు-(శోకించుచు)అయ్యయ్యో! ఎంతఘోరకర్మము. హా! సుకాయా!
నన్ను విడిచి మీయన్న కడకుబోయితివా?

గీ. భ్రాతృవత్సలతాభావ♦రచనకొఱకు
మల్లునిజయింతునసుచు న♦న్నాయఁజేసి
యన్నతోడనుబోతెనా♦యన్న! మిమ్ము
విడిచినేనెట్టులింక జీ♦వింతునకట!

ఓరీ మల్లసాతకా!

గీ. వృషభములఁబోలునిద్దఱి♦పిల్లవాండ్రఁ
బెద్దపులివోచుఁబొట్టను♦బెట్టుకొంటి
వోరిమల్లుఁడ! రణమందు♦నోర్చిసుతుల
జీవములతోడ విడుచుట♦ నేగియానె?

అకటా! హావిధీ!

క. ప్రోడవు సుతులనుకొమ్మల
జోడును మల్లుఁడను గజము♦ సూయాపరతన్
జోడించి విఱిచివైచెఁగ
మోడును నను గాంచి చాల♦ ముచ్చటపడెదే?

(అని యుద్ధమునకుఱికి) ఓరోరి మల్లహతకా! నాతోడఁగూడఁబోరి నాసుతులున్న యెడకు నన్నుఁ బంపుము- (అని యఱచుచున్నాఁడు)

[అంతటఁ గవచదేహియు గదాపాణియు నైన ప్రభాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు]

ప్రభా—ఓరీ మల్లుఁడా! మూఢచిత్తా! ఆవృద్ధుని కెంతయాపత్తు ఘటించితివి.

చ. అకట! కుమారరత్నముల♦ నాహవదోహలులన్ వధించి యూ
రక యపకీర్తిఁ గొన్న బలు♦ రక్కసివే నినుఁ జంపఁ బాపమే?
ప్రకటమదీయగాఢతమ♦ బాహుయుగాంతరలగ్నదేహివై
యిఁక మరణించువేళ గణి♦యింపవె? నీదగుదుష్టకృత్యముల్.

కాచుకొమ్ము (అని వృద్ధునిఁ జేరి) పితృసమానా! శాంతింపుము శాంతింపుము. నీ కుమారసింహములకు జరగినదుర్మరణమునకేఁ బ్రతిక్రియ సేయఁ బూనుకొంటిని.

ఉ. జోడుగనున్న సోదరుల♦ జోదులఁ ద్రుంపి పరాభవించి యీ
గోడును నీకుఁ దెచ్చె నిది♦ గో మదియించిన మల్లుఁ డట్టి క్రి
గ్గాడినిఁ జంపి నీమదికిఁ♦ గల్గఁగఁ జేసెద శాంతికొంత నన్
మూడవపుత్రుఁగాఁగ దల♦పోయుము పోయెదభక్తి మ్రొక్కెదన్.

వృ— (కౌఁగలించుకొని) అన్నా! విధి యాదరించువారిని నాకుఁ గన్పరచెనా?

ఉ. వృద్ధునిఁ బ్రోవవచ్చిన ర♦మేశుఁడవో పరమేశ్వరుండవో
బుద్ధికిసంతసించితి న♦పూర్వదయాళుఁడవీవుగూడ నీ
యుద్ధమునందుఁ గూలుటకు♦ నొల్లను మల్లుఁడవధ్యుఁడయ్య! నీ
వృద్ధపితల్ ననుంగుఱించి♦ యేడ్వరో! జీవధనంబులొల్లవో.

ప్రభా-- గీ. నాకుఁబితలేఁడు పితవీవె నాకుఁగూడ
నన్నలిద్దఱు లేరను కొన్నవారె
బ్రహ్మచారిని నేకాకిఁ బౌరుషంబె
నాదుధ్వజసీమ వెలుఁగు చిహ్నంబుగంటె?

వృ— నాయనా! నీయట్టి సౌందర్యమూర్తిని నామల్లహతకుని బారి బడఁజేయనొల్ల

ప్రభా--గీ. పడనుబడనయ్య! యామల్లు బారిఁబడను
గొడుకులిర్వురు పడుటచే నెడఁదఁగల్గు
శోకభరమున నీవిట్లు వ్యాకులంబుఁ
జెందెదింతియగాని నిర్జింతువాని.

వృ— ఇఁక నేనేమిచెప్పఁగలను- దీవించిపంపెదను-

ప్రభా-- మంచిది- (రాజువంకకుఁదిరిగి) మహారాజా! సెలవు

ధన— మంచిది- నీవు మూఁడవవాఁడవుగాఁబోలు

ప్రభా-- కాదు- నేను మొదటివాఁడనే

ధన—ఎందునకు-

ప్రభా--మల్లుని గెల్చుటకు

ధన—అట్లులనా? చూతముగాక- మంత్రీ!యీస్ఫురద్రూపియెవ్వఁడో? నిజముగా శౌర్యస్ఫూర్తిచేఁ బ్రకాశించుచున్నాఁడు

సరస-- దేవా? ఈతఁడెవఁడో నాకును దెలియదుగాని మీరుసెలవిచ్చినదిమాత్రము సరిగానేయున్నది

సరో-- (తనలో) ఈమహానుభావుఁ డతిశూరుఁడును రుచిరాకారుండును నాభిజాత్యుఁడుగాఁ గూడ నున్నాఁడు- ఈతనిఁజూచినప్పటినుండియు నేదియో యొకవిధమయిన వికారము నామనస్సున నంకురించినది- ఈతఁడీ యుద్ధమునుమానిన బాగుండునుగదా? (ప్రకాశముగా) అక్కా!కమలినీ? ఈతఁడెవ్వఁడే? ఈనుకుమారుఁ డాకటికాయుని జయించునా?

కమ-- సోదరీ? ఫలితము చూడవలసియున్నది- ఈతఁడతిసుకుమారుఁడు గానేయున్నాఁడు

ప్రభా-- (సౌధగతులగు రాజస్త్రీలనుఁజూచి సగౌరవముగాఁ • దనలో ఆహా! ఈయంతఃపురవాసినుల చక్కఁదనము- శంపాలతికలవలె నిద్దఱుజవ్వనులా కామినీపఙ్క్తిలో వెలుగొందుచున్నారు. మఱియు నాయిద్దఱిలోవల ప్రక్కనున్న రమణీలలామ నాహృదయము నెంతయు నాకర్షింపుచున్నది. ఈమెయేకాఁబోలు నా యన్న కలహంసుఁడు వర్ణించినయామె- ఆమెయు మధ్యమధ్య కటాక్షబాణముల నాపైనేయుచున్నది- అన్నా! నాయవస్థ యిప్పుడు మిక్కిలి చిత్రముగానున్నది-

ఉ- చూపులఁదూపులేసి నను♦స్రుక్కఁగఁజేసెసునీలతాంగి; యా
టోపవిజృంభణంబునఁ బ♦టుప్రదరంబుల మల్లుఁడేయుఁగా
యాపయి; రెంటికగ్గలము♦నేనయి మారునితోడ మల్లుతోన్
బాపురె? యేకకాలమున♦భండనమున్బొనరింతు నిచ్చటన్॥

(అని మల్లునిఁజూచి) ఓరిమల్లుఁడా! యుద్ధమునకు సిద్ధముగానున్నాఁడవా?

రుద్ర—(ప్రభాకరునిఁ గలయఁజూచి తనలో) ఆహా! యీతని ముఖవర్చస్సుఁజూడఁ గలహంసునిపోలికలున్నవి- ఈతఁడు ప్రభాకరుఁడుగానోపు- ఈతని వధింపుమనియేగదా కలహంసుఁడు నాకు బోధించినది- ఈకార్యము జరిగిన నాకు మంచి పారితోషికము లభించును- అయినను వీనిఁజూడ నసాధ్యుఁడుగానున్నాఁడే!

క. కడువెడఁదయైన యెడఁదయుఁ
బుడమిందుల లేని దీర్ఘ♦భుజయుగ్మంబున్
జడిపించునట్టి కనుబొమ
లడరఁగనితఁడొప్పు భీము♦నట్టులఁజూడన్.

(ప్రకాశముగా) ఓరీ తులువా? నీతోయుద్ధముఁజేయుట కాయత్త పడన[illegible]నా? రమ్ము.

ప్రభా--ఓరిమల్లుఁడా! నీవునీచకులుఁడవు. మా టలమర్యాద నేర్చుకొమ్ము

* కవిరాజవిరాజితము *

పలుకుల నేమిప్రయోజనముండును♦బాహుపరాక్రమ మొక్కటిగా
వలయు బలాఢ్యుఁడవై వెలుగొందినఁ♦బట్టుముపట్టులుమల్లుఁడ! నీ
యలఘుభుజాబలదర్పపరీతవి♦హారములందఱుచూతురుగా
విలసదుదారగుణాగుణమెంచఁగ♦విక్రముఁడుర్విపుఁడుండును గా.

రుద్ర--ఓరిశూరుఁడా! బహున్యాయవాదివలె మాట్లాడుచున్నావు.

* మహాస్రగ్ధర *

అదిగో! నిన్మించువారల్♦యమగృహమునకా♦యత్తులై పోవలేదే?
మొదలన్ సంతోషచేత♦మ్మునసమరములో♦మూర్ఖ! నీబోంట్లుచేరన్
బిదపన్ దుఃఖాబ్ధిమున్గన్♦విడుతురునసువుల్♦వీరధర్మంబిదేగా
కదనంబన్నన్ వినోదా♦కరమనిమదిలోఁ♦గాంచితే? పీతబుద్ధిన్

ప్రభా--(సౌధగతకన్యనుఁజూచి తనలో) ఈమల్లయుద్ధమే లేకున్నచో నీకన్యామణీసందర్శనముచే నానేత్రపర్వముఁ జేసికొనఁగలుగుదునా? అందులకే

చ. విమలగుణాకరంబులయి♦వింతలుగొల్పెడువస్తులెన్నొ నే
త్రములకగోచరంబగుచు♦దాగెడునయ్యయిచోట్ల వానినే
సమయమునందునైన♦గనఁజాలినచో మనమొందుహర్షమే
యమలసుఖంబటంచువిబు♦ధావళి పల్కుచునుండు నెంతయున్.

(ప్రకాశముగా) మల్లా! నీమాటలఁగట్టిపెట్టి కాలయాపనము సేయక రమ్ము. (అని యొండొరులు ఢీకొనుచున్నారు)

సరో— (తనలో) అన్నా! యుద్ధమునకుదిగినాఁడే. నేత్రసాఫల్యమైన దను సంతోషమునకుఁదోడుగా నీయుద్ధప్రచారమువలని దుఃఖముకూడఁ గల్గినది. ఏమిసేయుదును. ఈతని స్ఫురద్రూపమును గన్నులారఁ జూచితినిగాని సంభాషణసుధారసము గ్రోలఁగలుగుదునాయని సందేహించుచున్నాను.

రుద్ర-- ఓరిశూరుఁడా? ఏమయినదిరా?

ప్రభా--ఏమియుఁగాలేదు.

రుద్ర-- మంచిది. ఇఁక గదాసహాయమునఁబోరుదమురమ్ము-

ప్రభా--కానిమ్ము- నీయిష్టము [ఇండొరులు గదాసహాయులై పోరుకొనుచున్నారు]

రుద్ర--(తనలో) ఈప్రతివీరునిగెల్చుట కష్టముగానున్నదే. నాప్రాణములు తల్లడిల్లుచున్నవి.

గీ. బాహుబలమునశించె న♦వ్వాయుపుత్రుఁ
దనగదాప్రౌఢి నాసుయో♦ధనునిమించె
నౌర! నేనేడ! నాకు జ♦యంబదేడ!
పారితోషికఫలమేడ!♦బ్రతుకదేడ!

(ప్రకాశముగా) ఓరీ? ధైర్యమునవిల్చితివా?ఇంకొకసారిరాఁగలవా?

ప్రభా--(కన్యనుఁజూచి తనలో)

ఉ. చూపు లపారమోహమును♦జూపినఁగాని స్మరప్రదీప్తమై
పాపము సారసోక్తుల కు♦పాయముగాంచమిఁ జింతనొందున
ట్లాప్రసవాంగి తోఁచెదును♦నాత్రతజెప్పలనప్పళించుటల్
దేవరుఁదేవ గెంబెదవి♦దీటున విచ్చుట నూర్పు పుచ్చుటల్

(ప్రకాశముగా) ఓరీ! యీసారి నాధైర్యముఁ గాంచెదవుగాఁక-

ఉ. చండరుషాగ్నికీల లతి♦సాంద్రత నిప్పులుగ్రుమ్మరింప వే
దండకరాభదీర్ఘ భుజ♦దండ సమావృతుఁజేసి,నీవు బ్ర
హ్మాండము బొబ్బరించునటు♦లార్వఁగ శౌండతనుండనాచు నీ
భండనమందుఁజంపెదను♦బాపురెయంచు నృపుండు మెచ్చఁగన్.

(అని మల్లుని నేలఁబడవైచి పైనెక్కి ఱొమ్ముగ్రుద్దిచంపుచున్నాఁడు. మల్లుఁడార్చుచు మరణించుచున్నాఁడు)

పౌరులు- వహ్వా మంచిపనిజరిగినది. దేవతలు నీశౌర్యమునుమెచ్చుకొందురుగాక.

ధన— . శబాస్- ఈశూరుఁడు నేఁజెప్పినట్లు గట్టివాఁడు.

సరస—ఈతఁడు వీరయోధుఁడు.

ప్రభా--(రాజును సమీపించి) దేవా సెలవు.

ధన-- (లేచి ప్రభాకరుని వీపుపైఁ జేయివైచి) నీవు మహాశూరుండవు.

చ. అతిబలశౌర్యమూర్తి వి ల ♦ తాభశరీరుఁడవయ్యు; మంధర
క్షితిధరగర్వభేదియగు ♦ శ్రీసురనాథునిఁబోలె మల్లునిన్
హృతవరజీవయుగ్మని న ♦ హీనబలాఢ్యు భవద్భుజాబలో
న్నతివధియించి సంతసము ♦ నాకుఘటించితి పీసభాస్థలిన్.

ఓయి శూరాగ్రణీ? నిన్నుఁగన్న తలిదండ్రులను నామములనునీనామ ముఁజెప్పి నాకుఁ గర్ణపర్వంబొనర్పుము.

ప్రభా--అవధరింపుఁడు

ఉ పేరు ప్రభాకరుండు; పిత ♦ పేరనఁగాధృతకీర్తి శౌర్యవి
స్ఫారితకీర్తిశేషుఁడు నృ ♦ పాల! యతండిపు; డస్మదంబదా
పేరుగుణావలంబ, యతి ♦ వి స్తృతధర్మగుణావలంబయై
పేరువహించెనామె పృథి ♦ వీతలమందున వన్నెకెక్కుచున్.

ధన-- ఓహో! నీ వాధృతకీర్తిపుత్రుఁడవా! చాలుఁజాలు ఇఁక నీ
వంశప్రతిష్ఠలఁ జదువనక్కర లేదు.

ఉ. ఖేదముగల్గెనాకు ధృత ♦ కీర్తితనూజుఁడనంచుఁబల్కఁగా
నీదురదృష్టమేమనను ♦ నీవువిరోధివి నాదుకూర్మినీ
పైఁదనరారఁజేయుటకుఁ ♦ బ్రాణములొప్పవు భవ్యచంపకా
మోదము బంభరంబునకుఁ ♦ బోలె రుచింపవునాకు నీపసల్.

నేను నీకొనరించునుపకారము నిన్నుఁ బ్రాణములతోఁ బోనిచ్చుట యే. ఇఁకఁబొమ్ము. మంత్రీ! మనమిఁకఁబోవచ్చును.

సరస—చిత్తము. (అని ధనవర్మ, సరసబుద్ధియుఁ బౌరులును నిష్క్ర మించుచున్నారు)

ప్రభా--(తనలో) ఎంతమందభాగ్యుఁడను. శత్రుకోటిలోనివాఁడనని మ హారాజు నన్ను నిరసించె. నిరసింపకున్న మాయన్న యన్న

యట్లు తనకన్యారత్నమును బారితోషికముగా నాకుఁ బ్రసా
దింప నోపునుగదా? (ఆలోచించి) ఛీ! దీనికింతవిచారమేల?
ప్రాప్యవస్తువులెప్పటికినిఁ బోనేరవు.

గీ. దినము బాగున్నదియె తో ♦ డ్తెచ్చుసకల
భాగ్యములఁ గన్యకామణిఁ ♦ బ్రమదములర
మోహరాగాంకురముపుట్టె ♦ ముదితహృదిని
మదనుఁడే గూర్చు మోహసం ♦ బంధములను.

వృద్ధు--నాయనా! మల్లునివధించి నానేత్రచకోరచంద్రుఁడవై ప్రకా
శించుచుంటివా?

గీ. కంటకావృతబదరికా ♦ కాష్ఠము మృదు
కువలయదళాగ్రముల చేతఁ ♦ గోయునట్లు
మొఱకు దృఢకాయు మదదీప్తు ♦ మోటు మల్లు
నెట్లుచంపితో! నీనవ ♦ మృదుకరముల.

ప్రభా--(సౌధపార్శ్వమునకుఁబోయి కన్యనుఁజూచుచు) ఎట్లా! భవదీ
యాశీర్వాదబలము చేతను మత్పితృవరప్రసాదము చేతను

గీ. దనుజవీరులఁజంపె న ♦ ర్జునుఁడొకండె
యొక్కహనుమంతుఁడెందఱి ♦ యుక్కడంచె
సేగిగల్గునె పెద్దలా ♦ శీర్వదింపఁ
బ్రబలదైవబలంబు నా ♦ పాలఁగలుగ॥

ఇఁకనీవువిచారింపక యింటికిఁబొమ్ము-

వృద్ధు--చిరాయురస్తు- నాతండ్రీ? నేనుబోయెదను-నన్ను మఱువకుము-

ప్రభా--మంచిది- (అంత వృద్ధుఁడు నిష్క్రమించుచున్నాఁడు)

అందఱుస్త్రీలును గ్రమక్రమముగా సౌధమును దిగుచుండఁగాఁ

[సరోజినీ కమలినులిరువురు వెనుకకు నాగుచున్నారు]

సరో—(తనలో) ఈమానధనుని శౌర్యధురంధరుని జూచినప్పటినుండి
యు మనోవికారమునకు లోనగుటచే ముందునకుఁబోవఁ గాళ్లా

డకున్నవి- ఆగినచోఁ దోడిచెలులందఱు నపహసింతురుగదా? ఇఁక నేను బోవలసినదే

గీ॥ డెందమా! నిన్నునిట్లులఁ గుందఁజేసి
తరలుచుంటిని నామనో హరునివీడి
ప్రాప్తముండిన సౌఖ్యముల్ బడయఁగలవు
ఓర్చుమీ కాలమే సమ కూర్చునెల్ల॥

అయినను నీబాధాబోధకమైన యీముత్యాలహారమును నా మహా మహుని కొసంగిపోయెద-

క॥ ముక్తాహారమ! యయ్యెద
ముక్తాహారమును నీవు వ్రాయిన మొదలున్
శక్తినియోగించుచు నను
రక్తిని శుభములనుఁదెమ్మ! రమ్మా త్వరలోన్॥

(అని హారమును గ్రిందనున్న ప్రభాకరుని యొడిలో వేయుచుఁ గ్రేఁ గంటజూచుచు ప్రకాశముగా) అక్కా! కమలినీ ! ఈమహానుభావుని కీ పారితోషికము దగదా? నీమియోగాని యాతనిఁగాంచినప్పటినుండియు నాకొకవిధమైన ప్రేమయును మనోవికారమును గలిగినవి-

కమ—(తనలో) సోదరి యాశూరునిఁజూచి మోహించినది- (ప్రకాశముగా) సరోజినీ! పారితోషికముదగదా ! చాలదనుము- మన మిఁకఁ బోదమురమ్ము- (అనినిష్క్రమించుచున్నారు)

ప్రభా—(హారమునందుకొని)

ఉ. హారమ! యోయమూల్యమణి హారమ! మామకజీవనాంచితా
ధారమ! నేత్రయుగ్మసము దారమహద్ఘనసారమా! మనో
హారమ! నిన్నుఁబంపెనె య హా రమణీమణి మోహసూచనా
ధారముఁగాఁగమానడుమ దౌత్యముసల్పెదె యింకమీఁదటన్

నాకడకువచ్చిన నీకేమిసౌఖ్యము?

ఉ సారపటీరభూరిఘన♦సారసుగంధపరీతమాచు నిం
పారెడు నాలతాంగికుచ♦పాళిసుఖంబులఁ జెందునీవు దు
ర్వారమదీయతాపముఁ గ♦రంబునడంపఁగఁ జేయవచ్చితే?
హారమ! నిన్ను నెట్లుకొని♦యాడెదమెచ్చెద నీసువృత్తముల్.

చ. తరుణికి మాఱుగా నెడదఁ♦దాల్చెద నిన్నిఁక జీవరత్నమా!
సురుచిరమోహరాశియగు♦సుందరిఁగూర్చినదాఁక; నాపయిన్
సరసమనోజసౌఖ్యముల♦సందడిఁజిక్కులఁబడ్డగాని నన్
విరసునిగా గణింపకు మ♦వేలకృపాలలితాత్మకంబవై.

(అని హారమును మెడలో వేసికొని) ఈస్థలమునకు నేనెందులకు వచ్చితిని. ఇప్పుడు నేనెట్లుబోవుచుంటిని నాప్రస్తుతావస్థచిత్రముగా నేయున్నది

ఉ. ఇక్కడ కేనువచ్చుతరి♦నీప్సితమారణధీరు మల్లునిన్
జక్కడగించుటే, యదియు♦సాగినగాని కృతార్థతన్ మనం
బెక్కదు; పోవువేళఘటి♦యిల్లెను నింకొకయుద్ధమక్కటా
యక్కమలాక్షిఁగూర్చిప్రస♦వాస్త్రునితోసిదియెట్లుదేలునో!

(అని నిష్క్రమించుచున్నాఁడు)

ఇది శ్రీమద్రమారమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యాన
పారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానురాగ
నూరమాంబా వేంకటామాత్యపూర్వతపఃఫల
రూప శౌనకసగోత్రప్రదీప తురగాన్వవా
యాంభోధిసుధానిధాన వేంకటాచలాభి
ధాన ప్రణీతంబైన సరోజినీనామ
నాటకంబునందుఁ
ప్రథమాంకము.



శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# సరోజినీ నాటకము

## ద్వితీయాంకము.

### రంగము 1. అంతఃపురము లోనిగది.

[సరోజినీకమలినులు ప్రవేశించుచున్నారు].

కమ-సోదరీ? ఈదినముననీమోముఁదమ్మి వసివాళ్ళువాడియున్న దేల ?

సరో-అక్కా! నేనేమని చెప్పను?

కమ-సరోజినీ! నిజమగుకారణము వచింపుము. సందేహింపకుము.

సరో-నీ వెఱుఁగనికారణమేమియును లేదు. నానోటఁబలికింపవలెనా?

కమ-నీజనకుని నిమిత్తమా?

సరో-అక్కా కాదు. నానిమిత్తమే?

కమ-(సంభ్రమముతో) నేనుండఁగా నీకు విచారమెందుకు?

సరో-కమలినీ! నాకున్న ధైర్యమదియొక్కటియేగాని నాసంతాప నివారణము నీవలనఁగూడ జరుగ నేరనియంశముగనుక విచారించుచున్నాను.

కమ-(ఆలోచించితనలో) ఆహా! జ్ఞప్తికివచ్చినది. నిన్న నామల్లునిఁజంపిన ప్రభాకరునిఁ జూచినప్పటినుండియు మాసరోజిని కామవికారము నకు లోనైనది. అందులకే,

గీ. తనదుకంఠస్థహారమా ♦ తనికిఁదీసి
నెయ్యపున్గుతుకగా నిచ్చె ♦ నెలఁతయపుడు
హృదయమట్టులొసంగియా ♦ యింతియిపుడు
ప్రసవసాయకశరముల ♦ బాధపడెడు.

అక్కటా! ఈమెఁదేర్చునుపాయమేమి ? ఈమెవిన్నఁదనమునను
న్న చో నాకీప్రపంచకము సున్నగదా! (ప్రకాశముగా) అక్కా! మో
హవిషయమునవా నీవు మనస్తాపముఁజెందునది సామాన్యుఁడగు ప్రభాక
రునిఁగూర్చియేనా?

సరో-అవును. ఆతఁడు సామాన్యుఁడా?

గీ. ఆమహామహుజనకుఁడ ♦ నంతశూరుఁ
డర్థిజనదాత, మాతండ్రి ♦ ప్రాణమిత్రుఁ
డౌచుబిరుదులనెన్నియో ♦ యందుకొనియె
నతనిసామాన్యుఁడనఁగ న్యా ♦ యంబెచెపుమ.

గీ. అతనిమించెనుశౌర్యంబు ♦ నందునీతఁ
డందమునవావసంతుజ ♦ యంతుమించె
సత్కులీనుఁడు శ్రీలుండు ♦ జవ్వనుండు
నితనిసామాన్యుఁడనఁగనీ ♦ కెట్లుచెల్లు.

కమ-సరోజినీ? ఇవియన్నియునిక్కమేగాని యీతనితండ్రి మాతండ్రికిఁ
బరమవిరోధియే.

సరో-అయిననాకేమి? ఈకారణమున నాకును విరోధియేయనుకొనుము.
మాతండ్రినిఁబట్టి నాకున్నే హితుఁడేగద. ఆపైని మోహమునకును
గులవిరోధమునకును దూరముసుమా!

గీ. పరమశాత్రవుఁడనిగుద్ధు ♦ పైనిబాణు
సుతయుపాకన్యమోహంబుఁ ♦ జూపలేదె?
వజ్రనాభాత్మజప్రభా ♦ వతిమదనునిఁ
బ్రేమగొనలేదెమానెనే ♦ ద్వేషియనుచు.

పోనీ? నిజమువచింపుము. నీవాతనిఁ బ్రేమింతువా లేదా?

కమ-(నవ్వుచు) సోదరీ? చంద్రునిఁజూచి యానందింపనివా రెవ్వరు ?

సరో-అక్కా! నీవాతని వరునిఁగాఁగోరెదవా లేదా?

కమ-మొదట నేయాసంగతి యసాధ్యమని నేనెఱుఁగుదునుగనుక నాకట్టి కోరిక కలుగనేకలుగదు.

సరో-కలుగకున్న మంచిదేగాని నామీఁదిప్రేమచేనైన నాతని నిరసింపకుము. నేనుగామించినందులకైన నీవు ప్రేమింపుము.

కమ-సోదరీ? నీవుకామించినవస్తువును నేను ద్వేషింతునా ? నీప్రాణముల లోనియొకప్రాణమును నేనుగానా?

కం. చలువలఱేఁడు ముదంబునఁ
గలువల వికసింపఁజేయఁ♦గాంక్షించుతరిఁ
జలమూని యతనికిరణము
లిలవానిని ముకుళనంబ♦ దేటికిఁ జేయున్.

సరో-పరమసంతోషము.

కమ-చెల్లెలా? అవునుగాని నీలోనియిప్పటివిచారము పోవుమార్గమెట్లు?

సరో-అక్కా! నామనోరథమీడేరువరకు నాసౌఖ్యమింతయే.

గీ. ఆమనోజ్ఞభాషు♦నాలాపమధువాను
నాదేభుక్తిగొనుట♦నాకునిజము
ఆమనోహరాంగు♦నానందమొప్పారఁ
జూచునాదెకనుల♦చూడ్కి నిజము

కమ-సోదరీ? అట్టులయినచో నాకు నేటినుండియు నీతోసుఖించు దినములు పూజ్యమయ్యెనా?

సరో-అక్కా! అదియేటిమాట! నీవు లేకున్నచో నాకుఁ బ్రాణమెక్కడ! నీసహవాసముచేతనేగదా చెఱఁబెట్టఁబడిన నేను నాతండ్రిని విడనాడి యిన్నాళ్ళు జీవములతో నిలిచినది. వేఱుగాభావింపకుము. నీతోనేనెప్పటియట్టులనేయుందును. ప్రాప్తియున్న నామనోరథ

మిూ జేలుఁగాక.-

కమ-మనకువివాహము లగునంతవరకయిన నీవునన్ను వదలనని యొట్టు పెట్టుకొమ్ము. నాప్రాణములతోడుగా నీతోడుగా నేనెట్టికష్టము లనయిన నిన్ను విడువను. (అనిచేతిలోఁజెయి వేయుచున్నది).

సరో-అక్కా! నాయెడల నీకు సందేహమా? నీయిష్టమువచ్చినట్టులఁజేసెదను. (అని కమలినిచేతిలోఁజెయి వేయుచున్నది).

కమ-మనమిర్వురము నొకచోటనేయుండుట కనుకూలించు వివాహసంబంధము లే మనకు లభించునటుల సదాభగవంతునిఁ బ్రార్థించెద (అని ముఖముపైకెత్తి) అదుగో! నాతండ్రియేమియోగాని యతిరౌద్రాకారుఁడై యిటువచ్చుచున్నాఁడు

[అంత ధనవర్మమహారాజు ప్రవేశించుచున్నాఁడు].

ధన- (గంభీరముగా) సరోజినీ? నీమియోయనుకొంటినిగాని నీప్రవర్తన మునాకు బాగుగాఁదెలిసినది. ఇఁక నీయంతఃపురమునవీవు క్షణముండఁదగదు. నీయిచ్చవచ్చినచోటికిఁబొమ్ము- నిన్నుఁ బ్రాణములతో విడుచుటయే నీకు నేనిపుడు చేయఁగలయుపకారము-

సరో- (విచారముతో) నాన్నా! నన్నా! నీవిట్లనునది.

ధన- నిన్నే! ముమ్మాటికి నిన్నే?

కం. పదిదినముల నీమధ్యను
గదలకయిఁటనుండు వేనిఁ గాంతా! నిన్నుఁ
గొదలేకయ చంపించెద
నిదివిని నీక్షేమమరసి యెటకేఁబొమ్మా.

సరో-పితృవ్యా! నమస్కారము. క్షమించి నానేరమేదియో స్పష్టపరచి పిదప నపరాధమువిధింపుఁడు.

కం. కలనైన మఱచియైననుఁ
దెలివిన్నైనను బితృవ్య! ద్వేషింపనినుఁ
ఖలవృత్తిఁబూన మిూపయిఁ
జలపడి నన్నిట్లుచెండ నరి యేమిూకుఁ.

ధన-ద్రోహబుద్ధులందరిట్లే బొంకుచుందురు.

గీ. మాటలనుఁదేనెలూటాడు ♦ మంచికొరకె
చూచుచున్నట్టులుందురు ♦ చోద్యముగను
గోముఖవ్యాఘ్రములుగారె ♦ కువలయేశుఁ
జేరియుండెడుద్రోహులు ♦ చెనఁటివినవె.

ఇప్పటికింతియఁజాలు. నీపైనాకించుకయు విశ్వాసములేదు.

సరో-పితృవ్యా! విశ్వాసములేకున్న లేకుండనిమ్ము అంతమాత్ర నేను ద్రోహురాలనగుదునా? నాతప్పేవిషయముననో తెల్పుఁడు.

ధన-నీతండ్రికి నీవు పుత్రికవుగావా ? అతఁడు నావిరోధికాఁడా ? అది యేతప్పు.

సరో- అయ్యా !

గీ. జనకురాజ్యంబుమీరట్లు ♦ గొనినయప్పు
డతనిదేశంబువెలిజేసి ♦ యంపినపుడు
ద్రోహురాలనుగానె నే ♦ ద్రోహనెట్టు
లగుదునీనాడు నావయి ♦ నలుక యేల ?

మఱియు.

కం. మాహితులు మీకురాజ
ద్రోహులుగానున్న నేను ♦ ద్రోహనగుదునే ?
యూహింపుఁడు నాజనకుఁడు
ద్రోహియె? యెప్పుడైననతఁడు ♦ ద్రోహమెఱుఁగునే.

ఇంతకు నాప్రస్తుతదౌర్భాగ్యస్థితియే మీకీదుర్బుద్ధిపుట్టించినది.

కమ-ప్రియజనకా! ఆమెవలననేరమేమియును లేదు. నామనవివినుఁడు.

ధన-కమలినీ! నిన్నడుగలేదు. నీకొరకేగదా యీసరోజిని నిచ్చుటనిలిపినది. లేకున్నఁదండ్రితోఁగూడ బహుదినములక్రిందటనే యడవుల వులకుఁ బోయియుండును.

కమ-నాయనా !

గీ. చెప్పుఁడ! నేఁగోరితినె నరో ♦ జననినిచట
నుంచుడంచును నప్పుడూ ♦ హించిమీరె
నిలిపితిరిపాపమించుకేఁ ♦ గలుషమామె
చేయలేదయ్యా! ననుఁగటా ♦ క్షింపరయ్యా!

ఆమెద్రోహురాలందురేని నేనుద్రోహురాలనే? ఏమియన,

గీ. ఒక్కకంచములోఁదిని ♦ యొక్కమంచ
మందుఁబన్నుండి యొకకాల ♦ మందె లేచి
యొకచదువె చదువుచునాడి ♦ యొక్కయాట
పెరుగువారికిబుద్ధుల ♦ భేదమున్నె?

మఱియు నోతండ్రీ!

గీ. చిలుకగోర్వంకలట్టులఁ ♦ జెలగుచుండి
కలిసిపోదుము పోవనె ♦ క్కడకునైనఁ
గాయములు రెండు ప్రాణమొ ♦ క్కటియెమాకు
నట్టిమమ్ములవిడదీయ ♦ నగునెమీకు?

ధన- ఓసిబేలా? ఆమెపక్షము గట్టిగా వాదించితివే? ఆమెమాయనీకుఁదెలియకున్నది.

కం. తనముగ్ధత్వముచేతను
దనశాంతముచేతఁ గుత్సి ♦ తత్వముచేతన్
దననేర్పుఁ దనముచేతను
జనముల వశపఱచుకొనియెఁ ♦ జానా! వింటే?.

నీవు వట్టిబేలవు. ఆమెమూలమున నీపేరుపైకిరాకున్నది. ఇఁకనీ నోరెత్తకుము. నాయాజ్ఞయలంఘ్యనీయము. ఆమెతప్పకపోవలసినదే?

కమ- ఓప్రభువా? అలంఘ్యనీయమైనచో మీయాజ్ఞనాపైఁగూడ విధింపుఁడు. ఆమెనువిడిచి క్షణమయిననేఁ బ్రదుకఁజాల.

గీ. కొమ్మకునుగల్గు రెండుచి ♦ గుళ్ళలోన
నొకటిత్రుంపంగ వాడు నిం ♦ కొకటిగూడ

నామెపోయిన నేఁబోయి ♦ నట్టెనాకుఁ
గానవిర్వురఁ బంపుఁడీ ♦ గడియయందె.

ధన-మూర్ఖురాలా? ఆమెకుఁగల చమత్కారమేయది. ఆమెనువిడిచి నీవు జీవింపలేవుగా! చూతము. సరోజినీ! తరుణమే ప్రయాణము గమ్ము. ఆలస్యముఁ జేసితివా నీకుమరణమే శరణము.

(అని ధనవర్మ నిష్క్రమించుచున్నాఁడు).

కమ-మందభాగ్యా! సరోజినీ! ఇప్పుడు నీవెక్కడకుఁబోయెదవు ? హావిధీ! మాస్నేహమున నీకన్నులుకుట్టెనా? సోదరీ! నీవలెనే నేనును విచారముఁబొందెదను.

సరో-నీకువిచారమెందుకు?

కమ-నన్నుఁగూడ మహారాజు బహిష్కరణము జేసెనుగనుక.

సరో-లేదే? నిన్ను జేయలేదే?

కమ-లేదా ? చేయలేదా ? అట్లయినచో సరోజినికి నాపైఁబ్రేమ శూన్యమే.

సీ. మఱచితే ప్రాణముల్ ♦ మనకిద్దఱకునొక్క
టని యిర్వురముగూడ ♦ నానగొనుట
పోయెదేపోయెదే ♦ పోయెదేననువీడి
నాసరోజిని సద్గు ♦ ణప్రచార!
నేవీడఁజాలను ♦ నిమిషమాత్రంబైన
నాసరోజినినిన్ను ♦ నాధనంబ!
రాజునుబోనిమ్ము ♦ రాష్ట్రంబుఁబోనిమ్ము
సర్వంబుఁబోనిమ్ము ♦ సఖియనమ్ము

గీ. కలిసిరానిమ్ము నన్ను నీ ♦ కష్టమునను
బంచుకొననిమ్ము కొమ్ముకా ♦ వలసినట్టి
ధనకనకవస్తువాహనో ♦ త్కరము నెల్ల
చాన! ననువీడుచో దేవు ♦ నాననీకు.

నిన్ను బహిష్కరణముచేయుటయేనన్ను బహిష్కరణముచేయుట

నీవన నేనన భేదమేమి?

సరో-అక్కా! నీకునాపైనట్టి ప్రేమాతిశయముండఁగా నేనుగాదందునా?
హా! హతవిధీ! మాకెట్టి యిక్కట్టులఁదెచ్చి పెట్టితివి?

చ. ఒకటికిఁ జేసియొగ్గెఁబుగ ♦ మోవిధి! యొండొరునీడలట్లుమే
మకట! తలంచియుంటిపుర ♦ మందునఁజాటుననుండమాకుఁ బి
చ్చుకపయి బ్రహ్మనారసము ♦ చొప్పునఁగూర్చితివిట్టిదుఃఖముఁ గ
నికలుఁడ! యిట్టిదేమరల ♦ నీవునుబొందెదుగాక మావలెన్.

హా! చెలీ! మనమెందులకుఁబోదము.

కమ-దండకారణ్యములోనున్న నాపితృవ్యుని సందర్శించుటకు.

సరో.హాకమలినీ! మనకదిసాధ్యమగునా?

గీ. అబల! మనమేడ? మహాదర ♦ ణ్యంబులేడ?
యంతదూరంబుపోఁగల ♦ మమ్మమనము
ధనముకంటెను సౌందర్య ♦ ధనమువలచి
దుర్జనులుదారి నపహరిం ♦ తురుగదమ్మ.

కమ-సరోజినీ! అట్టులయిన నీవుపురుష వేషమునుధరింపుము నేను జీర్ణ
వస్త్రములఁదాల్చి నీసోదరివలె నేయుందును.

సరో-సోదరీ! నీయుపాయము బాగున్నది. నీకన్న నేను బొడుగుగానుంటి
నిగనుక నాకుఁ బురుష వేషమునునయించును. పౌరుషమునకా,

గీ. పౌరుషాకృతిఁదాల్చి లో ♦ పలనుబిరికి
తనముచేఁగుందు మగవారు ♦ ధరణిలేరె?
యట్టులెచరింతు మగవాఁడ ♦ నౌచునేను
స్త్రీత్వమునుదాచి కాలవ ♦ శీకృతనయి.

ఒక గండ్రగొడ్డలినిబల్లెమును నాయాయుధములుగానుంచుకొనె
దను.

కమ-సోదరీ? మనమిర్వురమేయుండునపుడు మనపేర్లు మనము వాడుకొన
వచ్చును. పరులెవరయిననుండఁ దటస్థించినచో నేనునిన్నే మని

పిలువవలయును.

సరో-అక్కా! నన్ను రాజీవుఁడనిపిల్వుము నిన్ను నేనేమని పిలువను.

కమ-సోదరీ! పుష్కరిణియని పిలువుము.

సరో-అక్కా! బాగుగనేయున్నది. మనము నామాంతరములుగూడఁ గల్పించుకొనవలసినకాలమువచ్చినది. మనకుంబోడుమవ్వమేనా?

కమ-అవును మనప్రచారములు నిగూఢముగానుండవలెను. మనకుంగావలసిన ధనాధికములంగొని తక్షణమేకదలవలయును. లేకున్న మనప్రయత్నములు విఫలములుకాఁగలవు.

సరో-నిజమే- కావలసినవస్తువులఁ జేకూర్చితిని. ఇదియే మంచిసమయము. ఈపద్యమీపలకపై వ్రాసి మఱిపోవుదము.

గీ. పోయెదముతండ్రి! మీరాజ్య ♦ భూమివిడిచి
యక్కచెల్లెండ్రమిర్వుర ♦ మొక్కతరిని
నాజ్ఞ యెప్పుడులంఘ్యనీ ♦ యమగదయ్య
మఱువకుఁడు మమ్మునబలల ♦ మంచివేళ.

అక్కా! రమ్ము. (అని ఇరువురు నిష్క్రమించుచున్నారు).

రంగము 2- కలహంసుని గృహము.

(ప్రభాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు).

ప్రభా- (తనలో) నాయన్న కలహంసుఁడు మల్లవిజయమునుబొందిన నన్నుఁజూచి పరమానందముఁ బొందునుగదా?

గీ. సోదరులుదాము తమలో న ♦ సూయఁజెంది
కలహమాడుచునుండిన ♦ నలఘుహర్ష
మొందుచుందురు వారిలో ♦ నొకఁడుపేర్మి
గొప్పకీర్తిఘటించుచోఁ ♦ గులమునకును.

(ప్రకాశముగా) ఎవరక్కడ?

సారం-ప్రభాకరప్రభో! ఏమి? విజయధురంధరుఁడవైతివా?

ప్రభా-సారంగా! అవును. నీకిదిసంతోషమేగద. మాయన్నకీసంగతి నివే

దింపవచ్చితిని. ఆతఁడేమిచేయుచున్నాఁడు?

సారం-ప్రభూ! నీవిజయమునాకు సంతోషమును దుఃఖమునుగూడఁగలిగించుచున్నది. ఆతఁడిప్పుడు నీవిఁటఁగలిసినచో నిన్నుఁజంపుటకుఁ దగినప్రయత్నములఁ జేయుచున్నాఁడు.

ప్రభా-అన్నా! యెంతమాటవింటిని? నిశ్చయమేనా?

సారం-ముమ్మాటికిని. నేనీద్వారమునొద్ద వేచియుండునది నిన్ను సంరక్షించుటకే.

ప్రభా-ఈపాపబుద్ధిమరల వానికెట్లుజనించె?

సారం-ఒకప్పుడుపోయి మరలవచ్చినదనుకొంటివా ? అసూయాపిశాచావేశుఁడై యాతఁడిట్లుచేయఁబూనుకొనెను.

ఉ. ఏటికినాకుఁదెల్పకయె ♦ యేగితిరాజికి? మల్లుఁజంపగాఁ
నేటికి? నేటికీయశము ♦ దేటికినీదృఢ బాహుశౌర్యమిం
కేటికి నీప్రజావినుతు ♦ లేటికినీదగు శాంతవృత్తిపే
రాటముఁజెందెనామనము ♦ హా! జగమెల్లనసూయనిండెగా.

ప్రభా-ఆతఁడిప్పుడేమి చేయఁబూనుకొనెను?

సారం-మందభాగ్యుఁడా !

ఉ. నీమహానీయశౌర్యమును ♦ నీజయలక్ష్మిని నీగుణంబులున్
నీమృదువాగ్విలాసమును ♦ నీరమణీయసురూపభాగ్యమున్
నీముదితప్రవర్తనయు ♦ నెమ్మినెఱింగి కృశించిపుట్టలోఁ
బాముపలెన్ బగంగొనుచు ♦ భ్రాతనినువ్వధియింపఁబూనెగా.

అతఁడు నిన్న చేసిన దురాలోచనలను నేను రహస్యముగానుండి వింటిని. చెప్పెదవినుము.

గీ. నీవునిదురించువేళను ♦ నీదుసౌధ
మెల్లఁగాల్పంగనిరుపుర ♦ నేర్పరచెను
నద్దితప్పిన వేఱొండు ♦ సాయమింక
నిన్నుఁజంపంగనాత్మలో ♦ నెన్నుకొనియె.

కావున నీవీగుమ్మము త్రొక్కవలదు.

ఉ- అన్న యుగాఁడతండు మది ♦ నారయఁదమ్ముఁడవీవుఁగావు పే
ర్వన్నియఁగన్న సోధము ని ♦ వాస సమాహారముగాదునీకునా
యన్న! గణింపుమన్న! యిపు ♦ డాడెడుమాటలు వేదవాక్యముల్
సన్నిహితంపుమృత్యువును ♦ జయ్యనదాఁటగదయ్య నెయ్యమా!.

ప్రభా-(ఆశ్చర్యముతో) ఓరికలహాంసా! భ్రాతృద్రోహీ! నీతియ్యనిమా
టల విశ్వసించి యామల్లునిఁ జంపితినే? రాజునకుఁగూడఁ బ్రబల
విరోధినయితినే?

సారం-ఆమాటలు నిన్ను మల్లునిచేఁ జంపించుట కేర్పడినవే? సుకృతలేశ
మునసీవు జీవించియుండుటవిని తానేజంపింప మీయన్న యుద్య
మించెను.

ప్రభా—సారంగా! ఇప్పుడు నన్నెక్కడకుఁ బొమ్మనెదవు?

సారం—మీరెక్కడకుఁబోయిననునరే? ఇచ్చటమాత్రముండఁగూడదు

ప్రభా—సారంగా! దేశములపైఁబోయి బిచ్చమెత్తుకొనితినుమనెదవా?
లేక మారుమూలలఁడాగి బాటసారులపైఁబడి దోచుకొని జీవిం
పుమందువా? విప్రప్రాయుఁడైన నాయన్న బారిఁబడియైనఁ బడుదును
గాని యట్టిహీనకృత్యముల నేఁజేయనొల్ల.

సారం—అయ్యా! మీయన్న బారిమాత్రము బడకుము. కీర్తిశేషుఁడై
న మీతండ్రినినుసరించి యార్జించిన వేతనములో నేను వేయ
రూప్యములివే సేకరించుకొంటిని. వీనినిఁదీసికొమ్ము. మఱియు,

గీ. విషయసుఖములనేవిట్టి ♦ వీగలేదు
బాల్యదశయందు నందుచే ♦ బలముగలదు
నేనువృద్ధుఁడనైనను ♦ నీకుఁదోడు
నీడనైయుందుఁగొనిపొమ్ము ♦ కూడనన్ను.

అతివృద్ధదశయందుమాత్రము నన్నుఁ గాపాడుము.

ప్రభా—సారంగా! నీవెంతసజ్జనుఁడవోయి!

కావున నీవీగుమ్మము ద్రొక్కవలదు.

ఉ- అన్నయుగాఁడతండు మది♦ నారయఁదమ్ముఁడవీవుఁగావుపే
ర్వన్నియఁగన్న సాధము ని♦ వాస సమాహారముగాదునీకునా
యన్న! గణింపుమన్న! యిపు♦ డాడెడుమాటలు వేదవాక్యముల్
సన్నిహితంపుమృత్యువును♦ జయ్యనదాఁటగదయ్య నెయ్యమా!.

ప్రభా-(ఆశ్చర్యముతో) ఓరికలహంసా! భ్రాతృద్రోహీ! నీతియ్యనిమాటల విశ్వసించి యామల్లునిఁ జంపితినే? రాజునకుఁగూడఁ బ్రబల విరోధినయితినే?

సారం-ఆమాటలు నిన్ను మల్లునిచేఁ జంపించుటకేర్పడినవే? సుకృతలేశముననీవు జీవించియుండుటవిని తానేజంపింప మీయన్నయుద్యమించెను.

ప్రభా—సారంగా! ఇప్పుడు నన్నెక్కడకుఁ బొమ్మనెదవు?

సారం—మీరెక్కడకుఁబోయిననునరే? ఇచ్చటమాత్రముండఁగూడదు

ప్రభా—సారంగా! దేశములపైఁబోయి బిచ్చమెత్తుకొనితినుమనెదవా? లేక మారుమూలలఁడాగి బాటసారులపైఁబడి దోచుకొని జీవింపుమందువా? విప్రాయుఁడైన నాయన్నబారిపైనఁ బడుదును గాని యట్టిహీనకృత్యముల నేఁజేయనొల్ల.

సారం—అయ్యా! మీయన్నబారిమాత్రము బడకుము. కీర్తిశేషుఁడైన మీతండ్రిననుసరించి యార్జించినవేతనములో నేను వేయ రూప్యములివే సేకరించుకొంటిని. వీనినిఁదీసికొమ్ము. మఱియు,

గీ. విషయసుఖములనేవిట్టి♦ పీగ లేదు
బాల్యదశయందు నందుచే♦ బలముగలదు
నేనువృద్ధుఁడనైనను♦ నీకుఁదోడు
నీడనైయుందుఁగొనిపొమ్ము♦ కూడనన్ను.

అతివృద్ధదశయందుమాత్రము నన్నుఁ గాపాడుము.

ప్రభా—సారంగా! నీవెంతసజ్జనుఁడవోయి!

గీ. పసువుసేనానినొక్కని ♦ వానిఁబట్టి
తెచ్చినాకప్పగింపఁగా ♦ దిట్టపరచి
వాఁడు లేకున్న తేఁబంపు ♦ భ్రాతనైనఁ
బిదపఁదెప్పింతువానిచే ♦ వీరవరుని.

ఇదియంతయు నతిరహస్యముగా నడుపవలెను.

సరస—చిత్తము. అట్టులనేచేసెదను.

ధన—ఇఁక మనము పోవుదమురమ్ము. (అనిసరసబుద్ధితోనిష్క్రమించుచున్నాఁడు)



రంగము 4. దండకారణ్యము.

[కీర్తివర్మయు, సూక్ష్మబుద్ధియు, సులోచనుండును
ప్రవేశించుచున్నారు].

కీర్తి—హితులారా! నాతమ్ముఁడునన్ను రాజ్యపదభ్రష్టునిగాఁజేసి యీయరణ్యములకుఁబంపినను మీరుగూడఁ గృతజ్ఞులై నన్ను వెంబడించినందులకు నాకు సంతోషముగానేయున్నది. అంతియగాక

చ. మునివరులిచ్చటేగద త ♦ పోనియతిన్ జరియించి దివ్యపా
వనతరబ్రహ్మమున్గని య ♦ పారమహత్వముఁగంట నీడ జీ
వనములు భద్రమైచెలగుఁ ♦ బాపపురాజ్యములందుకన్న నే
మనెదరు మీరు దంభమున ♦ కాస్పదమక్కడ సత్వమిక్కడన్.

అయినను ఋతువులభేదము నాకుఁ గొంచెమాయాసము కలిగించుచున్నది. చూడుఁడు.

చ. మలములమాడ్చిదేహములు ♦ మాకిఁకవద్దనుచాఁక వేఁడి కా
కలఁగఱగించి చెమ్మటలు ♦ గాఱ శరీరమునన్ ప్రవాహము
ట్టులు, దగఁబెంచియాపయిఁగ ♦ దుర్ శ్రమమున్ ఘటియించుగ్రీష్మముల్
తలపునఁబాఱ నిప్పటికి ♦ దారుణవహ్నిసెకల్ రగుల్కొనన్.

మఱియు,

చ. శరదమునీరబాష్పచయ ♦ సంగతమౌచుగుడారమట్టులం
బరము హఠాత్తుగానలమి ♦ భానుని తేజమడంచి చొక్కపుఁ
మెఱుపులుగన్నులందు మిఱు ♦ మిట్లుగ ణింపఁగవర్ష వేళలఁ
గుఱిసెడు వానలద్భుతముఁ ♦ గూర్చుచు నేనుగుతొండముల్బలెఁ ॥

ఇంతియగాక,

ఉ. సీతువు శీతకాలమునఁ ♦ జెక్కుఁ ఖులఁ బిగియించి మంచుతో
వాతపరంపరల్ తనువు ♦ పైఁ బ్రసరింపఁగఁ జేయదానిచే
నాతనువెల్ల కట్టెబలె ♦ నానదృఢత్వముజాఱె వృద్ధుగా
నీతఱిమారిచేయునది ♦ యేమియు లేక సహించికుందెదఁ ॥

ఈబాధలన్నియుఁ బడుటచేతనే నానిజస్థితి యేమియో నాకుఁ దెలియవచ్చినది. కష్టదశలనుభవించుటవలననే విజ్ఞానోత్పత్తియగును.

చ. శ్రమయిడి ప్రాణసంకటము ♦ సల్పుచు భీకరమైచరించు స
ర్పము క్రియ హేయమై ప్రబల ♦ బాధలఁ గష్టదశల్ ఘటించినఁ
విమలుఁడు దానఁగల్గు గుణ ♦ విస్తృతినెంచుచు సర్పమస్తర
త్నముఁగనుగొన్నవానిబలె ♦ ధన్యతఁబొంది సుఖించునాత్మలోఁ

అందుచేతనే,

చ॥ కలుషవిరోధకుత్సితవి ♦ కారమనన్యులపొందువీడి ని
ర్మలతరమైన యీమాన య ♦ రణ్యనివాసమె హాయిఁగొల్పెడుఁ
జలజలపాఱునేఱులను ♦ జల్లనినీడలనిచ్చు చెట్లుఁ
బొలుపగు నీశిలాఫలక ♦ ముల్ గని నేత్రములుత్సహింపఁగఁ ॥

హితులారా! యీనివాస మెందులకైన నాకువదలవలయునని లేదు సుఁడీ-

సూ—దేవరవారు సెలవిచ్చినదంతయు నాకు జ్ఞానబోధకముగా నున్నది. తాము కష్టములయందైన సుఖములనే కనిపెట్టుచున్నారు

గీ. కష్టములనైన దుఃఖసం♦గతికిఁబోక
సౌఖ్యము లెయెన్నుచుందురు♦సత్పురుషులు
క్షారజలముల నింద్యమా♦సంద్రముఁగని
సుగుణి రత్నాకరుండంచుఁ♦బొగడునట్లు.

కీర్తి—సూక్ష్మబుద్ధీ! నీకు నాయందున్న ప్రేమచే నట్లుచెప్పితివి. క్షుధాతురులమైన మనమిఁక నీవనమందున నల్లాడుహరిణములఁ జేతులారఁ జంపవలసివచ్చినది. అక్కటా! యెంతకష్టము.

చ. వనములఁబుట్టి యేరికి న♦పాయము సేయక దైవమిచ్చు జీ
వనములఁ గ్రోలి స్వేచ్ఛమెయి♦వారక కానలఁగొండలోయలం
దనయము సంచరించు చకి♦తైణమృగంబులఁ బాడుపొట్టకై
నెనయుదొఱంగి ప్రాణహతి♦నే నెటులన్వధియింతు దైవమా!.

సూక్ష్మ—దేవా? యిది మిక్కిలి దుఃఖకరమైనసంగతి. క్రూరచిత్తుఁడై దేవరవారినిఁ బదభ్రష్టునిఁజేసిన తమ్మునికంటె నీమృగముల దినమును జంపుటవలన మనమే పాపమెక్కుడు చేయుచున్నారము.

సులో—అయినను మనము స్వోదరపూరణార్థమును నందువలన ప్రాణసంరక్షణార్థమును నీమృగములఁ జంపుచున్నాముగాని విలాసార్థముగాదుగదా.

ధన—మీరిరువురు వచించినది సత్యమే. ప్రాణిహింస పాపమే. మన మాహారముసంపాదించుకొని ప్రాణముల నిలుపుకొనకున్న మన ప్రాణములుమాత్రముపోవా? అప్పుడు జీవహింసకాదా? ఈ రెండుప్రాణిహింసలలో నేది తక్కువపాపము ఘటించును? నిశ్చయముగా హరిణప్రాణిహింసయే. ఏమన్న హరిణజీవనములకన్న మనజీవములు మూల్యతరములుగదా? దైవము జంతువులలో నొకదానికొకటి యాహారమగునట్లును నరులకుఁ జత్తుష్పాత్తులలోఁ దిర్యగ్జంతువులలోఁ గొన్ని యాహారమగునట్లును సృష్టించినట్లు ప్రకృతివలననే మనకు స్పష్టమగుచున్నది.

గీ. ఎలుక పురుగులఁజంపునా♦యెలుకఁబిల్లి
చంపుఁబిల్లి నిశ్వానంబు♦చంపునిట్లె
జాతివైరోధ్యములఁబూని♦జంతుజాల
మెల్ల జీవించు నీదైవ♦సృష్టిలోన.

సాధనాంతరము లేమి మనమీ మృగములఁ జంపితిమేని దైవముమా త్రము మనయుద్దేశముఁ బరికింపఁడా?

సూక్ష్మ—దేవా! తాము సెలవిచ్చిన హేత్వహేతువిచారణ బాగున్నది తమచిత్తమే మాయిష్టము.

కీర్తి—అట్లైన వేటకుఁబోవుదము రండు. కావలసినంతవరకే సేకరింతము.

సూక్ష్మ-సులో-చిత్తము. (అని యందఱు నిష్క్రమించుచున్నారు)



రంగము 5- ఇంకొక యరణ్యభాగము.

[సరోజిని పురుషవేషముతోఁ గమలిని వెంటరాఁ బ్రవేశించుచున్నది]

సరో—దైవమా? నాశరీర మెంతయలసినది!

చ. వనజముఖిలలామలకుఁ♦బాదములబ్జములంచు సత్కవుల్
వినుతియొనర్తురట్టి మృదు♦పేశలసత్పదముల్ శిలాస్థలం
బునవిహరింప శోకఝరి♦భోరునఁబొంగెడుఁ బూరుషాకృతిఁ
గొనకొనియుంటనేనెటుల♦గోలునసేద్చెద నాఁడుదింబలెన్.

కమ—సోదరీ? నీకుఁ గోపమువచ్చిననుసరేగాని యింకొక యడుగైన నిడనోప. పాదములఁ బొక్కులుబ్బినవి చూడుము.

సరో—అక్కా! మనము దండకారణ్యముఁ జేరితిమి. ఇఁక శరీరాయాసము నీవు పడనక్కరలేదు.

[అంత వానందుఁడు, గోవిందుఁడు అను నిద్దఱు గొల్లవాండ్రు ప్రవేశించుచున్నారు]

గోవిం—ఆనందా! నీవా సానందను మోహించినందులకు బాగుగాఁ జేసినదిలే.

ఆనం—గోవిందా! ఏమిచేసినది. నన్నామెయు మోహించినది. ఆమెను నేనెంత ప్రేమింతునో నీకుఁ దెలియునా?

గోవిం—దినదినముజూచుచున్నానుగా? ప్రేమలన్న నాకునుఁ దెలియునులే. చిన్నతనమున నాభార్యను నేనును ప్రేమించినవాఁడనే గదా.

ఆనం—అవునుగాని యిప్పుడు వృద్ధుఁడవగుటచేత మఱచిపోయియుందువు. అదిగాక నేను ప్రేమించినంత నీవు ప్రేమించితివని యనుకొనను. జగమంతయు నాకు సానందమయమే. దానిమూలమున నాపనిపాటలన్నియుఁ బాడగుచున్నవి. ఏదియేమైననుసరే దానినిఁ జూచినఁగాని నాప్రాణములు నిలువకున్నవి. వెదకుటకై పోయెదను. (అని నిష్క్రమించుచున్నాఁడు)

సరో—(తనలో) ఓరి యానందా! నీమోహవిషయముచే మఱచిపోయిన నామోహవృత్తము జ్ఞప్తికిఁ దెచ్చితివా?

గీ. నీదుమోహంబుఁదలపెట్టి ♦ నీవువిరహ
తాపమునుబొంద నామది ♦ తల్లడిలెడు
నొకఁడు గాయంబుచే బాధ ♦ నొందుచుండ
నింకొకఁడు దన గాయాన ♦ కేడ్చినట్లు.

హా! ప్రభాకరా? నీవెందున్నావో! నాకయి యొంత తపించుచుంటివో.

కమ—సోదరీ!

గీ. ఆకలికిఁదాళలేక నే ♦ నలసియుంటి
ధన మొసంగిన నాహార ♦ మును ఘటించు
నేమొ యాగొల్లవానిని ♦ నీవడుగవె
దొరుకకుండిన ప్రాణముల్ ♦ తొలఁగునేమొ.

సరో—అక్కా! అడిగెదను. ఓగొల్లబోయఁడా? దయయుంచి యొకసారి యిటకురమ్ము.

గోవిం—(సమీపించి) ఎవరుమీరు? నన్నేలపిలిచితిరి?

సరో—మిత్రమా! మాసంగతి యీ వెనుకఁజెప్పెదముగాని యవసరముగా ముందు నేనడుగుదానికిఁ బ్రత్యుత్తరమిమ్ము.

చ. ధనమునఁగాని లేనియెడ ♦ ధార్మికవృత్తినిగాని మాకు భో
జనమును విశ్రమించుటకుఁ ♦ జల్లనినీడయునిచ్చు పుణ్యుఁడీ
వనముననుండెనేని నిర ♦ పాయత మమ్మటుచేర్పవయ్య! యీ
ఘనతవహించి పుణ్యమునఁ ♦ గ్రాలఁగదయ్య! దయాకరుండవై.

ఇదిగో చూడుము. ఆకలిచేబడలి నాసహోదరి యీమె యెట్లుపడియున్నదో!

గోవిం—అయ్యో! నిజముగా నామెనుజూడ నాకు జాలివేయుచున్నది. అక్కటా! నేనేమిచేయఁగలను. నేనొకయయ్యకడఁ గొలువుండి పొట్టఁబోసుకొనుచున్నాను. అతఁడు మిక్కిలికోపి. అంతియుగాక యాతనిమేకలును గోష్ఠమును నిల్లునుఁగూడ విక్రయించుచున్నాఁడు- అతఁడింటిపట్టున నుండకపోవుటచే నాతిండికే కష్టముగా నున్నది.

సరో—అట్లులయిన నీయజమాని స్వాస్థ్యమును గొనువారెవరు?

గోవిం—ఇందాఁక నాతో మాటలాడిన గొల్లవానికిఁ గొనవలెనని యున్నదిగాని యది సమ్మవలనుపడదు.

సరో—అట్లులైన దానిని మాకుఁగొనిపెట్టెదవా?

కమ—ఓరీ! నీకు వేతనము హెచ్చింతుము. మాకడనుందువుగాని యట్లు చేయుము.

గోవిం—మీకుఁగావలసినయెడల నాప్రదేశము వచ్చి చూచుకొనుఁడు. నేను మీకడఁ గొలువుండెదను- దానిని మీకుఁగొనిపెట్టెదను

సరో-కమ- మంచిది. ముందునడువుము. (అని గోవిందునితో నిష్క్రమించుచున్నారు.)

రంగము 6. ఇంకొక యరణ్యభాగము.

[ప్రభాకరుఁడు సారంగునితోఁ బ్రవేశించుచున్నాఁడు]

సారం—ఓయయ్యా! ఇఁక నేఁ గదలఁజాలను.

చ. తలబరువెక్కె నెండకును ♦ దయ్యపుటాకలి నన్దహించెడున్
నిలువునఁజెమ్మటల్ వరద ♦ నీరములట్లు స్రవించుఁ బ్రాణముల్
దళదళలాడుఁబొక్కులు ప ♦ దంబులనుబ్బెను వృద్ధునౌటచే
నలసితిఁజాలనిఁక నడు ♦ గైనను నేనిడఁజాల నక్కటా!.

(అని నేల వ్రాలుచున్నాఁడు)

ప్రభా—సారంగా! అలసితివా! అయ్యోపాపము! అక్కటా నామూలమున నీవుగూడ బాధపడుచుంటివి.

ఉ. ప్రాణములన్నఁదీపిగద ♦ బల్మినిధైర్యముఁజిక్కఁబట్టి లో
నూనుము కొంత హెచ్చరిక; ♦ యుండదుతాపము చెట్టుచేమలున్
గానలఁగల్గుచిత్రములఁ ♦ గన్నులవిందుగఁ జేసెదేని నా
ప్రాణమ! యోర్చియుండుము కృ ♦ పామతిఁదెచ్చెదనీకునాహృతిన్.

చ. ఇదె చని వన్యసత్వమును ♦ నేదయినన్వధియించి తెచ్చి స
మ్మదముఘటింతు; నొక్కయెడ ♦ మాంసము నీ దురదృష్టరాశిచే
నదనునకందకున్న మఱి ♦ యున్విధి; నేనిటువచ్చులోపలన్
వదలకు ప్రాణముల్ హితుఁడ! ♦ నాకొరకై క్షణమాత్ర మోర్పుమీ.

ఇదిగో నీనీడ విశ్రమింపుము. ఇఁట నున్నట్లు వచ్చెద.

(అని చెట్టునీడకుఁ జేర్చి పోవుచున్నాఁడు)



రంగము 7. ఇంకొక యరణ్యభాగము.

[కీర్తివర్మయు, సూక్ష్మబుద్ధియు, సులోచనుఁడును, మరికొందరును ప్రవేశించుచున్నారు.]

సూక్ష్మ—దేవా? నేఁడు దేవరవారి జన్మదినమహోత్సవము గనుక మన మీయరణ్యభాగముల నజ్ఞాతవాసులమైయున్నను మేమందఱ

ము సన్నిధానముననుండుటచే నాయుత్సవము నెఱపందలంచితి మి. సర్వము నాయుత్తమైనది. తాము దయజేసి భక్ష్యముల నారగింతురుగాక.

కీర్తి— హితుఁడా? మీయందఱకు నాయందుగల భక్తివిశ్వాసముల నీ యుత్సవము సూచించుచున్నది.

ఉ. ప్రాజ్యధరాధిపత్య మొడ♦బాటగు నీవనభాగమంతయుఀ
భోజ్యములిందుఁగల్గెడు న♦ పూర్వఫలాదికవస్తుసంతతుల్
పూజ్యులు దోషవర్జితులు♦బోయలు వన్యమృగంబులే ప్రజల్
రాజ్యముమంత్రులుఀ బ్రజలు♦రంజిలరేయిఁటఁబూర్వమట్టులన్?

కావున మనపరివారమును బ్రజలునుగూడి యీదినము సంతోష ముగాఁ గడపెదము.

సులో— అందఱిని బిలిపించితిని. సర్వము సిద్ధముగా నున్నది దేవర భోజనశాలకు వచ్చుటయే కొఱంత.

కీర్తి— (సంతోషముతో) అట్టులనా? మీయట్టి హితులుండఁగా నే నరణ్యమున నున్న నేమి? మృత్యుముఖమున నున్న నేమి?

గీ. దుఃఖరోగంబుల నడంచుఁ;♦దూల్చుహృదయ
తాపమును; సౌఖ్యబలమును♦ దా ఘటించు;
దేహమెప్పుడు నిల్పు ను♦త్సాహమునను;
వీర! నెయ్యంపుమందు జో♦డవనిఁగలదె?

హితులారా! పోదమురండు. (అని ముందున్న భోజనశాలకుఁ బో వుచున్నారు)

సూక్ష్మ—(నిలుచుండి) స్నేహితులారా! ప్రజలారా? మనమందఱ మీ దినమీఁటఁ జేరినకారణము మీకుఁదెలియకపోదు. ఈదినమున సకలసుగుణసంపన్నులగు మన కీర్తివర్మమహారాజుగారి 55 వ జన్మదినమహోత్సవము నెఱపఁబోవుచున్నారము. కావున మీ రందఱు శ్రీవారి యాయుర్వృద్ధిగోరి సుఖమతులై యిఁకజరు గఁబోవు విందారగింతురుగాక.

అందఱు--మాకందఱకుఁ బరమసంతోషము. దేవరవారు వెయ్యేండ్లు జీవింతురుగాక. రాజ్యలక్ష్మి స్వల్పకాలములోఁ దిరిగివలచుఁగాక.

సులో--ఇఁక మనమందఱము విందారగింపవచ్చును. దేవా! తమపీఠము ను దామలంకరింపుదురుగాక.

కీర్తి--మంచిది. (అని సిద్ధపడుచున్నారు)

[అంతఁ బ్రభాకరుఁ డొరదీసినకృపాణముతోఁ బ్రవేశించుచున్నాఁడు]

ప్రభా--(తటాలున సభామధ్యమున కుఱికి) ఆగుఁడు- ఆగుఁడు-

గీ. నాదుకోరిక తీరునం ♦ దాఁక మీర
లించుక భుజింపరాదు గ ♦ ర్వించి తినఁగఁ
జాలుదురయేని నాకర ♦ వాలమునకు
నెఱయగుదురయ్య నిశ్చయ ♦ మింతసుండి.

సూత్ర--(తనలో) ఎవ్వఁడీమహాశూరుఁడు (ప్రకాశముగా) మేమిదివర కు భక్షింప లేదు- నీవెవరవు?

ప్రభా--ముందుగూడ భక్షింపవలనుపడదు. నేనెవఁడనో చెప్పెదను.

కీర్తి--(ఆశ్చర్యముతో) ఓయీ!నీవెవ్వఁడవు- ఏమి యీదౌర్జన్యము?

గీ. పీతమర్యాదకుఁడవొ క్షు ♦ ధాతురుఁడవొ
శాతదీర్ఘకృపాణంబుఁ ♦ జేతఁబూని
ఘాతుకత్వంబు నెఱపెదు ♦ నీతిమాలి
యింతసాహసమిందు నీ ♦ కెట్లుగలిగె?

ప్రభా—ఓయయ్యా!

మ. శిరమంటెన్ భవదుగ్రవాక్యములు గా ♦ సిల్లెన్ మనంబెంతొ యా
తురతన్ గాలి క్షుధాగ్ని బాధనిఁటకున్ ♦ దోతెంచి మర్యాద లి
త్తరి దూరంబుగఁ బెట్టితిన్; దెలియు స ♦ ద్ధర్మంబుత్యాగంబు;నా
గరికుండన్ విమలాన్వవాయజుఁడఁ బ్ర ♦ జ్ఞాయుక్తుఁడన్ శూరుఁడన్

కీర్తి--ఓయీ! నీశూరత్వమునకు భయపడువాఁడను గానుగాని

గీ. నీప్రతాపంబుకంటెను ♦ నీసురూప
సంపదయె నామనంబున ♦ నింపునింపు

లలితకరుణను నీకిందు వలయుఫలము
లిత్తు నీశౌర్యమునకోడి ♦ యీయఁజుమ్మి.

ప్రభా—అట్టులైన నోయయ్యా!

గీ. కడుపునిండెడు నాకు నా♦కలినిగాన
భక్ష్యములనిచ్చి కావవే♦ప్రాణములను

కీర్తి— కొదువయేటికి రమ్మిందుఁ♦గూరుచుండి
కలఫలంబులు గొనుము స్వా♦గతమునీకు.

ప్రభా—మహాత్మా! మీయాదరణంబునకు సంతసించితి; నాతీవ్రంబునకు
లజ్జించితి. నన్ను క్షమింపఁగోరితి.

చ. వనమిదియాటనిందుఁ గల♦వారలు మూర్ఖులె కాగణించి బా
ధ నపనయింప శౌర్యమె ప్ర♦ధానముగాఁదలపోసి తొల్తనేఁ
జెనకితి నజ్ఞతన్ మిము వ♦శీకృతసర్వగుణా! క్షమించి భృ
త్యునిగతిఁజూచి నాకుఁ బరి♦తోషముగూర్పుఁడుభూతతృప్తిగన్

చ. తెలియదు నాకుమీరెవరొ;♦తెల్లము సద్గుణులంచు నాభిజా
త్యులెయసి; రాజభోగముల♦నూతననొందినవార లేని ని
ర్మలభగవత్ప్రసేవన వి♦రాజితమూర్తులరేని జాలి దీ
నులఁగడుఁ బ్రోతురేనియున♦నున్ బ్రదికింపఁగదయ్య జాలిమై॥

కీర్తి— గీ. బ్రదికిచెడినారమయ్య స♦ర్వజ్ఞసేవ
మాకుఁగలదయ్య! దీనుల♦శోకహతులఁ
జేతనైనంతవరకు ర♦క్షింతుమయ్య
నిన్నుఁజూడంగజాలి మా♦కున్నదయ్య.

కాఁబట్టి యిందున్న భక్ష్యములఁదిని ముందునీయాకలినే తీర్చుకొమ్ము

ప్రభా—వాయనా? నామనోభీష్ట మింకొకటియున్నది. అది తీరినంగాని
నేనీభక్ష్యముల చవిచూడనొల్ల.

కీర్తి—అదియేమి?

ప్రభా— గీ. ఎట్టులభుజింపఁగలవాఁడ♦నేనునాదు
తోడువనమున మలమల♦మాడుచుండ

కీర్తి-- కలఁడె యింకొకఁడీవన ♦ స్థలమునందు
నెందునున్నాఁడతండు రాఁ ♦ డేలయింటకు?

ప్రభా--అయ్యా! ఆతఁడు

చ. కడుబడలెన్ బథశ్రమను ♦ గాలు మెదల్పఁగ లేక కానలో
నొడలిని వ్రాల్చి ప్రాణమిపు ♦ డో యిఁకనో చనునంచునుండె; వృ
ద్ధుఁడనగు టాపయిన్ బలము ♦ దూలెను సోలెను జాల; జీవముల్
విడిచెనొ యేమొ యింతకుఁజ ♦ లించెడు నామది వానికై కడున్.

ఆహారము తెత్తుననియుఁ బ్రాణములుగ్గబట్టి యుండుమనియుఁ జెప్పి వచ్చితిని. పాప మాతఁడేమయ్యెనో?

కీర్తి--ఓయీ! నీవు సత్వరముగాఁబోయి యాతనిఁ దీసుకొనిరమ్ము. నీవు వచ్చువరకు మే మిట్టులనే యుందుము.

ప్రభా--చిత్తము. (అని పోవుచున్నాఁడు)

కీర్తి--హితులారా? ఆలస్యమైనది. పెట్టినయన్నముఁ దినినదాఁక నమ్మకములేదనుట కిదియే దృష్టాంతము. అయినను మనకు భూతదయ ప్రధానము. అది యటుండనిండు. చూచితిరా యీలోకమున మనమే దుఃఖభాజనుల మనుకొంటిమి. మనల మించెడువారు గూడఁగలరు.

ఉ. చూపటికాతిన్ గొల్ప మన ♦ శోకరసంబున మాఱువేషముల్
ప్రాపుగ నస్మదాదులను ♦ పాత్రము లాడ వికారమై మన
స్తాపముఁగూర్చునీవిపిన ♦ దారుణరంగముఁగాక పెక్కులన్
జూపెడు లోకనాటకము ♦ చోద్యముగా నతిదుఃఖరంగముల్.

సూక్ష్మ--దేవా? సత్యమువచించినారు.

సీ. ఈప్రపంచకమెల్ల ♦ నింపైననాటక
శాల స్త్రీపురుషులు ♦ సరసపాత్ర
కములు ప్రవేశని ♦ ష్క్రమణంబులయ్యావి
యొందుచుండును; సమ ♦ యోచితముగ

నొకపాత్రయే యెన్ని ♦ యో వేషములఁ దాల్చి
నన్నియుఁ జేర్పనే ♦ డగును జుమ్మి
ప్రథమంబు శైశవా ♦ వస్థ; యప్పుడు తన
యంబ చేతులఁ బ్రాకు ♦ లాడుచుండుఁ
బిదప మాఱెడుబడి ♦ పిల్లకాయగ; నవ్వా
డే గెడు బడికి న ♦ యిష్టముగను
దరువాతఁ గామత ♦ ప్తశరీరుఁడై మోహ
పాశంబులం జిక్కి ♦ పాట్లుపడెడు
నామీద దుఃఖలో ♦ కానుభవం బొంది
సంసార యుద్ధంబు ♦ సలుపఁ దివురు
నాపిదపను నందు ♦ నాఱితేఱుచుఁ దెల్పు
మంచిచెడ్డలనుగా ♦ మారదశను
నాపయిఁ దనదు దే ♦ హపటుత్వము నశింపఁ
గనుచూపు మాంద్యమై ♦ కష్టపెట్ట
నడువంగఁ బోఁగాళ్లు ♦ తడబడ కంఠస్వ
నంబు జీరలు వ్రావ ♦ నవసియుండు

గీ. నంతి కావస్థ నాపయి ♦ నతఁడు వ్రెందు
నదియె ముగియించుఁ గథ యెల్ల ♦ నబ్బురముగ
రసనరుచి లేక కనుచూపు ♦ మసకగ్రమ్మఁ
బన్ను లూడంగ సర్వాంగ ♦ పటిమ సెడఁగ
మరలఁ బొందెడు శైశవాం ♦ తరము నతఁడు.

కీర్తి-సూక్ష్మబుద్ధీ! నీవు సూక్ష్మబుద్ధివే యగుదువు. ఈజగన్నాటకమును నెంత చక్కఁగా వర్ణించితివి? నీమాటలు నాకుఁ బురాణవైరాగ్యమును గలిగించినవి.

(అంతఁ బ్రభాకరుఁడు సారంగుని వీపుపైఁ బెట్టుకొని ప్రవేశించుచున్నాఁడు).

ప్రభా-అయ్యో!

గీ. ఇడుగొనా ప్రాణమిత్రుండు ♦ వృద్ధమనుజుఁ
డాకలికిడస్సి మాటాడ ♦ లేకయుండెఁ
బదములిడలేమి నావీపు ♦ పైనిబెట్టి
మోసుకొనివచ్చినాఁడఁబే ♦ రాసతోడ.

కీర్తి- ఓయీ! నీకాతఁడు భారముగానుండును.

గీ డింపియాతనినా వెన్క ♦ డింపుకొమ్మి
దేహమానసభారముల్ ♦ ధీవిశాల!

ప్రభా- అట్లె చేసెదమీదగు ♦ నతిథిపూజ
కలరివందన మిడెదనే ♦ నతనిబదులు.

(అనిసారంగునిడింపుచున్నాడు).

సారం-(నేలఁజతికిలపడి కీర్తివర్మకుఁ జేతులతో మ్రొక్కు నభినయించుచున్నాఁడు).

కీర్తి-మీకిరువురకును స్వాగతము. ఇఁకజాగుసేయక మీయాకలిని దీర్చుకొండు. మేమునుభుజియింతుము. పిదప మీవృత్తాంతముఁదెలిసికొందునుగాక.

(అని యందఱు భుజించుచున్నారు).

ప్రభా-(భుజించి) అయ్యా! తృప్తిపడినారము. మాప్రాణములునిల్పిన మహాపుణ్యులరగు మీఋణమెట్లుతీర్చికొందును.

కీర్తి-నీమాటయేచాలు. నిన్నుఁగని కృతార్థుఁడైన నీజనకునినామమెయ్యది?

ప్రభా-అవధరింపుఁడు.

కం. అతిశౌర్యధురంధరుఁడయి
యతులయశఃకామినీము ♦ ఖాంబుజరవియై
ధృతిఁగీర్తి వర్మఁగొలిచిన
ధృతకీర్తియెనాదుతండ్రి ♦ దేవా! వింటే.

కీర్తి-(తనలో) ఈతఁడు మనధృతకీర్తిపుత్రుఁడా? ఓహో! ఈతనిఁ జూచి నామనమానందముచే నుప్పొంగుచున్నది. (ప్రభాకరునిఁ

గాఁగిలించుకొని (ప్రకాశముగా) నాయనా? నీవు ధృతకీర్తి పుత్రుఁడవా! నిన్నుఁజూడఁగానే మానాయననుఁజూచినట్టులున్నది.

చ. మనమలరారెధన్యుఁడను ♦ మాన్యుఁడనౌ ధృతకీర్తిపోలికల్
కనఁబడునీముఖంబున మ ♦ గంటిమికిన్ ప్రతిబింబమీవెయౌ
తనకిని; ప్రాణమిత్రుఁడుగ ♦ దాఘనుఁడాతఁడునాకుఁ; గీర్తివ
ర్మనృపుఁడనేనెయిట్టుల న ♦ రణ్యము లేలుచునుంటినిచ్చటన్.

ఓయీ! నీవాతని మూఁడవపుత్రుఁడవుగాఁబోలు. నాకాతఁడప్పుడప్పుడు నీశౌర్యమునుగురించి ముచ్చటించుచువచ్చెను. నేను దానినిఁ బ్రత్యక్షముగా నీదినమునఁజూచితిని.

ప్రభా- (భక్తిసూచకముగా) అయ్యా! తామేనా కీర్తివర్మమహారాజుగారు?

గీ. సుదినమయ్యెను నీనాడు ♦ సుదినమయ్యె
మామహారాజదర్శన ♦ మహిమవలనఁ
దొల్తనేఁజేసినట్టి దు ♦ ర్దోషమునకు
నన్నుఁ క్షమియింపవయ్య ప్ర ♦ సన్నహృదయ!

పరమవిధేయుఁడను, భృత్యుఁడను, నేనుధృతికీర్తి మూఁడవపుత్రుఁడనే. నాపేరుప్రభాకరుఁడు.

కీర్తి- పరమసంతోషము. నాప్రాణపదమగు ధృతకీర్తి జీవించియున్నాఁడా?

ప్రభా- (విచారముతో) లేఁడు.

కం. గతియించెను నక్షత్రము
గతినాజనకుండు జీవ ♦ కాంక్ష నెడలి, మా
రతిదుఃఖవశత రాజ్య
చ్యుతులైయిటురాఁగ నేను ♦ శోకాబ్ధిఁబడన్.

కీర్తి-(దుఃఖముతో) హా! శౌర్యరాశీ! ధృతకీర్తీ! ఇంకను నీపైఁగొంత యాశపెట్టుకొంటిని. నీవును గతించితివా? హాతవిధీ! నన్నేలమిగిల్చితివి.

ప్రభా-దేవా? గతించినదానికి వగవనేల? శాంతింపుఁడు. మాతండ్రికి బదులు నేనున్నాఁడనుగదా!

కీర్తి-హా! శౌర్యధురంధరా!

గీ. నాకుడిభుజంబ! ధృతకీర్తి! ♦ నాయనుంగ
నాదుశౌర్యాబ్ధి! గుణరాశి! ♦ నాకొలఁకును
విడిచితేసీదు ప్రాణముల్ ♦ విడువలేను
నీహతాస్మరణంబును ♦ నేనువించు.

ఇఁకనాకు ధృతకీర్తి కనఁబడఁడుగదా ! ఓయీ ! యీవృద్ధుఁడెవఁడు?

ప్రభా-అయ్యా! ఈతఁడు మాజనకుని ప్రియసేవకుఁడగు సారంగుఁడు. కారణాంతరముచే నాఁశోడునీడయై యిటువచ్చినాఁడు.

కీర్తి-అట్టులయిన నీవృత్తాంతమానుపూర్వికగా వినవలతును. ఆతనికిఁ జేయూతనిచ్చి నీతోఁగూడఁగొనిరమ్ము. నీచేయినాకందిమ్ము.

గీ. ఏనునివసించుగిరిదరి ♦ లోనికేగి
నీసమాచారమంతయు ♦ నేనువినెదఁ
బూసగుచ్చినవడువున ♦ బోధపఱుప
రమ్మునాతోడవృద్ధమి ♦ త్రమ్మతోడ.

హితులారా! మీరందఱును బోవచ్చును నేనునుబోయెదను.

(అనియందఱు నిష్క్రమించుచున్నారు).

ఇది శ్రీమద్రమారమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యాన
పారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానురాగనూర
మాంబా వేంకటామాత్యపూర్వతపఃఫలరూపశౌనక
సగోత్రప్రదీప తురగాన్వయాంభోధిసుధానిధాన
వేంకటాచలాభిధానప్రణీతంబగు సరో
జినీనాటకంబునందు
ద్వితీయాంకము.





శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# సరోజినీ నాటకము

## తృతీయాంకము.

### రంగము 1. ప్రాసాదములోని యొకగది.

(ధనవర్మయుఁ గలహంసుఁడును ప్రవేశించుచున్నారు)

ధన- (కోపముతో) కలహంసుఁడా ? నీతమ్ముఁడు ప్రభాకరుఁ డెక్కడ నున్నాఁడు?

కల- (సాధ్వసముతో) మహాప్రభూ? మల్లయుద్ధమయిన పిదప నాతఁడు నాకుఁగనఁబడనే లేదు.

ధన- (తిరస్కారముగా) నీకట్లు చెప్పుటకు సిగ్గులేదా?

చ. అరివిజయంబుఁ గాంచి కల ♦ హంసుఁడ! నిన్ను గనంగవచ్చు సో
దరునినిఁ గాంచలేదనఁగ ♦ దాఁ సిననమ్మెదరంచు నెంచెదో?
పరుసఁదనంబొ! లేకపృథు ♦ భాగ్యమదంబొ! తిరస్కృతంబొ! నిన్
దటిమెదనూరి బైటకును ♦ దథ్యముఁ బల్కకయుంటి వేనిఁకన్.

కల- (తనలో) ఈతమ్మునివలన నాకెప్పుడును గష్టము లే. నిజముగా వానిని నేనుజూడలేదు. ప్రభువు నామాటల నమ్మకున్నాఁడు. అన్నా! దైవమా! నాపాట్లిట్లున్నవో (ప్రకాశముగా).

చం. ఎఱుఁగను స్వామితోడు జగ ♦ దీశునితోడుగ నాదులమ్ముఁడి
త్తరి నెఁటనున్నవాఁడొకట! ♦ తథ్యము వల్కఁగ స్వామిసన్నిధిన్

గరువమొ? నేవిధేయుఁడను ♦ గానె ప్రభూ! యిటువల్కఁ బాడియే?
తఱుముటకూర్చి బైటకును ♦ దప్పెటు చేసితినయ్య మీ యెడన్.

ధన- ఇవియే మదించినమాటలు. సోదరభాగమును నపహరించిన నీవెట్టి యొట్టులనయినఁ బెట్టికొనఁగలవు. వేయేల!

ఉ. మిండఁడు నీదు తమ్ముఁ డెల ♦ మిన్ వసియించెడు తావు మాకుఁ బం
డ్రెండు నెలల్ గతించకయ ♦ నీవు వచింపక యుంటివేని నీ
యిండులు మేడమిద్దెలును ♦ నెల్ల ధనమ్ములు మమ్ముఁ జెందు నీ
వుండవు మత్పురంబున న ♦ నూనబహిష్కరణాజ్ఞ బల్మి చేన్
మఱియు,

గీ. తెమ్ము వానిని నిఁటకు వ ♦ ధించి యైన
బ్రదుకుతో నైన గడువులో ♦ పలను మాకు
లేక యుండిన నీపాట్లు ♦ తెల్లము గద
కడక వెదకుమి కంచుకా ♦ గడలవాని.

కల- (తనలో) ఆహా! నాచావిందునిక్కము. మాతండ్రిగారిపైఁ గోప మీ ప్రభాకరపలాయనవ్యాపారమునఁ జూపి నన్నీప్రభువు బాధింపఁబూనె.

గీ. దేవుఁడైనను బ్రాణముల్ ♦ తీయువేళ
నేదియో కారణముగణి ♦ యించి చంపు
నవరజపలాయనవ్యాజ ♦ మరసి యిట్లు
ప్రభువు విధియించె నాకుఘో ♦ రంపుశిక్ష.

(ప్రకాశముగా) దేవా! సత్యమును దెలిసికొనకయే నాకుఁగఠిన శిక్షవిధియించితిరి. నాతమ్ముఁడు పరమదుర్మార్గుఁడు. మల్లయుద్ధమునకు ముందు నన్నుఁ జంపుటకే ప్రయత్నించినాఁడు.

కం. ప్రేమింప నతని నెప్పుడు
కామింపను వాని పొత్తు; ♦ కన్నులఁ బడుచోన్
సామీప్యమునకుఁ బోవను
స్వామీ! విద్వేషి నాకు ♦ వాఁడు తలంపన్.

అట్టివానియునికి నాకుఁ దెలిసియుండిన దేవరతో మనవి సేయుట కే మిసుఁ దేహము? ఇది యొక్కటియే చూడుఁడు.

ధన- (కోపముతో) ఓహో? నీవు నన్నాగుణుఁడవు కాఁబోలు మేము విధించిన శిక్ష యక్రమమే గదా! అట్టులయిన నీకిందాఁక నిచ్చిన గడువు తీసివేయుచున్నాను సేవకులారా?

గీ. ద్రోయుఁడీవీనినవలకు ♦ దోషమునక
ద్రోహిపాపాత్ముకుఁడు కడు ♦ దుర్జనుండు
స్వామిద్రోహంబుఁబూనిన ♦ వానిధనము
నాక్రమింపఁగ నెద్దాన ♦ నఘము లేదు.

కావున సేనానితో వీనిస్వార్థ్యమునంతయు నాక్రమించుకొనుమంటినని నాయాజ్ఞగాఁ జెప్పుఁడు. వీనిని నూరిబైటకుఁ దఱుముఁడు.

(అనిపోవుచున్నాఁడు).

సేవ- చిత్తము (అని కలహంసునిఁజూచి) నడు, నడు (అనిత్రోయుచున్నారు).

కల- ఇది యేనా న్యాయము!

గీ. పాపభూయిష్ఠమయ్యెఁ బ్ర ♦ పంచకంబు
నాకుఁదమ్ములకునుగాక ♦ నాదుస్వార్థ్య
మెల్లనీభూధవుఁడు సంగ్ర ♦ హింప నెంచె
ననుజుఁ డీఁట లేనిలోపంబు ♦ గనఁగనయ్యె.

(అని సేవకుల వెంటరాఁబోవుచున్నాఁడు).



రంగము 2- అరణ్యభాగము.

(ప్రభాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు).

ప్రభా-(తనలో) హా సరోజినీ! నిన్ను మరలఁ జూపికిఁదెచ్చెడు గడియలు చేరఁబాఱినవి. నాకొఱకై మోహసముద్రమునఁబడి నీవెట్టులీదులాడుచున్నావొగదా? నీకొఱకె యొక్కటియే నాకుఁగలజీవితాశ.

గీ. నేభవద్దర్శనానంద ♦ లాభ మొంద
నీమహారణ్యసీమ న ♦ దిష్ట దేవు
స్మరునిఁగూర్చి తపంబును ♦ సలుపువాఁడ
నతఁడుకూర్చెఁడె నాయీప్సి ♦ తార్థములను

మంత్రదేవతవైన నిన్నే ముందుధ్యానించి వర్ణించి పిదపఁగామ భగవానుని సేవించెదఁగాక. నిన్ను వర్ణించివ్రాయుట కిచ్చటసాధనము లేవియుఁ గనఁబడవే. (ఆలోచించి) ఇట్లుచేసెదను.

ఉ. ఈవనమందువర్ధిలుమ ♦ హీజములేనిక వ్రాయుగ్రంథముల్
పావనవృక్షచర్మములె ♦ పత్రములందు; నఖాళిలేఖినుల్
పావని! యోసరోజిని! భ ♦ వద్గుణరత్నకదంబమెల్లనిం
పావహిలంగవ్రాసెదవ ♦ నౌకసులందఱుజూచిమెచ్చఁగన్.

(అని ముందునకుఁబోయి యొకపొన్న చెట్టుపై నీక్రిందిపద్యము వ్రాయుచున్నాఁడు).

చం. సరసకటాక్షబాణముల ♦ సారెకుగాడఁగ నేసిమల్లసం
గరమునమందహాసములఁ ♦ గన్నులవిందొనరించి హారముల్
గుఱుతుగనాకొసంగి యెటఁ ♦ గోచనుదెంచినయోసరోజినీ !
నిరతమునిన్నుఁజూప స్మరు ♦ నిన్ వనమందున వేడెదన్ జుమీ?

ఓపద్యమా ! నామోహసాక్ష్యముగా నీవిఁటనిలిచియుండుము. (అని యొకరసాలవృక్షముకడ కేగి).

మత్తకోకిల॥ గున్నమామిడి! నిన్నుఁబోలెడు ♦ కోమలాంగిమనోహరా
భ్యున్నతంబునఁ; ద్వద్రసంబులఁ ♦ బోలునా చెలివాక్యముల్
చిన్నెవన్నెమిటారిమారుని ♦ చిల్క, కన్నియ, యాపదా
ర్వన్నె బంగరుచాయమేనిది ♦ వారిజాక్షితలంపఁగన్.

(అనుపద్యమునువ్రాసి) ఓపద్యమా! నీవిఁటనిలిచి శాశ్వతకీర్తిఁ బొందుము

(అనియొకచంపకభూజమునుజేరి).

గీతిక చంపకభూజమ! నాసరోజినీ, చారువిలాసపునాన
సొంపులునింపుచు నింపుపెంపునీ, నూనమునాదగునాన.

(అనివ్రాయుచు) ఓగీతికా! నిన్నుజనులుచదివి యానందింతురు గాక.

(అనియొక చందనమహీజమును డగ్గఱి).

కీర్తన. చందనభూజము! సౌరభరాజమా
సుందరితేజమా- నందతరాజిలు॥ చం॥
కుందరదన జి.. తేందువదనగుణ
బృందసదనా- మందగమనయో॥ చం॥
సారకుసుమతను- సౌరభములనిను
సారసాంగియను- సరణముసేయును॥ చం॥
సారముపల్కు-కా- సారమునాభి, వి
సారమత్తులు శ్రీ- కారమువీనులు॥ చం॥

ఓగీతమా! మానవులు నిన్నువిని సంతోషింతురుగాక. (అని ముందునకునడచుచు) ఆహా! ఇక్కడనొక కాసారము నేత్రోత్సవము చేయుచున్నది.

ఉ. కాంచితిలోచనోత్సవము, గానవనీతలనాకముఁ సుధా
ప్రాంచితనిర్మలోదకవి, రాజితరమ్య మరందపాకముఁ
గంచరజంతుజాలయుత, కంకణరక్షిత పాంథలోకమ
భ్యంచిత ఘోరకాననను, ఖాకరచారుమహత్తటాకముఁ

దానివలప్రక్కనున్న పర్వతరాజమునుండి వెడలెడునూటనీటి వలన నీకమలాకర మేర్పడియుండును. ఆహా! ఈప్రదేశ మెంతరమణీయ ముగానున్నది. ప్రకృతిసౌందర్యమన్ననిదియేగదా! ఇందవగాహన సుఖం బుఁబడసి ముందునకుఁబోయెద.

(అట్లుచేసి) ఇఁకసాయంకాలము గూడఁబడుచున్నది. ఇంతలో నీసరస్సునందెంతమార్పు పొడఁగట్టుచున్నది.

గీ. ఇంద్రజాలికుఁడొకహస్త ♦ మందునున్న
వస్తువునుమాయరెండవ ♦ హస్తముననుఁ
జూపునట్టులఁగాలమి ♦ చ్చోటఁగమల
శోభనునడంచి కుముదాళి ♦ శోభఁబెంచె.

ఆహా! సూర్యాస్తమయమును జంద్రోదయమును గమలాకర స్థితియుఁజూడ బహుచిత్రముగానున్నది.

చ. ఖరకరుఁడస్తమింపఁదమ ♦ కంబుసఁజల్వలతేఁడుపద్మినీ
తరుణిని రాగవేషుఁడయి ♦ తాఁగలియంజననామెనామనో
హరుఁడిటుచల్లనౌనెయని ♦ యాస్యమువంపఁగఁదెల్లతెల్లనై
కరముచెలింగెఁజందురుఁడు ♦ కైరవిణీసతిసవ్వెఁబక్కునన్.

జారులయొక్కయుఁ, బతివ్రతలయొక్కయు ధర్మములిట్టివియే గదా (కొంచెమునడచి) ఈసరస్సమీపమున మనశ్శాంతి కలిగించెడు కదళీవనమొండుగలదు. ఇదితనయంతటఁ దానుబెఱుగుటచేతఁ బోషితవనములకన్న మిన్నయైశోభిల్లుచున్నది. మఱియు,

గీ ఇచటికదళీకుజంబులూ ♦ హింపనతిథి
పూజసలిపెడుకైవడిఁ ♦ బోవునన్నుఁ
బిలుచుఁగరపత్ర సంజ్ఞచేఁ ♦ బిల్లవాయు
వులనుఁబంపెడునన్నుఁగొం ♦ పోవుకొఱకు.

ఆహా! యేమి యీయతిధిభక్తి? ఒక్కసారి యీవనములోనికిఁబోయి యేదైనయొకవృద్ధవృక్షముపై నొకపద్యమువ్రాసిపోయెదను. (అనియొకచెట్టుకడకేగి).

చ. ఉరుకదళీకుజంబ! సతి ♦ యూరువులన్ దిలకింపనేమియు
క్కఅయిఁకనాకు నిన్నుఁగనఁ ♦ గామదితృప్తినిఁజెందెదసుమ్మి ; యా
తరుణికపోలభాగముల ♦ ధన్యతగిల్లస్రవించునీవలెన్
సరసపయస్సుమజ్జకుమి ♦ చానసరోజిని నీదుబంధువున్.

(ముఖమెత్తి) అదుగో! సారంగుఁడిటకేవచ్చుచున్నాఁడు.

సారం-(ప్రవేశించి) అయ్యా! ప్రభాకరా? మహారాజుగారు మీకొరకై యెదురుచూచుచు నన్నుఁబంపినారు. వేగరండు.

ప్రభా-మంచిది నడువుము. నీకు దేహస్వాస్థ్యము బాగుగనున్నదా?

సారం-మీదయవలన. (అనియిద్దఱు నిష్క్రమించుచున్నారు).



రంగము 2. ఇంకొకయరణ్యభాగము.

(గోవిందుఁడు దమనుఁడు ప్రవేశించుచున్నారు).

గోవిం-దమనా! నిన్నుఁజూచిచాలదినములయినది. ఈమధ్యనుగనఁబడుటలేదేమి?

దమ-గోవిందా? నీవునాకెందుకుకనఁబడుటలేదో నేనునునీకందుకే కనఁబడుటలేదు.

గోవిం-బాగుగఁజెప్పితివే! రెంటికి నేకకారణమెట్లగును.

దమ-కాకున్న నీకారణముఁజెప్పుము.

గోవిం-నాపూర్వయజమాని తనస్వాస్థ్యమునంతయు విక్రయించి వెడలిపోయెనుగదా?

దమ-ఎవరికి విక్రయించెను?

గోవిం-ఈమధ్య మనయరణ్యమునకు నొకసుందరపురుషుఁడును నాతని సోదరియువచ్చి దానినిఁగొని నన్నువారిదగ్గిరనే యుంచుకొన్నారు.

గీ. వారియాదరణంబును ♦ వారిరూప
గుణవిశేషంబులునువారి ♦ గొప్పమనసు
వారిలాలిత్యమునుజూడ ♦ వారురాజ
బంధువులటంచునాకుఁగ ♦ న్పట్టెసఖుఁడ.

దమ-ఓహో ! నీదినము బయలుపడినదే ! ఇఁక నాతోమాటాడవుకాఁబోలు.

కం. చెప్పకపోతివిగదనా
కెప్పుడునీదారహాస్య ♦ వృత్తాంతము నే
నప్పురుషునిఁ దత్సోదరి
నొప్పులకుప్పలనుఁజూచి ♦ యూదునుగాదే.

గోవిం-అవునిది నాయదృష్టమే. కనఁబడ లేదుగనుకఁ జెప్ప లేదు. నీసంగతి యేమియో చెప్పుము.

దమ-మిత్రమా! నాకునునట్టిప్రాపక మేలభించినది. ఈమధ్యమా పట్టణము నుండి మారాజుగారిమిత్రుఁడగు ధృతకీర్తిగారిపుత్రుఁడు ప్రభాకరుఁడనుశూరుఁడిచ్చటకు దయచేసినారు.

గీ. మొదలశత్రుఁడుగావచ్చి ♦ పిదపఁ బ్రాణ
మిత్రుఁడయ్యెనుమాదుభూ ♦ మీధవునకు
మొదలఁగష్టంబుదోఁచినఁ ♦ బిదపనౌష
ధంబు సేవింపసుఖదమై ♦ తనరుకరణి.

గోవిం-నీవాప్రభువును నాకునుజూపింప లేదుగదా, తరువాత.

దమ-మారాజుగారు నన్నాతనిసేవకైకెసియోగించిరి. నాకది జన్మతారకముగాఁదోఁచి యీయరణ్యమునందాతనితోడనే తిరుగుచున్నాను.

గోవిం-అంతగొప్పవాఁడేమి?

దమ-సందియమేమి? కానియాతనికేదియోమనఃక్లేశముగలిగినది. అందువలనఁ గొంచెముత్సాహము తగ్గియున్నాఁడు. అయినను నాతని శౌర్యమును సుగుణసంపత్తియు వెల్లడియగుచునేయున్నవి.

గీ. అగ్నికణములనూఁకలో ♦ నణఁచియున్నఁ
బుష్పములఁదెచ్చి బట్టలో ♦ మూసియున్న
వాని తేజంబుఁబరిమళ ♦ వ్యాప్తిచుట్టు
నున్నవారికిఁదెలియురా ♦ కున్నె చెపుము.

నిన్న నేయొక్క పెద్దపులిని నిముషములోఁజంపినాఁడు. నాకు బహుమానము చేసినాఁడు.

గోవిం-అట్టులయిన నీదినములు నాదినములుకూడ బాగున్నవి. ఇఁకఁ బోదము రమ్ము.

(అని దమనునితో నిష్క్రమించుచున్నాఁడు).



రంగము 3- అరణ్యమునందలి కమలాకరము.

(సరోజిని ప్రవేశించుచున్నది).

సరో- (తనలో) నామనోహర సందర్శనాభిలాషమగు హృదయము తెల్లవారునంతవరకాతని యలీకరూపమును గల్పించుకొని సౌఖ్యపడుదానివలెనుండి నిద్రాసుఖము దొఱఁగుటచే నాకుశరీరకష్టము కలిగించినది. ప్రభాతవాతపోతంబులచేఁ గొంతశరీరతాపమపనయించుకొన నొంటరిగా గట్టుమీద నిటుబయలుదేరివచ్చితిని. మనఃఫలకమంతయుఁ జెదరియుండుటచేఁ గాయమున్నచోటనేయుండి పదచలనమున కిష్టపడకున్నది.

గీ. హృదయమానందమెఱుఁగక ♦ యెపుడు వేగు
చుండఁగాయంబు సౌఖ్యంబు ♦ నొందు టెట్టు
లంతరస్థితచక్రంబు ♦ లాడకున్న
కదలునేసుంత యేఘటి ♦ కారవంబు.

ఇఁక నామనోహరునిఁ జూచుట యెప్పుడో యప్పుడే నాకు హృదయానందమును దానివలన శరీరసుఖమునుగలుగుట. అదియంతయుఁ గామభగవానుని చేతిలోనున్నది. ఓయిక్షుధన్వా? నీకు మ్రొక్కెదను.

తే. నామనోధనహరణచ ♦ ణప్రచారు
గుఱుతుపట్టినసాక్షివి ♦ పురుషవరుఁడ
వగుటనాహత్తఁబట్టినా ♦ కప్పగింప
వలదెయబలలఁబ్రోవభ ♦ వ్యంబుగాదె?.

(మొగమెత్తి) అదిగో సూర్యోదయమగుచున్నది. నావలెనే రాత్రియంతయు వియోగతాపముచే దురటిల్లిన యీకమలాకరమందలి సరోజిని తనప్రాణనాథునిఁజూచి ముఖవికాస మొందుచున్నది.

చ. తనపతిశత్రుసంహరణ ♦ తావిభవంబుననుంటఁజూచి యా
వెనుకసమక్షభాషణను ♦ వీక్షణసౌఖ్య మొసంగకున్కిలోఁ
గనలెడునీసరోజినికిఁ ♦ గన్నులవిందొనరింపవచ్చెనో
యనఁగఁ బ్రభాకరుండు పొలు ♦ పారెడుఁ బ్రాగ్పృథివీధరంబుపై.

ఓకమలాకరసరోజినీ? ఇప్పుడునీముఖమెంత వికాసముగానున్నది. నాకెప్పుడయిన నిట్టిశుభము ప్రాపించునా? నిన్నుఁజూడఁగా నొకవేళఁ బ్రాపించునని యేతోఁచుచున్నది. ఏమియన మనమిరువురమేకనామధారిణులమయి యింతకుముందువరకు సమావస్థలోనుంటిమి. అందుచే సోదరీప్రాయలముగదా. ఇంతలో శుభకాలము రాఁగా నీకష్టముగట్టెక్కినది. ఇఁక నేనే మిగిలితిని. అయినను.

గీ. అదివరకు దుఃఖమగ్నవై ♦ యలయునిన్ను
నేనుగనఁగానె శుభమొందు ♦ నీకుఁగలిగె
శుభశకునమయ్యె నాకట్టి ♦ శుభముగూడఁ
గలుగుగాఁబోలు నత్యల్ప ♦ కాలముననె.

నన్ను మఱువకుము. పోయివచ్చెద. (అని కదళీవనముఁజేరి యందొక చెట్టుపైనున్న "చం॥ ఉరుకదళీ ... ... బంధువున్" అను పూర్వోక్తపద్యమునుజూచి చదువుచున్నది) ఆహా! ఇది యేమి చిత్రము? మన్మథమాయగాఁబోలు? దీనినిఁబఠింపఁగా నాకుఁ బ్రాణము లేచివచ్చినది. శకునఫలము వెంటనే తలసూపుచున్నదే? ఇందు నా నామముగూడ లిఖితమయ్యెనే? పరమాశ్చర్యము.

గీ. బీదకు హఠాత్తుగానబ్బు ♦ పెన్నిధిబలె
వాడుపైరునఁ గురిసెడు ♦ వానఁబోలె
శోకహతనౌచుఁ గ్రుమ్మఱు ♦ నాకునమిత
హర్షమొడగూర్చె మధురప ♦ ద్యంబుఘనితి.

ఆహా! దీని నెవ్వరు వ్రాసియుందురు. పురుష వేషము నుధరించి కృశించియున్న నన్నును నాపేరును నిందెవ్వ రెఱుంగుదురు. నేను దేశమునుండి బహిష్కరింపఁబడితిననివిని యొకవేళ నాప్రభాకరుఁడిఁటకు వచ్చెనుగాఁబోలు. లేకున్న నీమహారణ్యమునం దీకదళీవృక్షముపై నింత సొగసుగా నాపేరుఁగూర్చి యీపద్య మెవ్వరు వ్రాయుదురు? మందభాగ్యనైన నాకంత యదృష్టముపట్టునా? అయిన నీకదళీవృక్షమునే యడిగి తెలిసికొందునుగాక.

ఉ. ఓకదళీకుజంబ! విన ♦ వే! యిటు స్వరశ్మిసుఖంబొసంగి శో
భాకరమూర్తిఁ గానినుమ ♦ హాత్మకుఁడెవ్వఁడొనర్చె? రంభయున్
బ్రాకటనామముఁ గొనిన ♦ భాగ్యముచేతలభించెనో క్కా! వే
నాకది తెల్పి శోకము న ♦ ణంపుము నింపుము కూర్మి నాపయిన్.

(మరలఁ బద్యముఁ జదువుకొని నవ్వుకొనుచు)

గీ. చుట్టమును జేసె నాకునిన్ ♦ సొగసుకాఁడు
ఔను నాపన్న బంధువు ♦ వైతి కాదె?
మఱువకుమి నన్ను నిన్ను నే ♦ మఱువ నింకఁ
దెలియఁబలుకుము చుట్టమా! ♦ కల తెఱంగు.

నాప్రభాకరుఁ డిందువచ్చెనా? అదియొక్కటిమాత్రము చెప్పుము. (కదలుచున్న రంభాపత్రమును జూచి) అదిగో! వచ్చెననికాఁబోలుఁ గర పత్రముతో సూచించుచున్నది. (అని ముఖమెత్తి) అదిగో వాడుక ప్రకారము నాసోదరి కమలిని కాల్యకృత్యంబులకుఁగాఁబోలుఁ గమలాకరంబునకు వచ్చుచున్నది. నేనుముందిటువచ్చినందులకునిందించునేమో

(అంతఁ గమలిని "చ॥ సరసకటాక్ష ... ... ... వేడెదఁ జాబిలీ"
అను పూర్వోక్తపద్యమును చదువుచుఁ బ్రవేశించుచున్నది]

కమ—సోదరీ? ఈపద్యమునువింటివా?

సరో—అక్కా! ఏదీ! చక్కఁగా విప్పి మరలఁ జదువుము.

కమ—అట్టులనే (అని మరలఁజదువుచున్నది)

సరో—అక్కా! నీవెంత దానవైతివి? కవిత్వ మెప్పుడు నేర్చుకొంటివే? ఆహా? నీపద్యము ముద్దులు మూటగట్టుచున్నది. మరల వినవలయునని యేయున్నది.

కమ—నీవెఱుఁగకయే నేనెప్పుడు కవిత్వము నేర్చుకొంటిననుకొంటివి- రాత్రి సరస్వతీదేవి ప్రత్యక్షమయ్యెననుకొంటివా? లేక ప్రభాకరోదయమున ముఖవికాసముగలిగి యాశుధార పుట్టెననుకొంటివా?

సరో—అక్కా! ప్రభాకరోదయ మేమి? ముఖవికాస మేమి?

కమ—మఱేమియు లేదు- వఱువాత ముఖప్రక్షాళనముచేఁ గలిగెడు వికాసము.

సరో—కాదు- నీవుచదివిన పద్యమునుబట్టియు నీవుప్రయోగించిన శబ్దములంబట్టియు నాయర్థము సరిపోదు-

కమ--(నవ్వుచు) అంతకన్న నాకేమియుఁదెలియదు- నీకు సర్వము ప్రభాకరమయముగానుండుటచే వేఱొకయర్థము స్ఫురించినది కాఁబోలు- అవునుగాని యీదినమున నాతోఁజెప్పకయే ముందు లేచివచ్చితి వేమి?

సరో-- అక్కా! క్షమింపుము- ఏమియుఁదోచక యిటువచ్చితిని- దయచేసి నీవుచదివిన పద్యమెక్కడిదియో చెప్పవే? నన్నుఁ బీడింపకుము-

కమ-- అన్నినాళ్ళనుండి ప్రభాకరుఁడుపీడింపఁగా నేనొక్కగడియ పీడింపఁగూడదా?

సరో-- ఇఁకఁజాలదా! ఇది వ్రాసినది నరమాత్రుఁడేనా? ఇందు నా రహస్యవృత్తాంతమెల్ల నున్నదే-

గీ. పూసగ్రుచ్చినగతిని యపూర్వపద్య
కము వచించెడు నాపూర్వకథను దీని
నరుఁడెటురచించునా ప్రభాకరుఁడుదక్క
నాప్రభాకరుఁడెటువచ్చు నమ్మయుంటకు.

కమ—సోదరీ? ఆప్రభాకరుఁడేఁటకు రానేలేఁడా? అదుగో చూడుము-

సరో—(తత్తరపడుచు) ఏడీ! యేఁడీ-

కమ—(నవ్వుచు) ఏఁడా! అదుగో. తూర్పుదిక్కునందు

సరో—అక్కా! నన్నింకను బీడించెదవా?

గీ. పుట్టెదను నీదుకడుపున ♦ ముందుభవము
నందు దయబూని నీమనం ♦ బందునున్న
సర్వమువచించినాకు హా ♦ ర్దంబుఁగూర్ప
వమ్మ! పీడింపకమ్మ నా ♦ యమ్మయింక॥

కమ—(తనలో) ఇంకను గొంచెము సేపాడించెదను. (ప్రకాశముగా)
దీని నొక కవి వ్రాసినాఁడు-

సరో—తిరిగి మొదలుపెట్టితివా! పోనీ! ఏకవి వ్రాసినాఁడు

కమ- నారాయణప్రసాదలబ్ధకవితామహనీయుఁడైనకవి

సరో—ఏనారాయణుఁడే?

కమ— సూర్యనారాయణుఁడు

సరో—అన్నా! త్రిప్పిత్రిప్పికొట్టుచుంటివే? ఆసూర్యనారాయణుఁడెవఁడే?

కమ— ఆహారమొసఁగుటచే స్తుతిపాత్రుఁడైన సూర్యభగవానుఁడు-

సరో—(నవ్వుచు) ఏహారమే?

కమ— హారముకాదు. ఆహారము. సూర్యనారాయణుఁడు లోకముల
కాహారమునిచ్చు వరమఁడేగదా?

సరో— అబ్బా! నామనోవికారముకన్న నీశబ్దార్థబాధ యెక్కువై
యయ్యెనే?

కమ— పోనీ. సోదరీ? ఈపద్యమువినెదవా?

సరో— చదివినదిచాలులే.

కమ— కాదుకాదు. ఇదియొక్కటివినుము. అని "మత్తకోకిల॥ గున్న
మామిడి ... ... ... తలంపఁగన్" అను పూర్వోక్తపద్యము
ను జదువుచున్నది

సరో-- (సంతోషముతో) అక్కా! ఇదియెక్కడిదే.

కమ-- ఇదియునక్కడదే. ఆకవి వ్రాసినదే.

సరో-- నీకెక్కడదొరకినదే? చప్పునఁజెప్పవే.

కమ-- వ్రాసినచోట.

సరో-- ఇఁక నేమాటాడను. నీయిష్టమువచ్చినట్లు పీడింపుము.

కమ-- (తనలో) మా చెల్లెలకుఁ గోపమువచ్చుచున్నది. ఇఁక నీమెను సంతోషపెట్టెదను (ప్రకాశముగా) సరోజినీ! నేనడుగు రెండు ప్రశ్నలకు బదులుపలుకుము. పిదప నంతయు వ్రాక్రుచ్చెదను.

సరో-- అబ్బా! నాకు వికారముగానున్నది. ఊరుకొననిమ్ము.

కమ-- ఇదిగో! నీవీదినమున నేదేవునికైన మ్రొక్కితివా?

సరో-- (ఆశ్చర్యముతోఁ దనలో) ఈమెకెట్లు తెలిసినదో(ప్రకాశముగా) మ్రొక్కితిని. కామభగవానునకు.

కమ-- మంచిపనిచేసితివి. నీకేమైన నీదినమున శుభశకునములైనవా?

సరో--(సవిస్మయముగా) అయినవి. అయిననేమి?

కమ-- సాఫల్యమైనది.

సరో-- (ఆతురతతో) ఏమిటి?

కమ-- నీమనోరథము.

సరో-- (ఉత్సాహముతో) ఎట్లు.

కమ-- నీమనోహరుఁడు ప్రభాకరుఁడే తెంచుటవలన.

సరో-- (కమలినిఁగౌగలించుకొని) నిజముగావచ్చినాఁడా? ప్రభాకరుఁడే నా? నీవు చూచినావా?

కమ-- చూచినట్టే జ్ఞాపకము.

సరో-- ఎప్పుడు?

కమ-- ఇంతకుముందే.

సరో-- నీ వెక్కడఁజూచితివి? అతఁడప్పుడేమి చేయుచుండెను? నీతో నేమ నెను? అతఁడేలాగుననున్నాఁడు? ఇంటకాతఁడేలవచ్చినాఁడు?

నాక్షేమమడిగెనా? తిరిగి యాతని నెప్పుడుచూచెదవు? అతఁ డెక్కడకుఁ బోవుచుండెను?

కమ-- నీప్రశ్నలకుత్తరమిచ్చుటకు నేనిఁకఁ జదువుకొనవలెను. యెన్ని ప్రశ్నలు వేసితివే?

సరో-- (ఉత్కంఠతో) పోనీగాని,

గీ. ఎఱుగునే నామనోహారుం♦డీయరణ్య
మందునేనుంట; శోకంబు♦నొందుచుంట

కమ-- ఎఱుఁగకెట్టులు నీమనో♦హరుఁడువచ్చె
నమ్మ నీకింతభయమేటి♦కమ్మకొమ్మ!

ఆతఁడెక్కడ నెట్టులుండెనంటివేని,

ఉ. ఇమ్ముగఁ గమ్మదెమ్మెరల♦నింపలరారువనాంతరమ్మునం
దమ్మహనీయుఁడాసరసుఁ♦డాప్రియుఁడొక్క రసాలవృక్ష పా
ర్శ్వమ్మునఁ బ్రాలి లేఁబయిగు♦పాన్పునహాయిగనుండి కర్ణప
ర్వమ్మగు కూజితమ్ముల న♦పారముగా వినుచుండెనెచ్చెలీ॥

సరో-- ఆహా? కామభగవానుని బాణమునకు నెఱిగియున్నాఁడుకాఁబోలు.

కమ-- కాఁబోలును. యుద్ధమునందు విముఖుఁడైవచ్చిన శూరునివలెనే పడియున్నాఁడు.

సరో-- ఎంతమాటాడితివే? ఒకవేళ మన్మథునితో యుద్ధముచేసియలసియుండును. తరువాత

కమ-- ఇఁకనేమియున్నది. (ఆలోచించి) ఆన్నా! మరచితిని. ఉన్నది. ఆపిదప,

చ. మఱిమఱిఁజిత్రసృష్టిమహి♦మంబులకక్షులుపల్లవింప నా
దరమునఁబూర్ణసౌఖ్యములఁ♦దాఁగనిదేహమునంతసింపఁ జి
త్తరువుబలెన్ నిజాకృతి ని♦దానముగాఁబడియుండనాప్రభా
కరుఁడు 'సరోజినీ' యనుచు♦గట్టిగఁబిల్చుచునుండెనెచ్చెలీ॥

సరో--(మూర్ఛిల్లి కొంతవడికి లేచి తనలో) అన్నా! ఆమహానుభావుఁడు నాకై యెంతతపించుచున్నాఁడో! అనుదినమునలె నాయక్కతోనుండిన నాతఁడీపాటికి నాకంటఁబడియుండునుగదా (ప్రకాశముగా) అక్కా! నేనాతని గష్టపెట్టుటవలన మహాపాతకిని.

కమ-- ఆతఁడు నిన్నుఁగష్టపెట్టుటలేదా?

సరో-- బాగున్నది. అప్పుడు నీవేమంటివి?

కమ-- ఒక్క చిత్రముచేసితిని. ఏమన, సమీపముననుండెడు పొన్న చెట్టుచాటునడాగి "సరోజిని కమలాకరమందు" అని యంటిని. అక్కడనున్నపుడే పొన్నచెట్టుపై వ్రాయఁబడి మొదట నీకు నేను జదివియుండిన పద్యమును నల్లించితిని.

సరో-- అక్కవైనందుకు నాకు గొప్పయుపకారము చేసితివి. తరువాత

కమ-- తరువాత నాతఁడాపొన్నచెట్టువైపునకు గిరుక్కున బాణమువలె వచ్చుటఁజూచి నేను బొదలలోదూరి యాతఁడు వెనుకఁ బండికొనియున్న రసాలవృక్షమునకుఁ దటాలునఁ బారితిని.

సరో-- (నవ్వుచు) అక్కా! ఎంతయుక్తినెఱపితివమ్మా! తరువాత

కమ-- తరువాత నారసాలవృక్షముమీఁద వ్రాయఁబడియున్న రెండవ పద్యమునుజూచి యబ్బురపడి దానిని లెస్సగాఁ బఠించితిని. నీ మీఁది రెండుపద్యములను నీకప్పగించితినిగదా- ఆతఁ డిటులనే వచ్చుచుండును.

సరో--(ఆనందముతో) పద్యములనేకాదు. నామనోహరునిఁగూడ నప్పగించితివి. చూచితివా యీకదళీవృక్షముమీఁది పద్యము. ఇది యెంతసొగసుగానున్నది. (అనిచూపించుచున్నది)

కమ-- (సంతోషముతో) బహుసరసముగానున్నది. (తలనెత్తి) యడుగో! ప్రభాకరుఁ డిటువచ్చుచున్నాఁడు.

సరో-- (చూచి) ఆహా! ఏమినాభాగ్యము.

[అంతఁ బ్రభాకరుఁడు దమనునితోఁ బ్రవేశించుచున్నాఁడు]

ప్రభా--(తనలో) అన్నా! తిరిగికమలాకరముకడకువచ్చితిని. ఫలమేమి? సరోజినియెక్కడ? నేనురసాలవృక్షమునీడఁ బండుకొనియున్నపు డేదియో యొక యదృశ్యవాక్కు "సరోజిని కమలాకరమందు" అని చెప్పుటచే నాసగొని యిటుచేరితి. ఈ కమలాకరమందలి సరోజినితప్ప మానవసరోజిని నాకుఁగనఁబడదు.

గీ. ఈసరోజిని గాన్పింప ♦ నెంత యేని
నరుస మొప్పారు నా ప్రభా ♦ కరునికరయఁ
గానినాకెట్లు సంతోష ♦ కరము తాప-
కరము గాకున్నఁజాలు నీ ♦ కంతుశర్మము.

(ప్రకాశముగా) దమనా? నేనుదీయమావికడఁ బరుండినపుడునిన్నుఁ బుష్పములఁ దెమ్మంటిని. తెచ్చితివా?

దమ-- స్వామీ! తెచ్చితిని. ఇవిగో (అని యందించుచు) అయ్యా! వీని తో నిచ్చట నేమి సేయుదురు?

ప్రభా--ఓరీ! ఈకమలాకరమునఁ దానమాడి సూర్యనమస్కారము లొ నర్చి యాభగవానునిఁ బూజింపవలెను.

దమ-- నిన్నను నట్టులనే చేసితిరి ఎందులకయ్యా?

ప్రభా--ఓరీ! మాతల్లిదండ్రులకు నేను సూర్యనారాయణ వరప్రసాద మున జన్మించితిని. అందుచేతనే నాకుఁ బ్రభాకరుఁడని నామక రణముచేసిరి. తరువాత నాతండ్రిగారు నన్నుఁ బ్రతిదినమును సూర్యోపాసన సేయుమనియు దానివలన శౌర్యవృద్ధియు మనో రథసిద్ధియుఁ జేకూఱునసియు నాజ్ఞాపించిరి. అందుచే వీలున్నంత వరకీ యుపాసనాకృత్యమును జేయుచుందును.

దమ—దేవా! మీశౌర్యవృద్ధి నేను జూచితిఁగాని మనోరథసిద్ధియయ్యో నా యని యడుగవెఱచుచున్నాను.

ప్రభా—అయినచోనింకేమి? కాఁగలదు,

సరో—(చాటుననుండి) నిశ్చయము.

కమ—(జనాంతికముగా) ఈసారి సూర్యనమస్కారములతోఁ బ్రత్యక్ష ప్రమాణమగుఫలముకలుగును.

దమ—అయ్యా! మీమనోరథమేమి? విన్నఁజెట్టులనిండను నేమియో వ్రాసితిరే? ఎవరినిగుఱించి?

సరో—దమనుఁడు చక్కనిప్రశ్న వేసినాఁడు.

ప్రభా—సరోజినీమంత్రదేవతనుగూర్చి. ఆమెనుబొందుటయే నామనోరథము.

సరో—(తనలో) డెందమా! శాంతింపుము. నీమనోరథమీడేరఁగలదు?

దమ—ఆమె యెక్కడనున్నది?

ప్రభా—అదియే తెలియకున్నది. అందులకే యీతపము. (అని స్నానమాడి యొంటికాలిపైసూర్యనమస్కారములు చేయుచున్నాఁడు)

సరో—(తనలో) గీ. నన్నుఁదనుఁగోరుదానిఁ బొం♦దంగఁబూని
యెండలో నొంటికాలిపై♦ నిట్లునిలిచి
పద్మబాంధవుఁగూర్చి త♦పంబుసలుపు
నౌర! నేనేడ! యీతపో♦ భారమేడ!

గీ. మంత్రదేవతగాఁ జేసె♦ మారుఁడకట
నన్ను సేవకురాలి నా♦పన్నహృదయ
మాంత్రికుఁడు రోగికిని మంత్ర♦మహిమఁజూపఁ
ద్రుణముఁగొనుగాదె మంత్రసా♦ధనముగాఁగ.

ప్రభా—(ఉపాసనముగించి) ఈదినమున నాయందుభగవానుఁడు వికాసముఖుఁడై యున్నాఁడు. నామనోరథమేమగునో? దమనా! ఇఁక నీవు పోవచ్చును. నేనును గొంచెముతాళివచ్చెదను.

దమ—చిత్తము. (అనిపోవుచున్నాఁడు)

[అంత సరోజినీకమలిను లెదుటఁబడుచున్నారు].

సరో—(తనలో) ఈమనోహరునితో సంభాషణనుధారసము చవిచూచుటకై చాలకాలమునుండి నామన మఱ్ఱూట లూరుచున్నది.

పురుష వేషముతో నుండుటచే సిగ్గుబోఁ ద్రోచిమాటాడవలెను. (ప్రకాశముగా) మిత్రమా? నీ వెవ్వరవు? నిన్నుఁజూడఁగా నాకు సంతోషమును దుఃఖమునుగూడఁగలుగుచున్నవి.

గీ. ప్రసవసుకుమారమగు శరీ ♦ రమునునిట్టు
లెండలోగాసి బెట్టంగ ♦ నేలనీకు?
దివ్యతారుణ్యలావణ్య ♦ దేహ మేడ?
భానుకరతప్తఘోరత ♦ పంబదేడ?

ప్రభా— (చూచితనలో) ఈసుందరపురుషుఁడెవ్వఁడో యీ మహారణ్యమందొక స్త్రీరత్నముతో నాకుఁ గనువిందు సేయుచున్నాఁడు. ఆహా! ఏమి యీతనిసౌకుమార్యము. ఈతఁడు నాకుమిత్రుఁడు గానోపు. (ప్రకాశముగా) నానియమమట్టిది. నానివాసము రాధికాపురము. కారణాంతరమున నీయరణ్యభాగమునకు వచ్చితిని. అయ్యా! మీరిరువురెవరు?

సరో— మేమీయరణ్యమందునివసించువారమే. (కమలినినిఁజూపి) ఆమె నాసహోదరి. ఇక్కడ గొఱ్ఱెలతో మేకలతోఁ గాలక్షేపము సేయుచున్నారము. అవునుగాని మీనియమమేవిషయమై?

ప్రభా—మిత్రుఁడవై నసీతో దాఁచనేటికి?

క. స్మరమోహబంధనంబుల
నిరతమునేఁగట్టువడుచు ♦ నీరసపడితిన్
మరుబారిగొఱ్ఱెనైతిని
దరమే నాకింకవానిఁ ♦ దప్పించుకొనన్.

సరో —అక్కటా! నిన్నుఁజూచినాకు జాలివొడముచున్నది. గొఱ్ఱెలను నాదరించుపని మాకు బాగుగఁదెలియునుగాని నీవేస్త్రీమోహమునఁ జిక్కుపడితివి?

ప్రభా—మిత్రమా! నీప్రశ్నలు నాయాయువుఁబట్లు అంపములవలెఁ గోయుచున్నవి. అయిన నడిగినదాని కుత్తరము చెప్పవలెనుగదా.

గీ. మాపురంబేలియుండె ప ♦ న్నాన్వయవరుఁడు
కీర్తివర్మనృపుండు త ♦ త్కీర్తికళయ
నంగఁజెలఁగు సరోజినీ ♦ నామధేయ
సుగుణగణగేయ, యామెకై ♦ చొక్కినాఁడ.

సరో—అట్టులనా? గొప్పకోరిక యేనీకుఁగలిగినది. ఆమెనిన్ను వలచెనా?

ప్రభా—మిత్రమా! ఎంతమాటాడితివి!

చ. సరసఫలంబొసంగునె వి ♦ చారమెగానిప్రయత్నముల్ పర
స్పరమనురాగహీనమగు ♦ పట్టునఁజంద్రునియాస పద్మినీ
తరుణిపయిన్ రహించునె వె ♦ తల్ బెఱయించుటెకాక; నామనో
హరయును నన్నుఁగోరి యుప ♦ హారము హారముబంపె దీనినిన్.

(అని కంఠహారముఁ జూపుచున్నాఁడు)

సరో—ఏదీ యిటుచూపుము (అని స్పృశించి తనలో)

క. హారమ! నేటికినీయా
కారముగాంచితిని మరలఁ ♦ గనుపండువుగాఁ
జేరితివినన్ను వనమున
సారధ్యమునడపిమోహ ♦ సంబంధమునన్.

(ప్రకాశముగా) అట్లైన నిశ్చయమే. మఱియు నీవువరించిన సరోజిని యంతసౌందర్యవతియా? యప్సరసయా?

ప్రభా—మిత్రుఁడా! నాకన్నులకామె యప్సరసలను మించియుండెను. ఆమెను ధాత ప్రత్యేకముగా సృష్టించినట్లు తోచుచున్నది. ఏమందువేని,

చ. చిలుకయు దాడిమీఫలము ♦ సింహము నాగము చంద్రుఁడుం దమం
బ్రభియుఁ జంపకంబు గ్రబింబ ♦ మూరఁగ సఖ్యతనుంచఁగోరి యా
చెలువకుఁ బల్కు పల్కుదురు ♦ చిన్నికటిస్థలి యూరుసీమలుం
లలితముఖంబు వేనలి వి ♦ లాసపుదృక్కులు నాపత్రాఁగనా
నలువయొనర్చి చాలఁ సుమ ♦ నఃప్రియవృత్తిఘటించె నేర్పునన్.

సరో.-- (తన్నుఁజూచుకొనుచు) ఆమె యంతచక్కనిదా?

ప్రభా.--ఏలకాదు.

గీ. చాన శృంగారరసమను ♦ సరసులోన
మొలిచి వికసించుతామర ♦ పువ్వుగాన
నామెకు సరోజినీసార్థ ♦ నామకరణ
మునుఘటించిరి జనకులు ♦ జననమందె.

సరో.-- మిత్రమా! నీవెఱ్ఱిగాని యామె నిజముగా శృంగారరసకమలాకరమందలి సరోజమగునా?

ప్రభా.-నెయ్యమా! అట్లులనకుము. ఆమెకటాక్షబాణములిప్పటికినాపైఁ బ్రసరింపుచున్నవి. హాసరోజినీ!

గీ. రాజసభలోన నేను దు ♦ ర్వారశౌర్య
బాహుబలమునమల్లునిఁ ♦ బట్టిచంపు
చున్న వేళనునుత్సాహ ♦ మొసగఁబఱపి
నట్టి నీచూడ్కులను మఱ్వ ♦ నగునెనాకు?

సరో.-- నీవు మల్లునిఁజంపితివా? ఆమె నిన్నపుడుచూచెనా? అదినీకుత్సాహమయ్యెనా? ఆమెచూడకున్న నీవు చంపవుకాఁబోలు.

ప్రభా.--ఆహామిత్రమా? ఏమినీప్రశ్నలు? నీవు వనవాసుఁడనని చెప్పెదవే? నీమాటలువిన నతిరసవంతములై నాగరికులమాటలఁగూడ మించుచున్నవే.

సరో.-- (తనలో) ఈతఁడు గట్టివాఁడు (ప్రకాశముగా) దానికిఁగారణముకలదు. నాపినతండ్రియొకఁడిక్కడనుండిపోయి చాలకాలము పట్టణమందుండి నాగరికతాగుణంబులలవడఁదిరిగి యిచ్చటకువచ్చి నపిమ్మట నాకీమాటలచదువునేర్పినాఁడు.

ప్రభా.--అట్లులనా? హాసరోజినీ? నీవు నాకెన్నటికిని మఱపురావుగదా?

చ. కురగవిలోలనేత్రములు ♦ కోమలనవ్యమృణాళబాహువుల్
నురుచిరచంద్రవక్త్రమును ♦ సొంపలరారెడుకుందదంతముల్

సరసిజహస్తముల్ దనరఁ ♦ జక్కనిమారునిమెచ్చుపిట్టయై
తిరిగెడునాసరోజిని ను ♦ దీర్ణదయానిధి నెట్లుమర్చెదన్.

సరో— (తనలో) ఈతఁడు నన్నెంతచక్కఁగావర్ణించుచున్నాఁడు. (ప్రకాశముగా) అవునుగాని యీకమలాకరముదగ్గఱనున్న కదళీవృక్షముపై సరోజినిఁగూర్చి పద్యమువ్రాసినదినీవేనా?

ప్రభా—మిత్రమా!

గీ. రంభతరువునఁబద్యంబు ♦ వ్రాసినట్టి
మందభాగ్యుఁడనేనె య ♦ మందమోహ
శరవశతచేతనట్టులు ♦ వ్రాసినాఁడ
నాసరోజినిమీఁదఁ బే ♦ రాసచేత..

సరో—ఒకవేళ నీసరోజిని చూచియుండినను సంతోషింపఁజేయఁగల పద్యమే.

ప్రభా—సంతోషమో! దుఃఖమో! ఏదైననేమి?

కమ—మిత్రమా! రసాలవృక్షముమీఁదను బొన్నచెట్టుమీఁదను వ్రాసినదియెవరు?

ప్రభా—వానినిరచించివ్రాసిన దురదృష్టవంతుఁడనుగూడనేనే. మీరు చూడలేదేమో? వానిసమీపముననే చంపకచందనవృక్షములమీఁదను బద్యములు లిఖించియుంటిని. అవియన్నియు మీరాబోంట్లుచూచి యానందించుటకేగాని నాసరోజిని యిఁటకువచ్చి చదువుకొనుటకువ్రాయఁబడినవికావు.

సరో—ఒకవేళ సరోజిని యిఁటకువచ్చియుండిన,

ప్రభా—అంతభాగ్యమా! నావంటివానికేనా?

సరో—నీకొఱఁతలేదక్కడేమి?

క. శూరుఁడవు కవివి రుచిరా
కారుఁడవు కులీనుఁడవు వి ♦ కాసవిలాసో

దారుండవు ధీరుండవు
నేరీనీపాటివార ♦ లింతివరింపన్.

ప్రభా—అవునుగాంబోలు. నాకుం దెలియదు.

సరో—ఆమె నీవు నిరసించితివని యనుకొన్న దేమో?

ప్రభా—మిత్రమా! లేదు. నేనా నిరసించువాండను.

సరో—నీవు నిరసింపలేదని నాచేతిలోం జేయివేయుము.

ప్రభా—ఒకసారికాదు. లక్షసార్లు వేసెదను.

సరో—నీమోహముజూడ నమితముగానున్నది. నీకు మతిభ్రమకలుగునేమోయని నాకు భయమువేయుచున్నది. కాన నేనొక్కయుపాయమునుజెప్పెదను విందువా?

ప్రభా—మిత్రమా! విన కేమి?

సరో—నీకుం బ్రపంచమంతయు సరోజినీమయముగానున్నదిగనుక నన్ను సరోజినిగాభావించి యాపేరుననే పిలుచుచుండుము. నీమోహము క్రమక్రమముగా డింపెదను.

ప్రభా—నేను నిన్నుంబిల్చుటకు నాకభ్యంతరములేదుగాని నామోహము డింపుట నీతరముగాదు.

సరో—నీవిట్లుచేయుము. నీమోహముతగ్గును.

గీ. అహరహము నాదు బీదగృ ♦ హంబునకును
రావలయునీవు నీవుండు ♦ తావుగూడ
నాకుంజూపింపవలయును ♦ ననుసరోజి
నీ యనుచుంబిల్వవలయు మ ♦ న్నించి ప్రేమ.

ప్రభా—మిత్రమా! అట్లనే- మీయిల్లుచూపింపుము. దారిలోనా నివాసమును నీకునుజూపెదను.

సరో—నీపేరెవరంటివి- మరచిపోయితిని.

ప్రభా—ప్రభాకరుండు.

సరో—సోదరీ! రమ్ము. ప్రభాకరా! రమ్ము.

కమ—గీ. కామభగవానుఁడా! నీకుఁ గనులవిందు
గల్గనే నేటికిని ప్రభా కరసరోజి
నులు వనంబున మోహానం కలనవృత్తి
కలిసి పోవంగఁజూచు భా గ్యంబువలన॥

(అని ముగ్గురు నిష్క్రమించుచున్నారు)



రంగము 4- ఇంకొకయరణ్యభాగము-

[ఆనందుఁడు సానందయుఁ బ్రవేశించుచున్నారు]

ఆనం—సానందా! నన్నెన్నాళ్ళిట్లుపీడించెదవు? నేను జక్కనివాఁడను గానా? నీకంటికి బాగుండనియెడల బాగుండలేదని చెప్పవుగాని నిష్కారణముగా నన్ను నిరసింపకుము. నీకుజాలిలేదే?

గీ॥ వధ్యశిలమీద వధ్యుఁడౌ వానిఁగూడ
శాంతమిడియింపఁబ్రార్థించి యవలఁజంపు
నంతకంతెను నేనేమి యఘముఁజేసి
నాఁడ నాపయి విషవీక్ష ణంబదేడ॥

సానం.ఉ. చూపులలోవిషంబుఁగల జోటినినన్వరియింపనేల? నా
చూపులు మృత్యుగర్భములె సుందరుఁడా? యెటకేనిబోయినీ
తాపమడంచుసుందరిని దక్షణమే వెదుకంగ సుఖంబగుఁగా
గోపముదెచ్చినాఁడవిటు కూడనిమాటలనాడి తీవ్రతన్॥

ఏదీ నావిషవీక్షణమువలన నీకుఁగలిగినగాయము.

గీ. చాలుఁజాలురె! నీస్నేహసరణిచాలు
వలదువలదన్న నాదు ప ల్కులనువినవు
యంతకునుదగుబొంత యే దైనదొరకు
విడిచినన్నిఁట సుందరి వెదుకఁబొమ్ము.

ఆనం—మన్మథబాణములగు నీకటాక్షములు నాకుఁజేయుబాధ నీకెట్లు తెలియును? ఇన్నాళ్ళాశ్రయించుకొన్న నన్నుఁ బొమ్మనెదవా? నీకుజాలిలేదా?

సానం—(నవ్వుచు) నీపైనాకు జాలిగలదు.

ఆనం—(దైన్యముతో) అట్టులైన నన్నుఁ బ్రేమించెదవా?

సానం—అట్టులనే ప్రేమించెదనుగాని నిన్ను మోహింపను.

ఆనం—అయ్యో! దైవమా? చిన్ననాటనుండియు నీమీదనే పంచప్రాణములునిలిపి నిన్నే యాధారముగాఁజూచుకొనుచుంటిని. అట్టి నన్నుఁద్రోసిరాజందువా?

సానం—ఓయీ! మొదట నీవన నాకుఁజాల నసహ్యముగా నుండెను. ఈమధ్యనుగొంచెము నీవు సరసముగామాటలాడ నేర్చుకొంటివి గనుక నీమీదనాకిప్పుడు ప్రేమకలుగుచున్నది. మోహముగలుగుటకింకను నెంతకాలముపట్టునో? చివరకుఁగలుగునో లేదో?

ఆనం—శివశివా? ఎంతపాపము ఇదివరకే యీ విరహసముద్రమీద లేక కొట్టుకొనుచుంటిని.

గీ. కలికి! నీకోపమే తరం ♦ గంబు; నిరస
నంబె మకరంబు నవ్వెర ♦ త్నంబుగాఁగ
నెంచి విరహాబ్ధిమున్గుచు ♦ నీదులాడు
చుంటి నీకూర్మి తెప్పన ♦ నొ్సందనిమ్ము.

సానం—కొంచెముతాళుము. అవునుగాని మనగోపాలునిస్వాస్థ్యమున్నంతయుఁగొన్న పిన్నవానినిఁజూచితివా?

ఆనం—(తనలో) పులిమీఁదఁబుట్టవలె నాకితఁడొకఁడు తటస్థించినాఁడే? అయ్యో! నాకు సౌఖ్యదినములు గడుదూరమగుచున్నవే. (ప్రకాశముగా) చూచితిని. నాకంటె నీకంటికాతఁడెక్కువబాగుగానున్నాఁడా?

సానం—(నవ్వుచు) నీకాసంగతియిప్పుడేల? నేనతనిసిఁజూచి మోహించితినను కొంటివా యేమి? ఆతఁడు దర్శనీయుఁడుగానున్నాఁడని చె

ప్పొచున్నాను. మఱేమియువిశేషము లేదు. ఇఁకఁబోవుదమురమ్ము.

(అని యానందునితోనిష్క్రమించుచున్నది)

ఇది శ్రీమద్రమూరమణీరమణచరణారవిందనిరంతరానూనధ్యాన
పారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానురాగనూర
మాంబా వేంకటామాత్యపూర్వతపఃఫలరూపశౌనక
సగోత్రప్రదీప తురగాన్వయాంభోధిసుధానిధాన
వేంకటాచలాభిధానప్రణీతంబగు సరో
జినీనాటకంబునందుఁ
దృతీయాంకము.





శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణేనమః.

# సరోజినీ నాటకము

## చతుర్థాంకము.

### రంగము 1. అరణ్యభాగము.

(సరోజిని కమలిని సూక్ష్మబుద్ధియుఁ బ్రవేశించుచున్నారు).

సూక్ష్మ-రాజీవా? నీసద్గుణములును స్నేహపాత్రతయుఁ బ్రభాకరునివలన వినినీతోఁబరిచయము కలుగఁజేసికొనవలెనని వచ్చితిని. నేనీయరణ్యమందునున్న కీర్తివర్మమహారాజుగారి స్నేహితుఁడను.

సరో-(తనలో) ఆహా! మాజనకుని పవిత్రనామమునువినియు క్షేమమును దెలిసికొనియు నేనీపూరుషవేషమును ధరించుటచే నాతనియండనివసించుటకు మొగము చెల్లకున్నది. ఆతనిసందర్శనాభిలాషమున మనసాతనిఁజేరఁద్వరపడుచున్నది. అయిన నిప్పుడు సమయముకాదు.

గీ. తండ్రి కెడబాపె నన్నిన ♦ తండ్రి మొదట
పిదపనెడబాపె నన్ను నీ ♦ వేషమిటుల
నకట! యింకెన్ని విఘ్నంబు ♦ లబ్బెనో యిటు
లనతిదూరంబునందున్న ♦ జనకుఁజూడ.

(ప్రకాశముగా) ఓయయ్యా! మీరాక నాకుబహువంతోషదము.

గీ. నీగుణగణంబు నేనును ♦ నెమ్మివింటి
నిన్నుఁగాంచెడు వేడ్కనా ♦ కున్నదిమదిఁ
గాలమహిమను లభ్యంబు ♦ గాకయుండె
నధిపు, మిమ్ముఁగాంచు భా ♦ గ్యంబు నాకు.

అయ్యా! సర్వము మిథ్యయను వేదాంతమును మీరు బోధింతురఁట నిజమేనా?

సూక్ష్మ-నిజమే. నేను బోధించుమతమదియే. అదియే యద్వైతసిద్ధాంతము.

సరో-అవునుగాని యీదినములలో నంతయెక్కుడు వేదాంతమును గూడదు. అంతగా సాంసారికతుచ్ఛసుఖములపై నాశయును మంచిదికాదు.

గీ. సర్వమును మిథ్యయంచును ♦ జాటియతివి
రాగులై యుండుటయు నను ♦ రాగ మొకటె
బ్రహ్మమని యెంచుటయుఁ గూడఁ ♦ బాడిగాదు
మిశ్రమమతంబె నాకు స ♦ మిద్ధమరయ.

సూక్ష్మ-ఏమీ? ప్రపంచకము శూన్యమనితలంచి మౌనవ్రతముఁ దాల్చి యుండుట శ్రేయముకాదా?

సరో-అట్లులయినచో దీపస్తంభముగా నుండుటమంచిది.

సూక్ష్మ-నాకదియే యుత్తమమని తోఁచును.

గీ. శాస్త్రవాదిశబ్ద ♦ సౌష్ఠవతర్కంబు
గాయకుని మనోవి ♦ కారగరిమ
శూరవరుని రాశ ♦ సుందరీమోహంబు
న్యాయవాదియుక్తి ♦ నాకు లేవు.

సరో-అట్లయినచో నీకున్నదేమిటి?

సూక్ష్మ- గీ. దేశసంచారమును జేసి ♦ దివ్యతలము
లన్నియును జూడనబ్బిన ♦ యనుభవంబె

నాకుఁగలదెల్ల; దానినే ♦ యేకతంబ
నేనుగూర్చుండిదినము ధ్యా ♦ నింతునయ్య.

సరో-దానివలన సుఖమా! దుఃఖమా!

సూక్ష్మ-రెండునుగాదు. ఒకవిధమయిన మనోవ్యాకులత.

సరో- మీకున్న ధనమెల్ల వెచ్చపెట్టి దేశయాత్రాకష్టములనుభవించి కడకుసంపాదించుకొన్నది మనోవ్యాకులత యేనా!

సూక్ష్మ-మీకన్న నాకెక్కుడు లోకానుభవము లేదా?

సరో-ఆయనుభవముండుటవలన వ్యాకులత యేగదాఫలము.

గీ. స్వానుభవబోధచేతనా ♦ స్వాంతమెల్ల
వ్యాకులముచేసిపీడించు ♦ వానికన్న
మూర్ఖుఁడైననుసంతోష ♦ మునుఘటించు
వాఁడెనాప్రాణమిత్రుండు ♦ వలతువాని.

[అంతఁబ్రభాకరుఁడు ప్రవేశించుచున్నాఁడు].

ప్రభా-ప్రేయసీ! సరోజినీ! నీకుసుఖమా!

సరో-సూక్ష్మబుద్ధీ! కావున నీపద్ధతిమార్చి మాబోంట్లసహవాసమున సుఖంపుము. నీకుశుభమగుఁగాక పొమ్ము.

సూక్ష్మ-దయయుంచుము. పోయివచ్చెదను (అనిపోవుచున్నాఁడు).

సరో-ప్రభాకరా! రాకాచంద్రు నిరాకవలన కుముద్వతికిబలె నీరాకవలన సరోజినికేల సుఖమబ్బదు. అవునుగాని యేమియిట్లు చేసినాఁడవు?

గీ. ఇదిగోవచ్చెదనంచుమో ♦ హించిపోయి
మోసపుచ్చితివెచటకుఁ ♦ బోయినాఁడ
వకట! కాముకధర్మంబె ♦ యట్లొనర్ప?
లేదెమోహంబునాపయి ♦ లేదెకూర్మి.

ప్రభా-సరోజినీ! ఒకగడియయాలస్యమయినది. దానికింతచదివెదవా?

కం. కమలినిపై సూర్యునకును
గుముదినిపైఁ జంద్రునకును ♦ గోమలి! నమ్మో
హము లేనియెడల నామో
హమునీపయిశూన్యమగును ♦ నంబుజనేత్రా!

సరో-అట్టులయిన నాసూర్యచంద్రులు దమప్రాణేశ్వరులఁగలియుటలో నిముషములో శతాంశమయిన నాలస్యము చేయుదురా!

ప్రభా-చేయకపోవచ్చును. అదియేగదా దైవములకును మనకునుగల భేదము.

సరో-నీవు నీసరోజినితో నెప్పుడైన మాటాడియుంటివా?

ప్రభా-అయ్యో! నాయదృష్టమా? ఒకముహూర్తకాలమామెను రణరంగమునఁగాంచి నేత్రానందముగావించుకొంటిని. అప్పుడేయామె నాకీహారమును దయచేసెను. అంతటిదియే నాపరిచయము.

సరో-అప్పుడు సరోజిని యెట్టిశృంగారమునుదాల్చియుండెను.

ప్రభా-వర్ణించెదవినుము.

సీ. అట్టెవిచ్చెడునబ్జ ♦ మట్టులనరసగం
భైననేత్రము తెర ♦ యవలనుంచి
మల్లెమొగ్గలదండ ♦ మాడ్కినోష్ఠద్వయ
మధ్యదంతావళి ♦ మసలుచుండఁ
బండుతమలపాకు ♦ పగిదినున్న మొగంబు
పైనినీలవుఁజుక్క ♦ పరిఢవిల్ల
నంజనరేఖను ♦ నవఘుళించెడుభ్రూయు
గముమధ్యఁగుంకుమ ♦ కాంతిదనర

గీ. సంస్కరించినవేనలి ♦ జారుముడియు
నిగనిగలఁదేరుజాళువా ♦ నీటుచీరఁ
దాల్చిమెఱుపట్లు మేడపైఁ ♦ దళుక్కుమనుచుఁ
దొంగిచూచుచున న్వేఁశు ♦ భాంగియపుడు.

సరో- (నవ్వుకొనితనలో) అప్పుడు నేనున్న తీరచ్చుగుద్దినట్లు వర్ణించి

నాఁడే! [ప్రకాశముగా] ఆమెప్రతిబింబమునప్పుడు తీసుకొంటి వా యేమి?

ప్రభా-నామనస్సు నేత్రసహాయమునఁదీసుకొన్నది.

సరో-నిన్ను వదలిపోవునపుడామె యాకృతియెట్లున్నది?

ప్రభా-దుఃఖదేవతవలెనున్నది. ఆమెయప్పుడనునయించిన యంగవైఖరిని స్వభావోక్తిగా వర్ణించిన నాకును దుఃఖముకలుగును. కావున నలంకారపరిభాషలో వర్ణించెదను.

మ. కదళీస్తంభమునందునాళవిలస ♦ త్కంజాతమొుఁడొప్పెఁ, బై
నుదయించెన్విధుఁ; డందునన్ బొడమెనీలోద్ప్రభావీచిహా
ర్షదకాళింది; స్రవించెనంజనపుధా ♦ రావ జ్త్రిహేమాద్రిపైఁ
జెదరన్ జిందరవందరై పిదపనన్ ♦ జింతాబ్ధిలోఁద్రోయుచున్.

సరో-[సవ్వుచు] మిత్రమా! ఎంతబాగుగవర్ణించితివి? ఆమెపోయిన తరువాత నీవేమనుకొంటివి?

ప్రభా-దురదృష్టమనుకొంటిని. పిదపనామె నెప్పుడు చూతునోయని యువ్విళులూరుచుంటిని. ఆమెను దలంచుకొనుచుంటిని.

సరో- ఎట్లు?

ప్రభా-మిత్రమా? మాటమాటకుఁ బ్రశ్న వేసి పీడించెదవా? వినుము.

ఉ. ఎప్పుడునిన్నుఁజూతుఁదర ♦ళేక్షణ!?నిండుగఁగౌగిలింతుని
న్నెప్పుడు? నీవిడెంబుఁగొని ♦ యేమనసారరుచింపఁజూచుటెం
కెప్పుడు? మోహలీలలన ♦ హీనసుఖాంబుధిఁదేలుటెప్పుడో
యొప్పులకుప్ప! యంచువగ ♦ నుల్లమునందలపోసితిన్ జెలీ

సరో-(తనలో) ఈతనికినాపై నెంతమోహముగలదు. (ప్రకాశముగా) మిత్రమా? ఆమెలభించుట యెప్పుడెప్పుడని యువ్విళ్ళూరుచుంటి వి. ఒకవేళనీనాటి వెన్నెలరాత్రియామెయిక్కడఁదటస్థించినచో నీకోరికలెట్లుపారును.

ప్రభా—అయ్యో! నాకంతయదృష్టమా? అట్లుగలిగినచో,

సీ. ధరణీజములనీడ ♦ దాగియొండొరులకై
వేడ్కమై వెదకెడు ♦ విధముసొంపు
పూర్ణచంద్రోదయ ♦ స్ఫురితదేశంబుల
సలలితోత్సాహహా ♦ సముల పెంపు
నానాసుఖవిరచ ♦ నాకౌశలముఁజూపు
విడియంపుమడుపుల ♦ వేయుతీరు
మన్మథోద్దీపిత ♦ మంత్రయుక్తములైన
పద్దెముల్ పాటలఁ ♦ బాడుసౌరు

గీ. కలుగశృంగారరసభావ ♦ కలితమగుచుఁ
గ్రమపంచేంద్రియోత్కరా ♦ కర్షణముగుచుఁ
గ్రాలువెన్నెలరాత్రినే ♦ గడువఁజూతు
నాసరోజినితోడఁ బే ♦ రాసతోడ.

సరో—నేను సరోజినినిగానా? నన్నట్లేల సేయవు?

ప్రభా—కావని నేనంటినా? అట్లేచేయుదును.

సరో—సరేగాని పిదపనామెను నీవుమరల నేలకలిసికొనలేదు.

ప్రభా—అయ్యో? గ్రహచారమా? మల్లయుద్ధమున జయించితినను నసూయచే నాయన్నకలహంసుఁడునన్నుఁజంపింపఁబ్రయత్నింపగాఁ గృతజ్ఞసేవకుండగు సారంగునివలనఁ దెలిసికొని యాతనితో నేనీ యరణ్యములఁబట్టితిని. ఆమెయచ్చటఁ జెఱలోనుండనోపు. ఇట్లు లన్యోన్యమువియోగాబ్ధిలోఁబడియుంటిమి.

సరో—(తనలో) కలహంసుఁడు నాపాలిటిప్రాణబంధువుఁడే. అతఁడట్లు చేయకున్నచో నీతఁడెట్లు నాకంటఁబడఁగలఁడు (ప్రకాశముగా) ధనవర్మయుఁ గలహంసుఁడును బరమదుర్మార్గులునుమా? ఎంత ద్రోహకర్మమొనర్చిరి? తరువాత

ప్రభా—తరువాతనీయరణ్యమునఁ గీర్తివర్మమహారాజుగారి ప్రాపుగని యీసరోజినిపైఁ బద్యములువ్రాసికొనుచుఁజివరకు నీస్నేహము సంపాదించితిని.

సరో—నాస్నేహము నీకిష్టమేనా?

ప్ర —ఇష్టమే. సందేహమేమి?

సరో—అయినచో మనమిర్వురమిచట గాంధర్వవిధిగాఁ బెండ్లిచేసుకొం
దమా?

ప్రభా—సంతోషము.

సరో—పుష్కరిణీ! వింటివా? ఆయనప్రభాకరుఁడఁట. నేనుసరోజినినఁట
మావివాహమునకు నీవేసాక్ష్యము.

కమ—రాజీవా? పురుషులలోఁ బురుషులకు వివాహములు నేనెప్పుడు
చూడలేదు. అయినను మీరిష్టపడిరిగనుక నాకుసంతోషమే.

సరో—మనమిద్దఱము మనయుంగరముల మార్చుకొందము.

ప్రభా—మంచిది. (అనియట్లుచేయుచున్నాఁడు).

సరో—జీవితకాలమంతయు నన్నునీవు విడువవుగదా.

ప్రభా—సరోజినిని విడుచుటయేనా?

సరో—సరోజినినే! మంచిది.

ప్రభా—సరోజినీ! నేనువచ్చిచాలసేపైనది. కీర్తివర్మప్రభువు నాకైయె
దురుచూచుచుండును. పోయివచ్చెదను.

సరో-ఎంతకాలములో?

ప్రభా-జాములోపల.

సరో-తప్పకరావలెనుసుమా! వెనుకఁజేసినట్లుచేయకుమాం?

ప్రభా-మంచిది. (అనిపోవుచున్నాఁడు).

కమ—సోదరీ! ఎంతగట్టిదానవే! ప్రభాకరునిచే సాక్ష్యముపుచ్చుకొనిన
ట్టులన్నియుఁ బలికించితివే.

సరో—ఆతఁడంతయు సత్యమునేపలికినాఁడు. ఆతనికి నిజముగాఁ బ్రేమ
యున్నదోలేదో కనుగొనుటకైయట్లుచేసితిని. (తనలో) ఓ
యిత్తుధన్వీ! నీకుమ్రొక్కి-సందులకుఁ గొంతయుపకారముఁజేసితివి.
నీపరాక్రమమపూర్వమయినదిగాన నన్నుఁబూర్ణమనోరథను
గానిమ్ము-

గీ. ఎల్లవిలుకాండ్రలోనస ♦ మిద్ధకీర్తి
యెసఁగునీకొక్కనికెయది ♦ యెట్టులనిన
నొకటిరెండుగఁజేతురా ♦ యోధవరులు
రెండునొకటిగఁజేయుధ ♦ ర్మ్యుండవీవు.

(ప్రకాశముగా) కమలినీ! ప్రభాకరునిరాకకై యెదురుచూచుచు మనగృహంబుననుండుదముర మ్ము. (అని కమలినితోఁ నిష్క్రమించుచున్నది).



రంగము 2. ఇంకొకయరణ్యభాగము.

(కీర్తివర్మయు సూక్ష్మబుద్ధియుఁ బ్రవేశించుచున్నారు).

కీర్తి—మిత్రమా! ధృతకీర్తిపుత్రుఁడగు ప్రభాకరుఁడీయరణ్యమునకు వచ్చినప్పటినుండియు నాకుసంతోషముగానున్నది.

చ. చక్కనివాఁడురూపగుణ ♦ సంపదలంగడుఁజొక్కువాఁడు పే
రెక్కినవాఁడుశౌర్యమున ♦ నిద్ధకుమారునిఁబోలువాఁడు నా
యక్కఱకందువాఁడుదర ♦ హాసముఖాబ్జముగల్గువాఁడు స
మ్యక్కరుణాంతరంగుఁడన ♦ మానకళానిపుణుండుచూడఁగన్.

సూక్ష్మ-స్వామీ! నిజమే. ఆతఁడట్టివాఁడే.

కీర్తి-కాని యాతనికేదియోమనఃక్లేశము సంభవించినట్లాతని మొగము చెప్పకయ చెప్పుచున్నది.

సూక్ష్మ-ఎందులకో యామనఃక్లేశము?

కీర్తి-ఆతఁడు నిద్దురలోఁగూడ "సరోజినీ? సరోజినీ?" యనిపలువరించుచున్నాఁడు. నాతోవిస్పష్టముగాఁ జెప్పలేదుగాని నాకుమాతే సరోజినిని మోహించినట్లు కనఁబడుచున్నది. ఆతనిజామాతగాఁ బడయుటకు నాకుఁబరమసంతోషమే. అయినను నాకుమారికామణిని జేతులారఁ బ్రభాకరునికి సమర్పించుభాగ్యము నాకుఁగలుగునా? హా సరోజినీ?

చ. వను వెలిజేసి దేశమువ ♦ నంబులపాలొనరించి యాపయిఁ
నినుఁ జెఱఁబెట్టఁ జేసెనతి ♦ నిర్దయుఁడైవిధి? యేమిసేయుదున్
దినమును నేత్రపర్వముగ ♦ నిన్గను భాగ్యము నాకు లేమి నే
వనటనుగుందుచుంటిగ్రహ ♦ పాటెటులుండెఁ గుమారికామణీ?.

సూక్ష్మ-దేవా! శాంతింపుఁడు. కాలచక్రముతిరుగదా ? సుదినములు రావా ?

కీర్తి — రావచ్చును. హాసరోజినీ! నీవెంతకష్టపడుచుంటివో?

చ. వరనృపపుత్రిగాజనన ♦ భాగ్యమునొందితివమ్మ! యాపయిన్
సురుచిరసౌఖ్యసంపదలఁ ♦ జొక్కితి; ప్రాగ్భవమందునెట్టిదా
దురితముఁ జేసినావొపిత ♦ తోడవియోగమునొందఁగాఁబయిన్
బరమకిరాతుబారిఁబడఁ ♦ బల్లవపాణిరో! నాసరోజినీ?

సూక్ష్మ-దేవా! మీరట్టుదుఃఖంపఁగూడదు.

కీర్తి — నిజమే. ఎఱిఁగియుండియు దుఃఖమడఁచుకొనలేకయున్నాను. సరోజినీ? నీవెప్పుడైన నాకంటఁబడుయోగముండిన నదిప్రభాకరునివలననేసుమా?

సూక్ష్మ — స్వామీ? నిజము. ఆతనితో నీసంగతిముచ్చటింపవచ్చును.

కీర్తి-చూతము.

చ. సరసతరాంగి, భృంగకచ ♦ సర్వజనాదరణీయ, సద్గుణన్
శరదమలాబ్జవక్త్రి, నవ ♦ చారుకురంగవిలోలలోచనన్
దరుణశశాంకఫాల సత ♦ తప్రియమైనసరోజినిన్ ప్రభా
కరునకొసంగి పెండిలిసు ♦ ఖంబుగఁ జేసెడుభాగ్యమబ్బునే?

సూక్ష్మ- దేవా! ఆతఁడిక్కడకువచ్చుటయు మీకట్టియుద్దేశము కలుగుటయుఁజూడ మీమనోరథసిద్ధియగునని తోఁచెడును.

కీర్తి — దైవము రక్షించుఁగాక. పోవుదమురమ్ము.

(అనిసూక్ష్మబుద్ధితో నిష్క్రమించుచున్నాఁడు).

రంగము 3- వేటకొఱకయరణ్యభాగము.

(సరోజినీకమలినులు ప్రవేశించుచున్నారు).

సరో-కమలినీ! ప్రభాకరుఁడు మనలవీడి జాముకాలేదా? ఇంకనురాలేదే?

గీ. గడియయుగమయ్యె నాప్రభా ♦ కరుఁడురామి
మనసువగఁగూరిత ప్రహ్మ ♦ కనలుచుండె
నేనరోజినిగానంచు ♦ నాసవీడి
యున్నవాఁడేమొ యతఁడురా ♦ కుండమాని.

కమ—సోదరీ! జామయినదికాని,

గీ. విల్లునమ్ములఁజేఁబూని ♦ వేఁటకొఱకు
వెడలిబడలుచు నిడుమలఁ ♦ గుడిచినిదురఁ
బడియెనోయేమొ చింతింప ♦ వలవదమ్మ
యతఁడురావచ్చునింతలో ♦ వెతయదేల?

సరో-ఇఁకఁగొంచెముసేపు నీచెప్పినట్లవేచియుందును.

క. విరహులకాలంబులు బహు
విరసములైయుండుఁగాదె ♦ ప్రియుఁడుండినచోఁ
జరచరబాలునుగడియలు
భరమగువత్సరములట్లు ♦ పతిలేనియెడన్.

అన్నా! నాప్రేలియుంగరముపాటిభాగ్యము నాకులేకపోయె. అది యిప్పటికి సుఖమేయనుభవించుచున్నది.

చ. సరసమనోహరాంగుఁడని ♦ సద్గుణభాసితుఁడంచునెంచినే
ర్పరులగతిన్ దటాలుఁనగ ♦ రగ్రహణంబొనరించినారమి
ద్వరమును నుంగరంబ! యతి ♦ పుణ్యమపీవగుటన్ సుఖంబునన్
వరలెదు; నేనభాగ్యనయి ♦ బాధనలందెదదూలుచున్విధిన్.

నాకందిన యాతనిప్రేలియుంగరము నావలెనే వియోగదుఃఖమును బొందుచున్నది.

గీ. అంగుళీయము! నను జేరి ♦ నంతనుండి
దుఃఖమునుబొందుచుంటినా ♦ తోటిపాటె
యవ్వునునిర్భాగ్యతోడి స్నే ♦ హంబుకలిమి
సుఖముగలిగించు నేమెట్టి ♦ నుజనునకును.

నాప్రభాకరుఁడింకనురాలేదే?

గీ. అదిగొచంద్రోదయంబంచు ♦ నలరిజనులు
నేత్రకుముదాళివికసింప ♦ నింగిఁజూడ
శరదసంఘన్నుఁడై కను ♦ మొఱగినట్లు
మొగముఁజూపించిచనియెనా ♦ సొగసుకాఁడు.

ఓప్రభాకరా!

ఉ. సూరిజనంబుఁబొత్తముల ♦ సుందరులర్గ గుసుమాంగులంచునిం
పారఁగఁబల్కుటల్వొని య ♦ పారమనోవ్యథఁదావిలేనిమం
దారమునాకుఁబోలికకుఁ ♦ దట్టఁగఁజింతిలుదానఁగాననీ
చారుకృపాప్రసారముభృ ♦ శంబుగఁగల్గగులాబిగానొకో?

కమ-సోదరీ? ఎంతవిచారంచుచుంటివే? ఎవరోయిటులవచ్చుచున్నాఁడు
చూడవే.

సరో-అక్కా? కమలినీ? ఏఁడే.

కమ-అదుగో. (అంతఁగలహంసుఁడు ప్రవేశించుచున్నాఁడు).

సరో-(కలహంసునిఁజూచి అకటా? మందభాగ్యురాలను. (తనలో)

గీ. నయనపర్వంబుగాఁబ్రాణ ♦ నాథుఁడేటకు
వచ్చెనంచునునాసింప, ♦ వచ్చెనెవఁడొ
మృత్యుచేవిఘ్ను నాథునా ♦ కృతినిఁజేయ
బూన, వానరమద్దానఁ ♦ బొడమినట్లు.

కల-ఓయయ్యా? మీకుశుభమగుఁగాక.

గీ. ఈవనాంతరమందున ♦ నెటులఁబోవఁ
గనెదనోమాధవీలతా ♦ కలితమగుచు

రమ్యమైన్కొ లేదు కుటీర • రాజమొండు
చెప్ప లేనాకుదయఁజూపి • శీఘ్రగతిని.

సరో- గీ. పడమరకు బోయి యూపయిఁ • గుడికితిరిగి
యెడమ కైమీదుగాఁబోవ • నెదురువడును
నొక్క సెలయేఱు దానినిఁ • జక్క దాట
నీవు గోరుకుటీరంబు • నెగడుచుండు.

అయిననిప్పుడెవ్వరునందుండు సమయముకాదే!

కల-(ఇర్వురనుగలయఁజూచి తనలో).

గీ. స్త్రీముఖాభఁదాల్చి • చెన్నారునీతఁడా
యతివభగినిఁబోలె • నమరియుండె
నామెయునుదలంప • నన్న చాయనుమించి
యెక్కుడెలుపుగల్గి • యెసఁగుచుండె.

(ప్రకాశముగా) ఓయయ్యా? మీరెవరు? ఇప్పుడు నేను జెప్పిన కుటీరమున కుయజమానులుమీరేనా?

కమ-అడిగినప్పుడు మేమేయని చెప్పకొనుట దంభముగాదుగదా? మే ము ప్రస్తుతమీయరణ్యవాసులము. ఆతఁడు నాతమ్ముఁడు.

కల-అట్లులయిననంతోషము. ప్రభాకరుఁడు సగౌరవముగా నామూల మున మీకొకసందేశము బంపినాఁడు.

సరో-(తనలో) హా? దైవమా! ఈతఁడేమిచెప్పనోగదా. (ప్రకాశము గా) ఏమని!

కల- గీ. ఎవనినిసరోజినీయంచు • నిందుఁబిల్చు
చుండెనో వానికిఁ బ్రభాక • రుండుపంపె

సరో-(ఆతురతతో) దేనిని?

కల- రక్తసంకీర్ణమైనవ • స్త్రంబుదీనిఁ
దెల్లముగ వానిబాధను • దెల్పు దాని.

(అనియిచ్చుచున్నాఁడు)

సరో-(అందుకొని) ఓయయ్యా! నన్నేయాతఁడుసరోజినియని పిల్చుచుండును ఇప్పుడాయనకేమి యాపత్తుసంభవించినది? దాచక తక్షణము తెల్పుఁడు,

కమ-సత్వరముగా.

కల-ప్రభాకరుఁడు మిమ్ముఁవీడ్కొనునపుడొక జాములోవచ్చెదనని చెప్పెనఁట

సరో-నిజమే. తరువాత.

కల-తరువాతఁబోవుచు మార్గమధ్యమునఁ దనచూపొకప్రక్కకు నిగుడించెను.

సరో-అయిననేమి- తరువాత.

కల-తరువాత,

చ. కనియెనుదృష్టిభీకరము ♦ గానొకమఱ్ఱికుజంబుక్రిందనా
ఘనుఁడొకపాతకిన్ భయద ♦ కాయునుష్ప్టినిమగ్నదేహునిన్
జినిఁగినవస్త్రఖండముల ♦ చేఁదనువున్ భరియించువానిభీ
షణఫణిరాజకుండలిత ♦ సంకటకంధరుఁగాలవక్రతన్.

సరో-(దుఃఖముతో) అక్కటా! ప్రభాకరునికెంతగండము తటస్థించెను? తరువాత

కల-తరువాతనాసర్పరాజ మా ప్రభాకరునిఁజూచినతోడనే తనచుట్టవిప్పుకొని యామనుజునివీడి జఱ్ఱుజఱ్ఱునఁ బారి యొకపొదలోదూరెను.

సరో-పరమసంతోషము. తరువాత,

కల-తరువాతనేమని చెప్పుదును?

సరో-పాపముశాంతించుగాక. ఏమిటయ్యా! అట్టులంటివి?

కల-ఉ. ఆపొదనీడక్రిందఁ బర ♦ మాద్భుతభీకరకాయమొప్ప, ను
ద్దీపితకోపమానసము ♦ తేజరిలన్ గనుగ్రుడ్డులందు, నా
టోపముమీఱ నాకలిక ♦ దుర్దహియింప శిరంబునేలపై
నాపుచునొక్కసింహము న ♦ రాధమునిన్ గబళించునాసతోన్.

సరో—(దుఃఖముతో) అక్కటా! సర్పముప్రాయినను సింహామెదుర య్యెనే? అయ్యో! ఆపాడుసింహామేమిచేసెను?

కల.చ. మఱుఁగునఁబొంచియుండి యుల ♦ మానిసినిద్దురనుండి లేచునా తరికయివేచియుండె నది ♦ తాఁగని యానరుఁబ్రోవనా ప్రభా కరుఁడురయంబునంజనుచుఁ ♦ గాంచెనునాతని నన్నగాఁగనా హారియుఁబ్రభాకరుంగనుచు ♦ నాగ్రహవృత్తినిఁబైఁబడెన్వడిన్.

సరో—అయ్యో! హాతవిధీ! ఎట్టియిక్కట్టుతెచ్చి పెట్టితివి?(అని మూర్ఛిల్లుచున్నది)

కమ—రాజీవా? ఆతనికై ప్రాణహత్యచేసికొందువా?(అనియొడలిపైఁ జేయివైచి) ఓయయ్యా! ఈమెనుదేర్చుటయెట్లు. (అని దుఃఖించుచున్నది)

కల—(కమలినినిఁ గలయఁజూచి) త్వరపడకుము. ఆమె క్షణములో లేచును.

సరో—(మూర్ఛఁదేఱి) ఓయయ్యా! ఆపిదప మీరుచెప్పఁదగినది లేదు. అంతయు నీరక్తవస్త్రమే తెల్పుచున్నది. అన్నా! ప్రభాకరా! శౌర్యరాశీ! సరోజినీముఖసరోజప్రభాకరా?

గీ. నాప్రభాకర! నాప్రాణ ♦ నాథ! నీదు
శౌర్యకిరణౌఘ తేజంబు ♦ సమసిపోవ
నీసరోజినిమాంగళ్య ♦ మేటఁగలిపి
యస్తమించితెధరఁగప్ప ♦ నాతిఁతమము.

కల—సరోజినీ? త్వరపడకుము. ప్రభాకరునిపైనీకుఁగలవెట్టిప్రేమ ముందే కీడెంచుచున్నది.

సరో—ఓయయ్యా! చెడువార్త నీనోటవినుటకు నామనసొగ్గదు.

కల— పాపముశమించుగాక. చెడువార్త యేమైన నాతఁడీవస్త్రమును బంపెననిచెప్పియుండునా?

సరో— అట్టులనా? నీవు వెయ్యేండ్లుజీవింతువుగాక. ఒకవేళనాతనికి మహాకష్టముసంభవించునపుడీ రక్తవస్త్రముఁజూపించుమని చెప్పి

యుండఁగూడదాయని యనుకొంటిని. ఆమహానుభావుఁడు జీవిం
చియున్నాఁడా?

కల— జీవించి సురక్షితముగానున్నాఁడు.

సరో—అదృష్టమత్యాష్టము. ఆపాడుసింహమట్లుపైఁబడినతరువాత,

కల-గీ. ఇరువడవులాతఁడుపుడు వెన్నియుఁజొచ్చె
గానిసోదరుపైఁగల కరుణయొకటి
సహజశౌర్యంబునొకటి ప్రోత్సాహపఱుప
దుమికె సింగంబుమీదికి దోర్బలమున.

సరో-- తరువాత శుభమువచింపుము.

కల-- తరువాతనాసింహము నడగొండవలె నేలఁగూలెను. అంత నా
మానిసి మేల్కాంచెను.

సరో-- వస్త్రాబహువంతొపమ్ము.ఏ చోనీవస్త్రముకురక్తమెట్లువచ్చె?

కల-- మొదట సింహము పైఁబడినపుడాతని భుజములఁ బట్టుకొనుటలోఁ
గొంచెమురక్తముచిమ్మినది. అది యుత్తరీయమునకంటినది.

సరో-- అన్నా! ప్రభాకరా! నీప్రాణేశ్వరి నీరక్తమునుజూడవలసివచ్చెను
గదా? ఆకష్టసమయమున నన్నెంతతలఁచుకొంటివో. (అని
మూర్ఛిల్లెను)

కమ-- అయ్యో! మాతమ్ముఁడుమరలమూర్ఛిల్లెను (అనిదుఃఖించుచున్నది)

కల-- (కమలినిఁజూచుచు తనలో) ఆహా ? ఈమె కడుసుందరముగానున్
న్నది. (ప్రకాశముగా)

క. మానిని! దుఃఖం బేటికిఁ
ప్రాణేశ్వరుడైన రక్తవస్త్రముఁజూడఁగా
జ్ఞానలు మూర్ఛిల్లరె తా
మానిషిబలె నుంట నితఁడు మఱిగించునటుల్.

ఇది మూర్ఛాభినయముగాదా! ఇతఁడు పురుషుఁడుగాఁడా?

కమ-- (కలహంసునిఁజూచు) నేనును దుఃఖమభినయించుచున్నాను. త
మ్ముఁడా! రాజీవా! ఇఁక లెమ్ము అంత సరోజినిమూర్ఛ దేఱుచున్నది)

కల-అదిగో మీయాతమ్ముఁడు లేచుచున్నాఁడు.

సరో-అన్నా! ప్రభాకరా! నీకెంతదుఃఖము ప్రాప్తించెను.

ఉ. ఏటికినీవుపోయితివి ♦ యిందులనుమ్మటుపీడి? పోయినన్
బాటనుఁబోకసర్వవృత ♦ మానవునిన్ గననేల? కాంచినన్
జాటుననుండుసింహామతి ♦ శౌర్యమునన్ బడనేలనీపయిన్?
గాటపుదుఃఖమిట్లుకలు ♦ గన్ విధివ్రాయఁగనెట్లుతప్పెడున్.

గీ. దుఃఖమొందెడువానికే ♦ దొడరుచుండుఁ
దఱుచుదుఃఖపరంపరల్ ♦ తప్పకుండ
ఆయిదగిలినవ్రేలికే ♦ ఆలుదగులు
మరలజాగ్రతనడచిన ♦ మార్గమునను.

ఓయయ్యా! యీవస్త్రమునాకెందుకుపంపినాఁడు- దుఃఖించుటకా?

కల-కాదు. తానన్నవేళకురాలేమికి వగచుచుఁ దనకుఁగలిగిన గ్రహపాటునకుసాక్ష్యముగా దీనినిఁబంపినాఁడు

సరో-(తనలో) కాలాతిక్రమణమునకు నేను దాళియుండనని యిట్లీతనినాయొద్దకుఁబుత్తెంచె. అన్నా! నాపైనాతనికెంతప్రేమ? (ప్రకాశముగా) సంతోషము.

కమ-ఓయయ్యా! ప్రభాకరుఁడు దారిలోఁదనయున్నను గలిసికొనెనంటివే వెనుకనీతనిఁ జంపింపఁదలఁచినయన్న యేనా యాతఁడు?

కల-ఆతఁడే యాతఁడు. ఆతఁడాదుర్మార్గమునుఁ జేసియేయుండును.

సరో-ఆహా! తనప్రాణహరణోద్యోగమునఁ బ్రవర్తించిన యాద్రోహియెడల నీతఁడెట్లుభూతదయయు సన్మార్గమునుఁ జూపించెను. ఏమియాతనిసజ్జనత!

చ కుజనుఁడుదుష్టబుద్ధితన ♦ కున్ బహుకష్టము తెచ్చిపెట్టినన్
సుజనుఁడు దానినించుకయుఁ ♦ జూడక మేలెఘటించెదున్; ఫల
వ్రజమునుగోరిచెట్టుపయి ♦ రాళ్ళనురువ్వినఁదానహించుచున్
నిజమహిమల్ గనంబడవ ♦ నీజముపండ్లనునీడనీయదే?.

కమ-సోదరీ! దుర్మార్గులకదిసహజము సన్మార్గులకిదిసహజము. దీనిలో

నంతయాశ్చర్యమేమియు లేదు. ఓయయ్యా ! ఇప్పుడాసోదరుఁడె క్కడనున్నాఁడు?

కల-(తనలో) ఈమెతోఁజెప్పుటకు సిగ్గగుచున్నది. (ప్రకాశముగా) నే నేమని చెప్పను? (అనితలవంచుకొనుచున్నాఁడు).

కమ-అయ్యో! నీవేనాయేమి?

కల-(నమ్రవదనుఁడై).

చ. అనుజవిభాగదుర్విషము ♦ నాత్రతఁ గ్రోలఁగ నెంచియీపయిల్
మనమున నీర్ష్యఁబూనిమరి ♦ మాయమునర్థ దనతమ్ము ప్రాణముల్
ధనమునకై హరింపజత ♦ నంబొనరించిన పాపిదుర్జనుం
డనుజుఁడు రాక్షసుండుమలి ♦ నాత్ముఁడు క్రూరుఁడువీఁడెమానినీ!.

(అనితన్నుఁజూపుచున్నాఁడు).

సరో-(ఆశ్చర్యముతో) నీవేనాకలహాంసుఁడవు. తన ప్రాణములఁదీయుఁద లఁచిన నీకొరకేనా ప్రభాకరుఁడు ప్రాణములఁగోలుపోవలసి వచ్చినది?

గీ. తరుణచంద్రునిఁబోలువ ♦ ర్తిల్లుబువాని
నమృతతుల్యంబుగామాట ♦ లాడువాని
వెన్నఁబోలెడు మనసుచే ♦ వెలుఁగువాని
నకట! యెటుచంపఁబూనితి ♦ వయ్య! నీవు

కల-మిత్రమా! ధనాశాపాశబద్ధచేతస్కుండనై నామనస్సు నన్నెట్లు త్రిప్పిననట్లు తిరిగికట్టిడినై యట్టిపాపమునకొడిగట్టితిని. నన్ను నేనే దూషించుకొనుచున్నాను. శపించుకొనుచున్నాను. బుద్ధివచ్చి నది. పశ్చాత్తాపాగ్నిచే నామనోమాలిన్యమెల్ల భస్మమయి నవీ నప్రతిభావికాసమునుఁ దాల్చిగతచారిత్రమునకు వగచుచున్నది. మీరు నిందింపననవసరము.

గీ. భుజగవరదర్శనంబున ♦ దుజయుడంగ
బాహుబకుఁడుమాటినలచక్ర ♦ వర్తియయ్యో

భుజగదర్శనమునమనో ♦ రుజయడంగ
నేనుగుణచక్రవర్తినై ♦ నెమ్మిఁగనెద.

చ. తనయుసురుల్ గొనందలఁచు ♦ దాష్ట్యమతిన్ ననుఁగాచెఁదాను భీ
షణమృగరాజసర్పముల ♦ చండరుషాహతికిన్ దలంక కా
యనఘుఁడు దైవతుల్యుఁడుగ ♦ దాతలపోయఁగ; సిగ్గుఁజెందినా
యనుజునితోడి దేజగము ♦ టంచుఁదలంచిచరింతునీవయిన్.

సరో-సంతోషము. మనోవృత్తుల మార్పుఁదగినంత కష్టములు ప్రాపిం
చినంగాని యిట్టిపశ్చాత్తాపములుకలుగవు. అట్లునీవు మేల్కాంచి
నతరువాత విహారరువు రేమనుకొనిరి.

కల-గీ. యుద్ధముముగించి, నిద్రాప్ర ♦ బుద్ధుఁడైన
నన్నుఁగనియశ్రుకణములు ♦ నయనగోళ
కములగుమిగూడనడిగెని ♦ క్కడకు నేను
వచ్చినకతంబుఁగాఁగిఁటఁ ♦ గ్రుచ్చుకొనుచు.

సరో-ఆహా! అన్నపైఁ బ్రభాకరుని కెట్టియాదరణము!

కల-గీ. సిగ్గుచే నేనుఁదలవాల్చి ♦ చెన్నుఁదఱిగి
దుఃఖబాష్పంబులతులు ♦ దొప్పదోఁగ
ముందుకు మియింపఁగోరినా ♦ ముద్దుతమ్ము
తోడఁదెల్పితినాకథ ♦ స్థూలదృష్టి.

సరో-తరువాత,

కల-తరువాతనాతఁడు నన్నుఁగాంచి జాలివడియెను. చింతించెను. అభ
యహస్తమిచ్చెను. ఆపిదపఁ గీర్తివర్మమహారాజుగారున్నయెడ
కు నన్నుఁగొంపోయి నిద్రాహారసుఖములఁగల్పించెను. అంత
నేనును నాతమ్ముఁడును రాజుగారు పన్నుండుగదిలోనికిఁబోయి
తిమి. అక్కడనాతమ్ముఁడు దుస్తునువిప్పిచూడఁగా నాతని కుడి
భుజముపయిఁ గొంచెముమాంసమూడినగాయము కానుపించిన
ది. ఈగాయమేకొంత రక్తము స్రవింపఁజేసెను.

సరో-అన్నా! ఎంతదుఃఖ మెంతదుఃఖము.

కల-తరువాత నాతఁడాగాయమును జూచుకొనుచుండ నేను దానికిఁదగిన
కట్టుకట్టితిని. అప్పుడాతఁడు విచారముతో “హా! సరోజినీ! హాస
రోజినీ” యనిపలవించి సమయాతిక్రమణమునకువగచి నన్నిట
కుఁబంపినాఁడు.

సరో-మిత్రమా! ఆతనికిఁ బ్రాణభయము లేదుగద.

కల-నెయ్యమా! అట్టిభయమున్న నేనిఁటకువచ్చెదనా?

సరో-పుష్కరిణీ! నేనుమననివాసమునకుఁ బోఁగోరెదను. ఇచటనుండ
లేను.

కమ-మంచిది. మేమిరువురమును నిన్ను నెమ్మదిగాఁ దీసుకొనిపోఁగలము.
కలహంసుఁడా! కొంచెముసహాయముచేసెదవా?

కల-(చిఱునగవుతో) తప్పక చేసెదను. (కమలినీస్పర్శసుఖము తలఁచు
కొని తనలో).

గీ. తలిరుఁబోఁడినాహృ ♦ దయము నాకపేక్షించె
నించువిల్తుఁడేసె ♦ నొంచిశరము
స్పర్శసుఖముముందు ♦ సంభవమయ్యెడి
నెట్టులున్నదో కొర ♦ తీర్చ దాజ్ఞ.

(ప్రకాశముగా) ఓయీ రాజీవా?

గీ. అబలయట్టులశోకింప ♦ నగునెనీకు
పౌరుషాంకంబు లేదెయా ♦ వంతయైనఁ
జాలుఁజాలును లెమ్మికఁ ♦ జాలుఁజాలు
నవ్వెదరునిన్నుఁజూచుచు ♦ నాతులెల్ల.

సరో-మిత్రమా! నిజముగా నాకుఁ బౌరుషాంకము లేనప్పుడు లేదని చెప్పు
టకు నభిమానము లేదు. స్త్రీలందరునవ్వినను సరే యానందించి
నను సరే. మీతమ్మునితో నేనిట్లభినయించితినని గట్టిగాఁ జెప్పుము.

కల-ఇదియభినయముగాదే. నీవుమానసపూర్వకముగా మూర్ఛిల్లినట్లేయు
న్నదే.

సరో-ఇదియభినయమే. నమ్ముము.

కల-ఆయభినయమింక ననవసరముగనుకఁ బౌరుషవ్యాపార మభినయింపుము.

సరో-ఇప్పుడునేను బురుషవేషమభినయించుటలేదా ? నామనోధైర్యమునుఁబట్టిచూడఁగా నేనునిజముగా స్త్రీయాకృతినే ధరింపవలసి యుండెను.

కమ-రాజీవా ! నీవు బలహీనుఁడవగుచున్నావు. ఇంటికిఁబోదమురమ్ము. కలహంసుఁడా! మాతోఁగూడరమ్ము.

కల-(మందహాసముతో) నాకు మీతోఁగూడ రావలయుననియేయున్నది కాని ప్రభాకరునికడకు సత్వరముగాఁబోవలసియున్నది. కావున క్షమింపుము. సరోజినీ? ప్రభాకరునితోనేమిచెప్పుమందువు?

సరో-గీ. ప్రాణములులేక చిత్రంబు ♦ పగిదినుండి
యాసరోజినిమూర్ఛిల్లె ♦ ననుచుఁజెపుమ
తడవులేకభవత్పున ♦ ర్దర్శనంబుఁ
గోరెననిపల్కు-నానమ ♦ స్కారమిదుమ.

ఇఁకనీవుపోయెదవా? మేమిటుపోయెదము.

(అనియందఱు నిష్క్రమించుచున్నారు).

గద్య-ఇది శ్రీమద్రమారమణీరమణ చరణారవిందనిరంతరానూనధ్యాన
పారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానురాగ సూరమాంబా
వేంకటామాత్యపూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీపతురగ
గాన్వవాయాంభోధి సుధానిధాన వేంకటాచలాభిధాన
ప్రణీతంబయిన సరోజినీనామ నాటకంబునందుఁ

జతుర్థాంకము.





# సరోజినీనాటకము.

## పంచమాంకము.

### రంగము 1. అరణ్యభాగము.

(ప్రభాకర కలహంసులు ప్రవేశించుచున్నారు.)

ప్రభా—సోదరా! అనుభవనీయుఁడైన సూక్ష్మబుద్ధిచేఁ బ్రయోగింపఁబడిన యాకుపసరుచే నాగాయ మాశ్చర్యముగా మానిపోయినది.

గీ. సలుపుచుండినగాయంబు ♦ చక్కఁబడియె
నొక్కయాకుపసరుబూయఁ ♦ బెక్కుకష్ట
ములునునిట్టులెమాయమా ♦ నలలితైక
శుభముప్రాపింపసంతోష ♦ సుముఖమగుచు.

కల—తమ్ముఁడా! దానికి నేనే సాక్ష్యము. ఒరులనన్యాయముగా బాధించిన యెడలఁ బ్రతిఫలము వెంటనే నరుఁడొందుననుటకుఁ గూడ నేనే సాక్ష్యము.

ప్రభా—ఎట్లు?

కల-చం. నినునటులష్టకష్టముల ♦ నెనలయించుటఁజూచిదైవమున
ననుధనవర్మచేతజత ♦ నంబున బాములఁబొందఁజేసె; నా
వెనుకమనంబుపక్వమయి ♦ వీటిడినైవనభూమిఁజేరఁగా
నినుఁగనుభాగ్యమబ్బెయది ♦ నీఱుగఁజేసెమదీయదుఃఖముల్.

ప్రభా—బాగుగఁజెప్పితివి నిన్నుధనవర్మయెట్లు బాధించెను? నీవిదివరకుఁ జెప్పినదంత విస్పష్టముగాఁ దెలియలేదు.

కల—అయ్యో! ధనవర్మ మనకొంపఁదీసినాఁడు.

ప్రభా—దహనము చేయించినాఁడా యేమి?

కల--కాదు కాదు. మన సర్వస్వమున న్యాయముగా నాక్రమించుకొన్నాఁడు.

ప్రభా—ఏమి? ధనవర్మ హతకుఁడింతపని చేసెనుగా! ఓరిమూఢా! ధనవర్మా!

గీ. అగ్ని తాఁబుట్టినట్టి గృ ♦ హంబె కాక
యిరుగు పొరుగిండ్లుగూడద ♦ హించునట్లె
యనుజ రాజ్యాపహృతిచేత ♦ నాసతీర
కకట! మాస్వార్థ్యముఁగూడ ♦ నాక్రమింతె?

సోదరా? ఏమి కారణము?

కల—మల్లయుద్ధమైన పిదప నీవట్లు సారంగునితో నీపీవనములఁ జేరిన తరువాత నాధనవర్మ సరోజినిపై రాజ్యద్రోహురాలుగా నను మానపడి యామెను దేశబహిష్కారము నర్చె.

ప్రభా—అయ్యో! ఎంతపనిజరిగెను? ఓరీధనవర్మా! నీవెంతకిరాతకుఁడవురా! నిన్నేమి చేసినను పాపములేదు. (తలపంకించుచు)

చం. జననిభరింపగోముగనుఁ ♦ జక్కఁగఁబెర్గెడు చిల్కబల్మిమై
గొని గృహపంజరంబువనుఁ ♦ గూర్చి పడంపడి సేవగించిడా
నినివిడనాడునట్టియతి ♦ నిర్దయుభంగి సరోజినిన్ గృహం
బునఁజెఱఁబెట్టిమూఢ! పుర ♦ మున్ విడనాఁడఁగఁజేసి తేతుదిః.

అక్కటా! ఆమె యెందువ్రాయెనోగదా!

గీ. తన్నుఁగామించి మోహించు ♦ నన్నువీడి
పిన్నతనమునఁబెంచిన ♦ పితనువీడి
యాసరోజిని యెచటికో ♦ యరిగెనకట
తరుణి బ్రదుకింకఁజూడ వ్య ♦ ర్థంబుగాదె?

ఆమెజీవించియుండెనో, లేక గతించెనో.

గీ. ఒకతెగతిలేక విలపించి ♦ చకితహృదయ
యగుచువనములఁబోవంగ ♦ మృగములరసి
తినెనో? శోషించెనోదాహ ♦ తీవ్రమునను?
దాన్ప్రాణంబుదొలఁగెనో ♦ దైవవిధికి?

కల — సోదరా! నీవుతుదిని వచించినది మాత్రము కాలేదని యను కొందును.

ప్రభా — ఎందుచేత? నేనుఁబ్రేమించితినని యట్లనుచుంటివా యేమి?

కల — కాదు. ఆమెను బహిష్కరణము చేసినపిదప ధనవర్మ కూతురు కమలిని సరోజినీపక్షమునఁ జాలవరకుఁ బ్రార్థించెను. చివరకు వీతాశయై సరోజినిని వీడలేక యిరువురునుఁగలిసి యారాత్రియే యంతిపురి వీడిరి.

ప్రభా — మేలుకమలినీ! మేలు నెయ్యమన్ననీయదియేగదా! తరువాత.

కల — తరువాత వారిరువురు మారువేషములతో నీయరణ్యముఁ జేరిరని యేకింవదంతి.

ప్రభా — (తటాలునలేచి) ఈయరణ్యమునదేనా? నాకెందునుగనఁబడలేదే

కల — నీవు సరోజినియనిపిలుచు నాతనిముఖముఁ జూడఁగా స్త్రీముఖ లక్షణములు నాకుఁగనఁబడినవి. అతనితోనుండుస్త్రీరత్నమునుఁ జూడఁగాఁ గమలిని యనుకొంటిని.

ప్రభా — సోదరా! అట్లైనచో నన్నిన్నాళ్లుపీడింతురా! ఆతఁడు సరోజిని యేమైన రహస్యములోనైనఁ దనసంగతి వ్రాకువ్వదా? నాకేమియు ననుమానములేదే. నీవు భ్రాంతిపడుచుంటివి.

గీ. ఒకనిఁబోలెడు మనుజుఁడిం ♦ కొకఁడుజగతిఁ
గనఁబడుచునుండు దూరానఁ ♦ గాంచునపుడు
కడకుసత్యంబుఁదెలియుడ ♦ గ్గఱకుఁబోవఁ
బటికయునుఁబటికబెల్లంబు ♦ పగిదిగుచిని.

ఆ సంగతి యటుండనిమ్ము. తరువాత.

కల — ఆ తరువాతఁ దనపుత్రికయు సరోజినియుహఠాత్తుగా మటుమా

యమైరనియు వారిరువురును నిన్నుఁగూర్చి యంతకుముం దొక నాడు ముచ్చటించుకొనుచుండిరనియు విని ధనవర్మకోపాగ్నిఁ బ్రజ్వరిల్లుచు నిన్నుఁబట్టి తెప్పింపుమని మంత్రికి నాజ్ఞాపించె.

ప్రభా—ఔరా! ధనవర్మా! నేనచట నిజముగా నుండిన నీపాట్లుకనఁబడి యుండునురా. తరువాత.

కల—తరువాత నీవు పురమున లేవని తెలిసికొని నన్నుఁబట్టి తెప్పించు కొనియె.

ప్రభా—నహ్వా! ఇది మఱియు బాగున్నది.

గీ. తప్పుచేసినవానిచే ♦ తంబుమిగులఁ
బాడుచుచుండునుసూదియు ♦ వ్రాలెనెపుడు
దానవిశ్రాంతిలేకయు ♦ ధర్మమూని
పరులఁబీడించునతఁడు పా ♦ పంబునాక.

తరువాత,

కల—తరువాత నేనతని యెదుటఁజేతులు జోడించి నిలువఁబడ "ఓరి ద్రోహీ! నీతమ్మునిఁ దక్షణమప్పగింపవేని నీసార్వస్వమునంతయు నా క్రమించుకొనెదము" అనిపల్కెను.

ప్రభా...ఓరీమూఢా! ధనవర్మ! నీకు న్యాయాన్యాయవిచక్షణ యించుకయైన లేదురా! సోదరా! తరువాత,

కల...తరువాత నేనుభయమున గజగజవడఁకుచు "దేవా! మల్లయుద్ధమైనపిదప నాతమ్ముని నేనుఁజూడలేదు" అని యెన్నిసార్లు నొక్కి చెప్పినను వినక మనసార్వస్వమునంతయు నాక్రమింప సేనానికి నాజ్ఞయిచ్చి నన్నూరిబైటకుఁ దరిమించెను.

ప్రభా—మన సర్వస్వము నాక్రమించుటకా మూఢుఁడిదియొకమిషపన్ని నాఁడు. వానిని సంహరించుటకుఁగూడ నాకీమిషయే చాలును తరువాత,

కల—తరువాత నేను నీవచటనుండినచో నింతయపాయము వాటిల్లకుండునుగదా యని నాబుద్ధిజాడ్యమునకు విచారించుచు నిన్నుఁ గను

నభిలాషతో నీ వనములంబడివచ్చుచు శరీరప్రయాసమున నా మఱ్ఱిచెట్టుక్రిందఁబన్నుంటిని. నీవప్పుడటు రాకున్న నాప్రాణము లుపోయియే యుండునుగదా. తక్కిన కథ నీకుఁదెలిసినదే.

ప్రభా—సర్వమును దెలిసినది. ఇదిగో శపథము.

కం. ధనవర్మఁజంపినైనను
మనస్వాస్థ్యము మనకుఁదెచ్చి ♦ మనజనకునిదా
ఘనకీర్తి నిలుపువాఁడనుఁ
గనుమాంహా బాహుబలము ♦ కనువిందొనరన్.

కల—సోదరా? తలఁచికొనిన నీవంతటివాఁడవేయగుదువు. నాకుఁగల యింకొక చిన్న కోరిక నీతోఁజెప్పుటకు సిగ్గుపడుచున్నాను.

ప్రభా—అగ్రజా! సిగ్గుపడవలదు నాచేతనైనఁ దీర్చెదను.

కల-కం నీకుసరోజినిపైబలె
నాకాపుష్కరిణిపై మ ♦ నంబురహించెన్
ఆకాంతయుననువలచెనుఁ
బ్రాకటముగ మమ్ముఁగూర్ప ♦ వలయునుఁగూర్మిన్.

మఱియు,

చం. అడవిని మృత్యుగర్భగతుఁ ♦ డైనసహోదరునన్నుఁబ్రోవఁగాఁ
గడుఘనమానె? మోహపృథు ♦ కాననమందుమనోజలుబ్ధకుం
డడరుచుఁబన్ని నట్టివల ♦ యందునఁ జిక్కినపిట్టనై తివి
య్యెడననుఁగాచిప్రోచుటయ ♦ హీనయశస్కర కృత్యమాఁజుమీ.

ప్రభా—(నవ్వుచు) ఇదియెంత చిత్రము! సోదరా?

ఉ. కాంచుటయే సుందరినిఁ ♦ గన్నులవిందుగ? నామెనీవుమో
హించుటయేది? నిన్నువల ♦ పించుటయేదియునంగుఁ; డద్దిరా
పంచశరప్రబోధముల ♦ పారరహస్యములద్భుతక్రియా
దంచితదిగ్జయాఢ్యముల ♦ నర్గళతీక్ష్ణతరాజ్ఞలుంగదా.

కల—క్షణమాత్రములో మాకిరువురకుఁ బరస్పరానురాగ మెట్లుగలిగినదనియానీసందేహము. కోపపడకుము.

గీ. నీవు మోహింపలేదొక్కొ ♦ నిముషమునను
నాసరోజిని పద్మాయ ♦ తాక్షినాజి
నట్టిమోహంబు లేచాల ♦ గట్టివాచు
జగతినాచంద్రతారకం ♦ బగుచునిలుచు.

ప్రభా—(సంతోషముతో) నీవన్నది నిజమే. అందుచేతనే మన్మథాజ్ఞలు నిరంకుశమైనవని చెప్పుచుంటిని. గాని,

గీ. కులమునఁజూడనాకాంత ♦ గొల్లపడఁతి
భాగ్యముగణింపఁబూజ్యంబు ♦ పరువెసున్న
గుణములప్రాహ్యములునింత ♦ కునుదలంప
నట్టిదియామెనుఁజేపట్ట ♦ నగునెమనకు.

నన్నంటివానసరోజిని రాజపుత్రికయనియు భాగ్యవతియనియు నెఱుంగుదు. లక్షణవతియని వింటిని. అందుచే మోహాంకురమును రసపోషణచేసి పెంచితిని. ఇది యుట్టిది కాదే?

కల—కాకున్ననుసరే! పరస్పరము ప్రేమించితి రంతియేచాలు.

గీ. పడఁతితోఁగూడనేగొల్ల ♦ వాఁడనగుచు
నిచటనివసింతుమేకల ♦ నెంచుకొనుచుఁ
దండ్రిస్వాస్థ్యంబు రాఁబట్టి ♦ తమ్ముఁగుఱ్ఱ!
యనుభవింపుముపట్టణం ♦ బందునీవు

ప్రభా—నీ మాటలు హృదయంగమముగానున్నవి. సంతోషముతో నడిగెదనుఁజెప్పుము మీకిరువురకు మోహమెట్లుకలిగె ?

కల—నీ సందేశమునుఁగొని సరోజినికడకు నేఁబోయినప్పుడా పుష్కరిణిని నచటఁజూచితిని. అంతలో మారుఁడు దండెత్తెను.

గీ. కనులుమన్మథదూతలై ♦ కథనునడపె
మందహాసాంకురంబుల ♦ మందమోహ
పూరమునువెలికిఁజిమ్మెన ♦ పారముగను
శిరములంగీకృతంబుసూ ♦ చించెఁబిదప.

ప్రభా—సోదరా! బాగుగఁజెప్పితివి. అట్లయైన నాకునుసమ్మతమే. కిరి

నర్మమహారాజసమక్షమున నెల్లి నీ వివాహలగ్నము జరగించెదను. నీవు సంతోషముననుండుము. (ముఖమెత్తి) అదిగో నా సరోజిని నన్నుఁజూచుటకుఁ గాఁబోలు నిటువచ్చుచున్నది.

(అంతసరోజిని ప్రవేశించుచున్నది).

సరో—కలహంసుఁడా! నీకు శుభమగుఁగాక.

కల—మిత్రమా! నీ దయయున్నచో నేలకాకుండును? కార్యాంతరమునఁ బోవలసియున్నది. పోయివచ్చెదను. (అనిపోవుచున్నాఁడు.)

సరో—ప్రభాకరా! సింహముతోఁ బోరాడునప్పుడు నీహృదయమునకు గాయములు తగిలెననుకొంటిని. అన్నా! నీయన్నకొఱకై యెంత కష్టపడితివోయి! నా నోములు ఫలించుటచే నీవుపునర్జీవితుఁడవైతివి.

ప్రభా—సరోజినీ! నీవన్నట్లు నాహృదయమునకు గాయములు తగిలెనుఁగాని యవి సింహము మూలమునఁగాదు.

సరో—మరిదేనివలన,

కల—సీ. సింహనఖములగాయంబుఁ ♦ జెందలేదు
నాదుహృదయంబుమఱిఁజెందె ♦ నవసుమాస్త్రు
రూక్షబాణాఘములునాస ♦ రోజినీక
టాక్షపఙ్క్తులచేతఁ బ్ర ♦ త్యక్షముగను

సరో—మహాశూరుఁడు మఱియొకలాగున్నఁ జెప్పునా? అవునుగాని నీయాపత్తువిన్నప్పుడు. నేనొనర్చిన మూర్ఛాభినయచమత్కారము మీయన్న నీకువివరించెనా?

ప్రభా—(మందహాసముతో) దానినేకాదు. ఆ చమత్కృతి కన్నమిన్నయగు నింకొకటిఁగూడవివరించెను.

సరో—(నవ్వుచు) నీవూహించునది నాకు మనోగోచరమయ్యె. అది నిశ్చయమే. అంతసద్యఃఫలితమై పరమాద్భుతము పుట్టించిన మోహవిషయము నేనెప్పుడుఁగనలేదువినలేదు.

గీ. మారుఁడప్పుడు క్రొవ్వాడి ♦ నారసముల
నూరిజోడించిగుప్పించె ♦ సారసాంగి
పుష్కరిణిపైనినంతనీ ♦ పూర్వజన్మ
పైనివారిర్వురునుఁగూడ ♦ వశముగాఁగ.

ప్రభా—పరమాద్భుతమే. అదియంతయు మన్మథవిలాసము.

సరో-(చిఱునగవుతో) సత్యమే.

గీ. ఒకరొకరిఁగల్సుకొనుటయే ♦ యొండొరులనుఁ
గాంచుటయ్యోననదియెమో ♦ హించుటయ్యె
నదియస్మరతాపకారణ ♦ మయ్యెనంత
నేమిచెప్పుదుమదనుని ♦ సాములవుడు.

చివరకు వారిరువురు మనోనిశ్చయములఁదేలి వివాహాభిముఖులై యున్నారు.

ప్రభా—ఇది శుభసూచకమేగదా! మాయన్న కలహంసుఁడు నాతోఁ దనకోరిక వెల్లడించినాఁడు. రేపే వివాహలగ్నము కీర్తివర్మ మహారాజ సమక్షమునజరుగును. (గాంభీర్యముతో) అన్నా! విధిచిత్రములు,

గీ. నాసరోజినితోఁబెండ్లి ♦ యానతీర
నొవరునిఁకనంచునువ్విళు ♦ లూరుచుండ
జరుగుమాయన్నపెండ్లి ముం ♦ దరనె రేపె
తానొకటికోరదైవంబు ♦ తలఁచునొకటి.

అయినను నాకుఁబరమసంతోషమే న్యాయశాస్త్రప్రకారము ముందు మాయన్నకుఁ గావలసినదేగదా.

సరో-(నవ్వుచు) పాపమునీకుఁగూడ సరోజినినిఁ దక్షణమే పెండ్లిచేసుకొనవలయునసియున్నది కాఁబోలు. మీయన్న పెండ్లిసమయమునందు నీకువిచారముగానేయుండును.

గీ. గాఢమోహంబుచేతవి ♦ కారహృదయుఁ
డైననీవెట్లుచేసెద ♦ వన్నపెండ్లి

వారలిరువురు జేరి వి ♦ వాహ వేది
మీఁదఁగూర్చుండఁడనీకు స ♦ మ్మోదమగునె?

ప్రభా- నాకసూయ యనుకొంటివా యేమి?

సరో- కాదుకాదు. నీకుఁబెండ్లికాలేదనువిచారము.

ప్రభా- ఇప్పుడుదానికివిచారించి యేమిసేయను?

సరో- నన్నుఁబెండ్లియాడుము. నేను సరోజినినేగదా.

ప్రభా-(తనలో) అన్నా! ఈపురుషుని సరోజినియనిపిల్చుట కంగీకరించుటవలన నిప్పుడుకష్టముసంభవించినదే. (ప్రకాశముగా) అలీకసరోజినీ! నీవుచెప్పినమాట బాగున్నదా?

చ. పురుషునినిన్నుఁజూపియిది ♦ ముద్దియ, నేనువరించితిన్ వధూ
వరులముమేముగూడనువి ♦ వాహముకాఁగఁదలంతుమంచునే
వరుసవచించువాఁడను స ♦ భాసదులందఱుకేళిసేయరో!
విరసుఁగాఁగణింపరొకో! ♦ వెంగలినంచుఁదలంపరోనను౯.

సరో-(గంభీరముగా) ప్రభాకరా? గట్టివాఁడవే! మసిపూసిమారెడుకాయచేసితివే! నన్నిదివరకేగాంధర్వవిధిగాఁ బెండ్లియాడలేదా? నీయుంగరమునాయొద్దలేదా? ఇప్పుడుపదిమందిలోనన్ను భార్యయని చెప్పుటకుఁ గష్టముతోఁచెనా యేమి?

ప్రభా- నామాటయెట్లున్నను బురుషుఁడవైన నీవింకొకపురుషుని నన్నుభర్తయనిచెప్పుటకు సభాస్థలమున నీకుసిగ్గుగాదా ? ఇంతమాత్రమాలోచింపవేమి? అనుకొనినంతమాత్రమున మనమిరువురము భార్యాభర్తలమగుదుమా?

గీ. తిండిఁదినకుండమనసులోఁ ♦ దింటిననుచుఁ
దలఁచియెన్నాళ్ళుజీవింపఁ ♦ గలఁడుమనుజుఁ
డట్లెనినునాసరోజిని ♦ యంచునెంత
కాలమిట్లులనోర్వంగఁ ♦ గలనుఁజెపుమ.

సరో-(తనలో) నాకును నీరహస్యవృత్తికష్టముగానేయున్నది. నేనును రేపేబయలుపడెదను. (ప్రకాశముగా) ప్రభాకరా? నీవన్నదియా

లోచించుకొనఁగా సత్యముగా నెతోఁచినది. ఇంక నేనును నిన్ను వృథాసంభాషణముల నాయాసపెట్టఁదలఁచుకొనలేదు.

గీ. ఎఱుఁగుదును నిన్ను సద్గుణా ♦ కరుఁడవనుచు
శ్రమము నేనికఁ గూర్పంగఁ ♦ జాలనీకు
నీదు ప్రాణేశ్వరి సరోజి ♦ నీలతాంగిఁ
దెచ్చి పెండ్లియొనర్తుఁ సం ♦ తృప్తి నెల్లి.

ప్రభా-(హర్షముతో) మిత్రమా ! ఆమె యెక్కడనున్నదో నీకుఁ దెలియునా? నీ వామెను రేపటికిఁ దీసుకొని రాఁగలవా ? ఏమి సాహసము ?

సరో- రేపు చూతువు గాక.

గీ. చిన్నతనమున శుశ్రూషఁ ♦ జేసి యొక్క
గురునిఁ బడసితి నతఁడిచ్చె ♦ వరము లెన్నొ
కానఁ గాలత్రయస్థితి ♦ కనులఁ గట్టి
నట్లెయుండును నాకు స ♦ త్యంబు జువ్వె

అదియునుగాక నాపినతండ్రియు మంత్రశాస్త్రవేత్త. ఆయన యొఁగొన్ని రహస్యంబులు నాకుపదేశించె. కావున నీసరోజిని యెక్కడనున్నదో యేమిచేయుచున్నదో యిప్పుడు నేనుజూచుచున్నాను. అదృశ్యాకారమునఁ బోయి హనుమంతుఁడు సంజీవిని బలె నీప్రదేశమునకు నిరపాయముగా నీసరోజినిని దెల్లవారువరకుఁ దెచ్చియుంచెదను. నీవును నీయన్నతోఁగూడఁ బెండ్లిప్రయత్నమున నుండుము.

ప్రభా-మిత్రమా ! నేను నిన్నుఁ బెండ్లియాడ నంటినని యిట్లు పరిహాసము చేయుచుంటివా? లేక నీవన్నది సత్యముగా జరగునా? నాకంతగా నమ్మకము లేదు.

సరో-ఉండని మాట సత్యమే. అమానుషములును నదృశ్యములును నశ్రుతములును నీకాలమున నెవ్వరు విశ్వసింతురు ? నీవు మాత్ర మీవిషయమున సందేహింపకుము.

ప్రభా-(తనలో) ఇది సత్యమే యయినయెడల నీతఁడు నాపాలిటి దైవముగా

ని శ్నేహితమాత్రుఁడా? నాపుణ్యమెట్లుండునోచూచెదను. (ప్రకాశముగా) సందేహింపను. నీప్రసాదమునకయి నిరీక్షించుచుందును.

[అంతటసానందతో నానందుఁడు ప్రవేశించుచున్నాఁడు]-

సరో-ఆనందా? నిన్ను సానందవలచినదా?

ఆనం-ఓయయ్యా! ఇటునటుచెప్పక నన్ను బాధంచుచున్నది. కఱ్ఱవిఱుగదు- పాముచావదు.

సరో-ఇఁకముందేమిసేయుదువు?

ఆనం-ఇదివరకెట్లోయట్లే.

గీ. భాండములునిండెనాదుఃఖ ♦ బాష్పములకుఁ
గాలెనిండులునిట్టూర్పు ♦ గములచేత
నిదియెనే నేర్చుకొన్నట్టి ♦ చదువుమోహ
పాఠశాలనుగడ కేమి ♦ ఫలమొగాని.

సరో-సానందా? నిన్ను మోహించియిన్నాళ్ళాశ్రయించిన యానందుని కిదియేనాఫలితము ? ఇంతకన్నగొప్పవాని నెవరినయినవరించితివా యేమి?

సానం-ఇంకెవరిని- మిమ్ములనే?

సరో-నన్ను వరించితివా?

సానం-అవును.

సరో-నేనునిన్నుఁగోరలేదే? నాకెందుకు?

సానం-ఇప్పుడుకోరవచ్చును. కాలదోషమువట్టలేదు.

సరో-ఏకారణముచేతనైననేను నిన్నుఁబెండ్లియాడుటకు వీలులేకున్నచో నానందుని పెండ్లియాడెదవా?

సానం-అంతవీలులేకున్న నట్టులేచేసెదను. కారణముచెప్పుఁడు.

ఆనం-పరమసంతోషము. ఓయయ్యా! త్వరఁగాఁజెప్పుఁడు.

సరో-సానందా! నీకారణముతృప్తిగానున్న నంగీకరింతువుగాని దానిని

రేపుచెప్పెదను. నీవన్న మాటకు బద్ధురాలవుకమ్ము రేపునీపెండ్లి కూడనిచట నేజరుగును.

సానం-నాపెండ్లికిప్పుడింతతొందర యేమి?

సరో-రేపుమంచిముహూర్తము. మన ప్రభాకరసరోజినులకును గమలినీ కలహంసులకునుగూడ గీతివర్మమహారాజుగారి సమక్షమున బెండ్లిజరుగును. కావున నీవుసిద్ధముగానుండుము.

సానం-మంచిదియట్టులే.

సరో-(రహస్యముగా నానందునితో) రేపుపెండ్లికొడుకువై సిద్ధముగా నుండుము. (ప్రకాశముగా) ఇంకమీరుబోవచ్చును.

సానం-<br>ఆనం- } చిత్తము (అని పోవుచున్నారు).

సరో-ప్రభాకరా! మనమునుబోవుదము రమ్ము.

(అనిప్రభాకరునితో నిష్క్రమించుచున్నది).

రంగము 2 - అరణ్యమందలి సరోజినీగృహము.

(కమలిని ప్రవేశించుచున్నది).

కమ.(తనలో) అన్నా! మన్మధమాయ! మేమిరువురమును నీవనముజేరి నది వివాహములనిమిత్తమా! దైవికముగా నేనాకలహంసునిం గాంచినప్పటినుండియు నాకాతనిపై మోహమంకురించి మనస్సునకువికారము కలిగించెను. మా చెల్లెలుసరోజిని ప్రభాకరునిమోహించినట్లే నేనుగలహంసుని మోహించితిని. ఆతడును ప్రభాకరునితోడబాటు భాగ్యవంతుడేగదా! వెనుకటివలెగాక యిప్పుడు సజ్జనుడయ్యెనుగదా! శౌర్యమునకా చూచుకొందము. రూపమునజక్కనివాడే. మఱియు,

గీ. అక్కచెల్లెండ్రమిరువుర • మొక్కమొగిని
నన్నదమ్ములబెండ్లాడ • నబ్బెమాకు
బరమసంతోషమయ్యె నే • ర్పాటువలన
గలిసియుందుము పెండ్లైన • గానినేము.

(అంతసరోజిని ప్రవేశించుచున్నది).

సరో-అక్కా! కమలినీ! నీముఖమిప్పుడు మిక్కిలి వికాసముగనున్నదే?

కమ-(నవ్వుచు) అట్టులా! నీదిలేదో? ఎక్కడకుఁబోయితివి? ఏమివిశేషములు?

సరో.(సంతోషముతో) శుభములపయి శుభములు దొరలుచున్నవి.

కమ-ఎట్లు?

సరో-నీకుఁదెలియదా? మనకిరువురకును రేపె ప్రభాకరకలహంసులతోఁ బెండ్లిజరుగును.

కమ-(వికాసముతో) రేపేనా?

సరో-రేపే- సర్వమునాయత్తమయినది. నీవుశృంగారించుకొని సిద్ధముగానుండుము.

కమ-(సంతోషముతో) సోదరీ? రేపునీపురుషవేషముమార్చి నాసరోజినివయ్యెదవా?

గీ. ఎంతగ్రంథంబునడపితి ♦ వీయపూర్వ
వేషమునసీవుదీనిని ♦ విడిచియింక
నైజకాంతాకృతినినాస ♦ రోజినివిగ
మాతెదవుగాదె రేపుక ♦ న్యండువుగను.

సరో-నీకుసంతోషమయిననాకుఁజాలును. ఇంతవరకును నేనుప్రభాకరునికి మగవానినను నమ్మకముకలిగించితిని. మఱియు నేనుమాంత్రికుఁడననియు నామంత్రబలముచేత సరోజినిని రేపటియుదయమునకుఁ దీసుకొనివచ్చెదననియు నమ్మించివచ్చితిని.

కమ-నీవెంతకయినఁదగుదువు.

సరో-రేపుమనతోఁగూడ నానందసానందలకుఁగూడఁబెండ్లి.

కమ.పోనీపాపము.చాలసంతోషము.

సరో-అన్నిటికన్న సంతోషమిా పెండ్లిండ్లుమూఁడును మాతండ్రిగారి సమక్షమునజరగును. హాతండ్రీ!

గీ. నిన్నుఁజూచునదృష్టంబు ♦ నేటికబ్బె
దైవకృపచేతఁ; బండెమా ♦ తపములన్ని
వనమునందున్నఁగాని భ ♦ వత్సమక్షు
మందెశుభములుజరగు భా ♦ గ్యంబుకలిగె.

కమ-సోదరీ! నిజమే. రేపుమనకు మహాభ్యుదయముసుమా. కానినాన్న నుఁజూచినమనకు సిగ్గగునేమో.

సరో-నీవన్నదినిజమే. అయిననేమిచేయవచ్చును. తరువాత నాయనకుఁ గూడసంతోషముతప్పక కలుగునుఁగద. ఇఁకమనముచేయవలసిన పనులు చాలనున్నవి. పోదమురమ్ము.

(అనికమలినితో నిష్క్రమించుచున్నది).

రంగము 3 - ఇంకొకయరణ్యభాగము.

[కీర్తివర్మ, సూక్ష్మబుద్ధి సులోచనుఁడు మొదలగువారునుఁ
ప్రభాకరకలహంసులును ప్రవేశించుచున్నారు].

కీర్తి-ప్రభాకరా!

చ. పురుషుఁడెవండొనాదుహిత ♦ ముద్దులగుమ్మసరోజినిసిఁ భవ
త్వరముగనేడెచేయునని ♦ పల్కితివానుడులెల్లనాకున
చ్చెరువుఘటింపఁజేసెనది ♦ చెల్లునెసత్యమెయంచునోప్రభా
కర! మఱినాకుసందియము ♦ గల్గెసరోజిని యెట్లువచ్చెడిఁ?

ప్రభా—దేవా!

గీ. అతనియుక్తులకేనెదు ♦ రాడలేమి
నమ్మెనప్పటికిని నామ ♦ నంబుగూడఁ
బిదపసందేహభయములు ♦ బెనగొనంగ
నిప్పుడునిరాశఁబొందునా ♦ హృదయమరయ.

సూక్ష్మ-ప్రభో! నిజముగానాతఁడు మంత్రవేత్తయేయయిన తప్పక సరోజినినిఁదెచ్చును.

కీర్తి-అన్నా! సరోజినియేమి! వచ్చుటయేమి? అంతభాగ్యమీకన్నులకేనా?

గీ. స్వప్నమునవిన్న నాముద్దు ♦ పట్టిఁజూచి
సంతసించితినంతయే ♦ సంతసంబు
నాభవంబునకింకన ♦ న్యాయముగను
నిట్టిపేరాసఁబొందంగ ♦ నేలమనకు!

ప్రభా-దేవా! కొంచెమునిదానింతము. ఆతఁడు తీసుకొనిరాకున్నచో మీపుత్రిక యీభూలోకమున జీవించియుండిన,

క. వనజాక్షఫాలనేత్రులు
పెనురోషతనడ్డమైన ♦ విజయునిబోలెన్
ఘనబాహుబలము నెరపుచుఁ
గొనితెత్తునుమీయనుంగుఁ ♦ గూతునిచటకున్.

కీర్తి-సంతోషము.

(అంతఁబురుషవేషముతో సరోజినియు నానంద సానందలునుఁ ప్రవేశించుచున్నారు).

సరో-చ. చనిచనిమంత్రపాటవవ ♦ శంబునసూక్ష్మశరీరభారినై
యనిలజుఁడామహీజనటు ♦ లారసికానలనో ప్రభాకరా!
యనిపలవించుదానిజన ♦ కా! నన్నుఁబ్రోవవెకీర్తివర్మ! యం
చునువిలపించుదానినఁటుఁ ♦ జూచిసరోజినిఁదెచ్చితింగదా!

(అనికీర్తివర్మదగ్గఱకుఁబోయి) మహారాజా! నమస్కారము. (అని మ్రొక్కుచున్నాఁడు).

కీర్తి-చిరాయురస్తు- ప్రభాకరా? ఈతఁడేనా నీవుచెప్పినపురుషుఁడు. సరోజినినిఁ దెచ్చితిననుచున్నాఁడే.

గీ. కర్ణపర్వంబొనర్చెసం ♦ పూర్ణదక్షుఁ
డీమహామాంత్రికుఁడువంద ♦ నీయుఁడయ్య
యేమొయనుకొంటినేఁదోల్త ♦ నెట్టిపుట్ట
నేమిపాముస్నదోమన ♦ కెట్లుతెలియు.

ఓయయ్యా? విశ్రమింపుఁడు. నాసరోజినియెక్కడనున్నది. నామనస్సునసంతోషముప్పొంగుచున్నది.

సరో-దేవా ? ఇచ్చటనసమీపముననేయున్నది. ఇట్టిసమయమున మీకు సంతోషముపొంగుటంత యాశ్చర్యముకాదు.

గీ. ఆమెఁజూడంగమీకెంత ♦ హర్షదంబొ
యంతకినుమడిగల్గెను ♦ నాకొకచట
నావృతనదూడఁజూడంగ ♦ నాత్రపడెడు
కరణినదితల్లిఁజేరంగ ♦ గంతులిడదె?

కీర్తి-సత్యమువచించినావు.

సరో-మన్నింతురేని నాదొక్కమనవిగలదు.

కీర్తి-సెలవిమ్ము.

సరో-గీ. ఆసరోజినిఁదెచ్చిమీ ♦ కప్పగింప
భార్యగానిత్తురేయాప్ర ♦ భాకరునకు?

కీర్తి-ఆమెఁగనుపుణ్యమూర్తుల ♦ కబ్బునేని
నేనుఁద్రికరణశుద్ధిగా ♦ నిచ్చువాఁడ.

సరో-దీనికిఁదప్పఁగూడదు. ఓప్రభాకరా?

గీ. ఆసరోజినిఁదెచ్చినీ ♦ కప్పగింపఁ
బ్రాణములతోడుగాఁగఁజే ♦ పట్టఁగలవె?

ప్రభా- అంతభాగ్యంబునాకిఁట ♦ నమరునేనిఁ
దరుణినాప్రాణమంచునీ ♦ వెఱుఁగవొక్కొ.

సరో-మంచిది. సానందా!

గీ. నాకునిష్టంబుగల్గిన ♦ నన్నుఁబెండ్లి
యాడెదవుగాదె సంతోష ♦ మలవడంగ

సానం-నిశ్చయముగా.

సరో- కాకయుండిననానందుఁ ♦ జేకొనంగ
సంతసముగాదెనీకుని ♦ స్సంశయముగ.

సానం-ఇంకవేఱుగతియేమి?

సరో-మంచిది. ఆనందా? నీకామెనుఁ బెండ్లియాడుటకిష్టమేగదా?

ఆనం-సరిసరి. ఒకవేళమృత్యుదేవతనాకొరకయి వేచియున్నను నీమెను బెండ్లాడి మరి బోవలయునని యున్నది.

సరో-సంతోషము. ఓమహానుభావులారా! సానందా? మీరందరు మీ రన్నమాటలఁ బ్రమాణవచనంబులుగా భావించిసిద్ధముగానుం డుఁడు. మీానందేహములన్నియుఁ దీర్చుటకయి నేనిదెపోవుచు న్నాను. (అనిపోవుచున్నది).

కీర్తి-ప్రభాకరా? ఏమియీాపురుషునిమహిమానుభావములు? అయినను.

గీ. ఆతనినిఁగాంచినప్పుడా ♦ స్యంబునందు
నాసరోజినిముఖలక్ష ♦ ణములఁగంటి
నేమిచిత్రంబొగానిమ ♦ దీయహృదయ
భూమియీాప్సితసస్యాళిఁ ♦ బొదలుచుండె.

ప్రభా—దేవా?

ఉ ఈలలితాస్యునిన్ దొలుత ♦ నేనడవిన్ గనినప్డుమోమునన్
గ్రాలెడులక్షణంబులనుఁ ♦ గాంచిసరోజినియన్నయంచుధీ
శాలియటంచునెంచితిని ♦ జంబుగ; దా, వనవాసినంచునీ
బాలుఁడునొక్కపల్కఁగన ♦ బద్ధముకాదని నమ్మితిన్ మదిన్.

అంతియగాక తనపినతండ్రి గొప్పమాంత్రికుఁడనియు దాను దనయ క్కతో బహుకాలమునుండి యీావనమందు వసించుచుంటినినియుఁ జెప్పు టచే నమ్మితిని.

కల-తమ్ముఁడా? వారిరువురు కమలినీ సరోజినులవలెనున్నారని నేనుఁజె ప్పియుండలేదా? కమలిని గొల్లపడఁతియంటివే.

ప్రభా-ఆపురుషవేషధారినన్నట్లు నమ్మించినాఁడు

(అంతసరోజినీకమలినులు తమనిజాకృతులతోఁ బ్రవే శించుచున్నారు).

కీర్తి-(ఆశ్చర్యముతోఁ దనయాసనమునుండిలేచి) ఆహా ? యేమి యీా మాయాప్రపంచము. అదిగోనాపుణ్యాధనము. సరోజినియదిగో ? కమలినియదిగో? నేడుగదానాకుసుదినము.

సీ. ప్రాగ్జన్మకృతకర్మ ♦ పరిపాకపుణ్యాసు
ధాంబుధిజనితక ♦ ల్పాగమనఁగ
సత్కులీనసుధాబ్ధి ♦ జనితసంపత్కళా
లాలితశ్రీమహా ♦ లక్ష్మియనఁగ
నలఘుతరాభీల ♦ యాతనాగాఢాంధ
కారహరణదీప ♦ కళికయనఁగ
వనవాసకృతమహా ♦ ఘనమామకవినీత
పరమేశనుతితపః ♦ ఫలమనంగ

గీ. నంబుదోద్గతశంపాస ♦ రంబనంగఁ
గట్టెదుటఁ గ్రాలుచున్నది ♦ కలితచలిత
సలలితామోదవిశదభా ♦ స్వరసురూప
వైఖరినినాసరోజినీ ♦ భాగ్యమిచట.

(అనిసరోజినిఁజేరి) మద్వంశాబ్ధిరత్నమా! సరోజినీ! హానాతల్లీ? యెన్నాళ్ళకుఁగనఁబడితివి? నేనునీకుజ్ఞాపకముంటినా? అమ్మా? నిన్నొక్కసారి స్పృశింపనిమ్ము (అని తనదక్షిణహస్తముతో నామెవీపు నిమురుచు).

గీ. నీతనుస్పర్శనసుఖమున ♦ నెమ్మినాదు
హృదయదుఃఖాగ్ని చల్లారె ♦ నింతవంకు
మరలఁగాంచితిమత్పుణ్య ♦ మహిమవలన
నిన్ను మృతజీవతుల్యగా ♦ నెన్నుదాని.

సరో-(పాదములకు మ్రొక్కుచు) మీయుత్సంగతలము వీడినదనుకఁ బెక్కుకష్టములఁబడితిని.

గీ. నన్ను మీకెడఁబాపుచు ♦ నాపితృవ్యుఁ
డవలఁ జెఱసాలఁ బెట్టినాఁ ♦ డకట; కుంద
కుజమునజనించుసుమమును ♦ గోసియవల
వేనలినిఁ గ్రుచ్చియాలయించు ♦ చానవ్రాలె.

ఆవలనన్ను రాజద్రోహురాలగా భావించి దేశబహిష్కరణమొనర్చె. నాప్రాణమగు నీకమలిని నన్నువీడలేక తోడునీడయయ్యె. తరువాతసంగతి నెమ్మదిమీద మనవిచేసెదను.

కీర్తి-కల్యాణమస్తు. కమలినీ? నాకన్నకూతుసరోజినికంటె నీవేమెక్కు-డుదానవుసుమా. (అనిచేరఁదీసి).

గీ. తోడునీడగనీవునుఁ ♦ గూడనుంట
బొందిలోనిల్చెజీవమిా ♦ సుందరకినిఁ
గాకయుండిననేనెట్లు ♦ గాంతునీమొఁ
గానినీవెక్కు-డాత్మజ ♦ కన్న నాకు.

కమ-(వందనముఁజేయుచు) తండ్రీ? యిందులో నెక్కు-వతక్కు-వలేమియున్నవి. మేమిద్దరమునుమిాకుఁ బుత్రికలమే.

కీర్తి-కల్యాణమస్తు- సరోజినీ నిన్నుఁగొనివచ్చినయామహాపురుషుఁడెట నున్నాఁడు. ఆతఁడురాలేదే?

సరో-(శిరమువంచుచున్నది).

కీర్తి-(సంశయముతో) అదియేమి?

కమ-నాయనా? క్షమింతురేని మనవిచేసెద.

కీర్తి-అమ్మలారా? క్షమించుటకు మిారొనరించినయపరాధమేమి?

కమ-చ. అమలయశఃప్రకాశ! వినుఁ ♦ డయ్య! సరోజినిదేశకాలపా
త్రముగఁబురంబువీడుతరిఁ ♦ దాల్చెనుఁబూరుష వేషమట్టులన్
గమలినిపేరుమానియిటుఁ ♦ గాంచితిఁబుష్క-రిణీసమాఖ్యనే
నిమ్మముఁగనసట్టిమావయిన ♦ నేరములన్ క్షమియించికావరే?

కీర్తి-(సంతోషముతో) ఆహా ! సరోజినీ ! యెంతశ్లాఘ్యమయినపని చేసితివి.

మ. అనుమానించితినిన్నుఁజూడఁగనెక ♦ న్యారత్నమా?ముందె;యీ
వనమందున్నికటంబునన్ మెలఁగుని ♦ ర్భాగ్యుండునీతండ్రినిన్
గనులారఁగనసిగ్గుచెందితె?మహా ♦ కష్టంబులంబొందితో
యనుగుంగూతుర!నిన్నుఁగూర్చియిఁకనే ♦ మందున్ విధిన్నిర్దయున్.

ప్రభా-(తనలో) ఆహా? సరోజిని నన్ను మోసపుచ్చెనే ? ఈమెయెంత చమత్కా-రిణి? మాయన్నవచించినదిసత్యమే. మోహాంధతచేఁగని పెట్టలేకపోయితిని.

చ. పురుషుఁడటంచు నమ్మితిని ♦ బుద్ధి చలించె సరోజినీ సతీ
గురుతరయుక్తి వాక్యముల ♦ కుఁ బదులాడఁగ లేమి నక్కటా
పరువము వీడి బేలనయి ♦ పల్కినపల్కులకింక మీఁద నుం
దరి యొకసక్కమున్ నెఱప ♦ నాకు దిచిన్న తనంబుఁ బొందదే?

సరో-(సిగ్గుతో) నేనుఁ జేసిన యపరాధముల కన్నింటికి నేని దేయొక్క మ్రొ
క్కుగా మ్రొక్కుచున్న దాన.

కీర్తి-నీవు చేసిన యపరాధ మేమియును లేదు. అంతియగాక యీపురుష
వేషమున నిష్కల్మషముగా నీ సతీత్వము కాపాడుకొంటివి.

(అంతఁ దెరలోపలఁ గలకలము).

చ. సురుచిరమూర్తి? శుభ్రగుణ ♦ శోభిత? యోఘనకీర్తివర్త? యిం
దిరలు సరోజినీకమలి ♦ నీతరుణీమణులారయన్ ప్రభా
కరకలహంసులాహరిని ♦ కాఁగులు వారికి వారి నిచ్చి సు
స్థిరతరరాజ్యసంపదలఁ ♦ జెందెద వింద్ర కృపాకటాక్షితన్.

మేము శ్వేనీదేవతలము. మమ్ము దేవేంద్రుఁడు పనుపఁగా నిఁటవచ్చినార
ము. నీకు శుభమగుఁగాక. మేము పోవుచున్నాము.

కీర్తి-ఓహో? మహేంద్రుఁ డునన్ననుగ్రహించినాఁడా? వారి ప్రసాదమ
లంఘ్యనీయమైలభించును. ఓయిశ్వేనీదేవతలారా? నమస్కార
ము. దేవేంద్రాజ్ఞాప్రకారమీకన్యామణులకు వివాహము చేసె
దను. సరోజినీకమలినులారా? మిమ్మిరువురను వ్రాప్రభాకరకల
హంసులకు వరుసగానిచ్చి యిఁటవివాహ మొనర్చెద.

సరో, } మీ యనుగ్రహమే మాప్రసాదము.
కమ, }

కీర్తి--సానందా! ఇఁక నీవు తప్పక యీనందునిఁ బెండ్లియాడవలసినదే.

సానం—చిత్తము.

కీర్తి—అట్లయినసరియే. మీరిఁక జాగు చేయక మీకేర్పఱుపఁబడిన వివా
హ వేదికలపైఁ గూర్చుండుఁడు. ప్రభాకర కలహంసులారా! మీరు
గూడ నట్లు సేయుఁడు.

(వధూవరులందఱు నట్లుజేయుచున్నారు).

కీర్తి—(తనలోవిచారముతో)

చం. ఘనతర రాజ్యసంపదలఁ ♦ గ్రాలి మహోన్నతవృత్తినుండునే
ననుఁగుఁగుమారికిన్ గడకు ♦ నందముచందము లేకబీదయౌ
జనునిబలెన్ మహోత్సవము ♦ సర్వముశూన్యము సేసియక్కటా!
వనమునమూఁడుమూలనువి ♦ వాహముఁ జేసెదఁగాలవక్రతన్.

ఇఁకవగచిన ఫలమేమి? వధూవరులు గాఢానురాగబద్ధులై సంతోషముఖులై విలసిల్లుచున్నారుగదా. మనము విచారింపఁగూడదు. (ప్రకాశముగా) సూక్ష్మబుద్ధీ! నీవునాతో వెనుక సామగానము వచ్చునంటివి గదా? ఇఁట నీవే వృద్ధబ్రాహ్మణుఁడవు వేదికలకడకుఁబోయి వైదిక కర్మము నెఱపుము.

సూక్ష్మ—చిత్తము (అనిపోయి యట్టులనేచేసి) దేవా! సర్వముసంపూర్తి యయినది. ఇఁకవారు తలఁబ్రాలు పోసుకొనవచ్చును- మీరాశీర్వదింపవచ్చును.

కీర్తి—సంతోషము. రాజచిహ్నము లేవియు లేకపోయిననుఁదండులాభావమైన యీఘోరారణ్యమునందుఁ దలఁబ్రాలుగా మంచిముత్యములు మాత్రములభించినవి. మీరాముక్తాఫలములఁ దలఁబ్రాలుగాఁ జేసికొనుఁడు. (అట్లుచేయఁగాఁ జూచియానందించి) నేనిప్పుడపారానంద పారావారనిర్మగ్నుఁడనైతిని.

గీ. వధువుమీకీర్తియిట్టులె ♦ పరిఢవిల్లు
ననెడుగతివరుపైని ము ♦ త్యములఁబోయు
వరుఁడునీవిట్టిసుతులనుఁ ♦ బడసెదంచుఁ
బల్కుగతిము త్తెపున్ సేసఁ ♦ బ్రాలుజల్లు.

ఇఁకఁజాలును. వధూవరులందఱు మాకందఱకు వేర్వేఱుగ నమస్కరింపుఁడు. (వధూవరు లట్లుజేయుచున్నారు.)

కీర్తి—(దంపతులను స్పృశించుచు.)

కం. చిరకాలమిట్టులవధూ
వరులయిశాశ్వతసుకీర్తి ♦ వరలుచుశోభా
కరులయిసంతానంబునఁ
గరమరుదుగఁగాంచుఁడీ సు ♦ ఖంబునమనుఁడీ!

(అనిసరోజినీ ప్రభాకరులనుగమలినీకలహంసులను దీవించి) సానం దానందులుగూడఁ జిరకాలముజీవించి పుత్రపౌత్రాభివృద్ధి గనెదరుగాక (యని యాశీర్వదించుచున్నాఁడు.)

సూత్ర—(నమస్కారములనందుకొని)

గీ. పెద్దకాలంబుజీవించి ♦ పిన్నపెద్ద
తనములారసియనురాగ ♦ వనధిమునిఁగి
కలిసిమెలఁగుచుసంతాన ♦ ఫలములంది
మమ్ముబోటులదయఁబ్రోచి ♦ మనెడుఁగాత.

(అనియాశీర్వదించుచున్నాఁడు.)

సులో—(వందనములఁగొని) శశ్వత్సౌభాగ్యమస్తు సుపుత్రావాప్తిరస్తు.
(అనిదీవించుచున్నాఁడు.)

కీర్తి—కమలినీ సరోజినులారా! మీకిట్లుఘోరారణ్యమున వివాహము జేయవలసి వచ్చినందులకు నేనే పరితపించుచున్నాను. మనదిన ములు బాగుండిన స్వల్పకాలములోనే సౌఖ్యములనుభవింతు రుగాక.

(అంతఁగళానిధి ప్రవేశించుచున్నాఁడు).

కళా—కీర్తివర్మ మహారాజా! నమస్కారము.

కీర్తి—(సంభ్రమముతో) అయ్యా! మీరెవరు.

కళా—దేవా!

గీ. కీలితేజంబుచేనొప్పి ♦ కీర్తిశేషుఁ
డైనధృతకీర్తిపుత్రుఁడ ♦ నయ్యనేను
నాదుపేరుకళానిధి ♦ మోదమయ్యె
నేఁభవద్దర్శనఫలంబు ♦ నిపుడుగనుట.

కీ_ర్తి—ఓహో! నీవుధృతకీర్తిద్వితీయపుత్రుఁడవా! నీకుస్వాగతము. నాయనా! మంచిసమయమునకు వచ్చితివి. (అనిప్రభాకర కలహంసులనుజూపి) వీరి నిర్వుర నెఱుఁగుదువా?

కళా—(పరికించిచూచి సంతోషముతో అయ్యా యిప్పుడుగుఱుతు పట్టుచున్నాను.

గీ. అతఁడు నాయన్నకలహంసుఁ ♦ డతఁడునాదు
తమ్ముఁడు ప్రభాకరాభిఖ్యుఁ ♦ డనరువాఁడు
భవముపావనమయ్యెనీ ♦ వనమునందు
నన్నదమ్ములఁజూచు భా ♦ గ్యంబువలన.

(అనిసోదరుల నాలింగనము చేసుకొనుచున్నాఁడు.)

కీ_ర్తి—నీభాగ్యమంతయేకాదు. నాముద్దుకూతు సరోజినిని మీతమ్ముఁడు ప్రభాకరునికిని ధనవర్మకూతురు కమలినిని మీయన్న కలహంసునికినిచ్చి యిప్పుడే వివాహము చేసితిని. అట్టిశుభ సమయమున నీవు రాఁదటస్థించినది.

కళా— పరమసంతోషము. (నవ్వుచు) మేమిప్పుడు రాజబంధువులమైతిమి

ప్రభా—అన్నయ్యా! కళానిధీ! నీక్షేమముదెలియక పెక్కుసంవత్సరములు విచారించితిని. ఇన్నాళ్లకు నీదర్శనమిచ్చి యానందాబ్ధిలో నోలలాడించితివి.

కళా—విద్యా వ్యాసంగమున వారణాసిలో నివసించుచుంటిని. ఈ నాటికి మనమొండొరులఁ జూడవలసియున్నది.

కల—కళానిధీ! నీక్షేమవార్త తెలియక చాలమనస్తాపముఁ జెందితిని. నేటికి నిన్నుఁ గన్నులారఁజూచి యానందించుచున్నాను.

కళా—అగ్రజా! మిమ్ముఁజూడ నాకుసంతోషముగానున్నది.

కీ_ర్తి—కళానిధీ! యిప్పుడిటకేలవచ్చితివి?

కళా—దేవరతో నొకశుభవార్తని వేదింపవచ్చితిని.

కీ_ర్తి—నాతోడనా? ఏమిదో చెప్పుము.

కళా...దేవా! తమదర్శనముగోరి ధనవర్మప్రభువీ వనమునకు వచ్చియున్నాఁడు.

కీర్తి...(ఉలికిపడి) ఏమీ! ధనవర్మా! ఇక్కడకా! నన్నుఁజూచుటకా! పొరపడుచున్నావు. చూచుటకుఁగాదు చంపుటకుఁగాఁబోలు.

కళా-హరిహరీ అట్టితంత్రమునకు నేనుఁబూనుకొనుదునా?

కీర్తి-నీవుపూనుకొనెదవని నాయుద్దేశముకాదు.

గీ. వల్కలాజినములఁదాల్చి ♦ వనమునందుఁ
కందమూలఫలంబులె ♦ విందుగాఁగ
నెనఁగునేనేడ! దర్శనం ♦ బేడ! తనకుఁ
బ్రాభవప్రాపేతునకుధన ♦ వర్మకిచట.

దీనిలో నేదిమోసమాయయున్నది ఆతనిమాటలు విశ్వాసార్హములుగావు.

కళా-పితృసమానా! కాదు. ఆతనికిఁ బశ్చాత్తాపమంకురించివచ్చినాఁడు. నామనవి వినుఁడు.

కీర్తి-పోనీ! చెప్పుము. వినుటవలనఁదప్పేమి?

కళా-మహాశూరులును సజ్జనులును దినదినమును నీమహారణ్యమునకు భవద్దర్శనార్థము వచ్చుటవినుచున్నాఁడు.

కీర్తి-అయిననేమి? దానివలన నాతనికేమిభయము?

కళా-ఏలభయనిదానముకాదు? వారందఱుమీతోఁగలసి యొక్కమ్మడిగ దండెత్తుదురని భయముతోఁచినట్లున్నది. పిదపఁ బౌరులందఱు గూడ నాతనిచే రాజద్రోహులనిపించుకొనిరి.

కీర్తి-వానిపైదండెత్తుట కావంతయైన నాకభిప్రాయములేదు. నీవా మాటగట్టిగాఁ జెప్పవచ్చును. పౌరులందఱు రాజద్రోహులేనా? అయ్యో! యెంతమాటవింటిని?

గీ. ద్రోహిరాజౌచుఁబ్రబలంగ ♦ దొడ్డప్రజలు
వానికినిద్రోహులట్లుగ ♦ న్పట్టకుండ్రె?

తి క్తమయిజిహ్వాయుండంగఁదీయఫలము
లునురుచికిఁది క్తమయిదాని ♦ కొనరలేదె?

కళా-మఱియు నాతనికుమార్తె కమలిని వెడలిపోయినందుకుఁగూడ నాతఁడు చాలఖిన్నుఁడయియున్నాఁడు.

కీర్తి-అదినిజమే కావచ్చునుగాని యామెయిచట సురక్షితముగా నున్నదనియు వివాహముగూడ నయ్యెననియు నీవుచెప్పవచ్చును. నాపరోజినిని వెడలఁగొట్టినందుల కాతనికేమియు విచారములేదుగద?

కళా-అదియును బెద్దవిచారము కలిగించినది. ఇపుడన్నియు నాలోచించుకొనియే మీరాజ్యము మీకొసంగి మీచాటుననిఁక జీవింపఁదలఁచుకొనియె. యీసందేశమెవ్వరిచేఁ బంపినను దాము విశ్వసింపరని క్రొత్తవాఁడనగు నన్నుఁబిలిపించి నాతోఁగూడవచ్చి తమముఖారవిందముఁజూడలేక యిచ్చటి కనతిదూరంబుననేయున్నాఁడు. సెలవయినఁగొనివచ్చెదను.

కీర్తి-(తనలో) అశ్వినీదేవతలు నారాజ్యము నాకులభించునని యింతకుఁబూర్వమే యశరీరవాణులయి ప్రసాదించిరిగదా! వారివాగ్దానప్రకారమాధనవర్మనుఁ బ్రేరేపించి పశ్చాత్తాపము గలిగించియుండురు. అట్లుగాక ధనవర్మయొకవేళ కృత్రిమబుద్ధితో వచ్చినను భయములేదు. నాకుఁదోడు ప్రభాకరుఁడున్నాఁడుగదా. (ప్రకాశముగా) కళానిధీ!

గీ. పరమశాత్రవుఁడయినను ♦ శరణమడుగ
దొరకినాఁడని బాధింప ♦ దొడ్డగుణమె?
మంచిమాటలఁబంపన ♦ మ్మతముగాని
కానమాట్లాడెడను దెమ్ము ♦ వానినిటకు.

కళా-చిత్తము సత్పురుషులకు మరియొకలాగెలతోఁచును యిదెపోయి కొనివచ్చెద. (అనిపోవుచున్నాఁడు).

కీర్తి-ప్రభాకరా! వింటివా యీయాశ్చర్యము. ధనవర్మకు మనఃపూర్వకముగాఁగలిగెనో లేక మాయోపేతమయినచర్యయో.

ప్రభా-రెండవదియేయని సందేహము.

కీర్తి-ఎందులకయిననుమంచిది. ఆతఁడువచ్చు నీలోపల నీకృపాణమును నొఱసిదీయుంచుకొని నాప్రక్కను నిలువఁబడియుండుము అమ్మలారా! మీరిరువురా చెట్లచాటునకుఁబొండు. అవసరమయిన చోఁ బిలిపించెదను.

ప్రభా-చిత్తము.

సరో-చిత్తము.

కమ-అట్టులేచేసెదను. (తనలో) అయ్యో? మాతండ్రిధనవర్మ దయ్యమువలె వనములకుఁగూడవచ్చి వెంబడించుచున్నాఁడే. (అని తెల్లబోవుచున్నది).

(అంతట ధనవర్మతోఁగళానిధి ప్రవేశించుచున్నాఁడు).

ధన-(మేలిముసుఁగుతోఁదలవాల్చి) భాతృవరా? కీర్తివర్మప్రభో? నేను జేసిన మహాపాతకములన్నింటిని క్షమించి నన్నాదరింపఁగోరి నే నిదెయొక్కప్రొక్కుగా మ్రొక్కుచున్నాఁడను. క్షమించితిన నువరకు మీపాదపద్మములువదలను.

(అనిపాదద్వయముపైఁబడి పట్టుకొనుచున్నాఁడు).

కీర్తి-(ధనవర్మనుస్పృశించి) తమ్ముడా? లెమ్ము.

ఉ. తప్పొటుచేసినాఁడవు వ్య ♦ థావెతఁగుందఁగనేలతమ్ముఁడా?
యప్పగిదిన్ ధరాతలము ♦ నంతయునీవుగొనంగఁ జేయమే
యిప్పుడునాకుఁగల్గెఁగను ♦ మీావనమందుననిష్టదైవముల్
ముప్పుఁదొలంగఁజేయుఁదప ♦ ముల్ బొనరించుచుహాయినుండెదన్.

ధన-పితృసమానా? నేను జేసిననేరము లినుకపాతరలు. సజ్జనులు మరి యొకలాగున నెట్లుపలుకుదురు?

కీర్తి-అయిన నన్నిపుడేమిచేయుమందువు? లెమ్ము.

ధన-(లేవకయే) చిత్తగింపుఁడు.

చ. పరమకిరాతకుండఁబహు ♦ పాపిఁగృతఘ్నుఁడ మూఢుఁడన్ సహో
దరవనపావకుండనతి ♦ దారుణకర్ముఁడనయిననేనుఁగా

వరమునఁ జేసినట్టిపలు ♦ పాపములన్ క్షమియించి రాజ్యవం
జరమును మీ భుజంబులనుఁ ♦ జయ్యన దాల్చి యనుగ్రహింపరే.

కీర్తి-(నవ్వుచు) తమ్ముడా! నాకా రాజ్యము? బాగున్నది.

గీ. వయసుముదిరెను; రాజ్యంబు ♦ వదలిపోఁడఁ
దమ్మునకునీకు; హాయిగాఁ ♦ దపమునలుపు
వాంఛ మయియున్న వాఁడనీ ♦ వనమునందు
నేలరాజ్యంబు ధనమదం ♦ బేలనాకు?

ధన-అట్టులయిన మీపాదములు వదలను.

గీ. రాజునని పిల్చుకొనుట ధ ♦ ర్మంబుగాదు
ప్రజలు రంజింపరేని యు ♦ భాతృవర్య
మీరు ప్రభువౌచునఁటనుండఁ ♦ గోరి ప్రజలు
తల్లడిల్లుచున్నారు ♦ తథ్యమింత.

కీర్తి-(తనలో) ఇఁక నే నేమిచేయుదును. యెంత చెప్పినను లేవకున్నాఁడు ప్రజలందఱు కోరుచుండఁగా నేనేల పోఁగూడదు. (ప్రకాశముగా) నీకోరిక తీర్చుటయే నాకు శ్రేయము. అప్పుడు పొమ్మంటివి పోయితిని. ఇప్పుడు రమ్మనుచున్నావు. వచ్చెదను. ఇఁక లెమ్ము.

ధన-ధన్యోస్మి (అని లేచుచున్నాఁడు).

కీర్తి-ధనవర్మా! కాలవశముచేతను గర్మవశముచేతనుఁ బ్రాణులు సుఖదుఃఖములకుఁ బాత్రులగుదురు. గాని ప్రజలుపాదానకారణులగుచుందురు. నావిషయమున నీవునునంతయే. ఎందఱుమహారాజులకిట్లు వనవాసము ప్రాపించె? తిరిగివారు సుఖింపలేదా?

ఇదియంతయుఁ గాలమహిమ భ్రాతృపరస్పరానురాగమింకఁ బడయఁగలము. దుఃఖింపకుము. అనవరతము మనము దుఃఖములనే పొందుచుందుమా. భగవంతుఁడు లేఁడా చూడుము.

ఉత్పలమాలిక.

శ్రీలలనామనోహరుఁడ ♦ శేషవిశేషకృపాంతరంగుఁడు
ద్వేలమహాశ్రితావనుఁడ ♦ భీష్టముతీర్పకయున్నె భక్తజీ

వాళికి నెన్ని యేండ్లుగడు ♦ నాతిన్ నిఁగూల్చి తపింపఁ జేసినన్
గాలముఁ రాక యున్న మన ♦ కార్యము లెట్లు ఫలీకృతంబులౌ
హాళి మెయిన్ మనోహరమ ♦ హావిభవాంచిత పుణ్యమూర్తిన్ ధీ
శాలినలావనీపతి, త్రి ♦ శంకసుతుం డురఘూద్వహుండు నే
వేళను దారపుత్రపితృ ♦ పీరులపీడకయుండియక్కటా
కాలవశంబు చేఁదము సు ♦ ఖంబులఁ గోల్పడి కానకొక్కరై
యాఁకులబిడ్డలన్ బితల ♦ నాప్తుల నాశ్రితులన్ ద్యజించి పా
ల్లాలక సంచరింపరె? హ ♦ ళాహాళిఁ గుందరె? యెట్టకేలకున్
గోళులమాన్పి వారలనుఁ ♦ గూర్పఁడె చక్రధరుండు భక్తగో
పాలకుఁడాదిమూర్తి దమ ♦ భార్యలతో హితబంధుపాళితోఁ
గాలము మంచిదై చనఁగఁ ♦ గల్గునయాచిత కార్యసిద్ధి; యా
లీలను నేటికబ్బెనవ ♦ లీలఁగ నీసుదినంబు తమ్ముఁడా!
పోలినయట్టులున్నె మన ♦ బుద్ధులు? తమ్ముఁడు నన్నయట్టులే
వేళను పీడకుందమవి ♦ వెఱ్ఱితలంపులఁ బూని స్నేహక
ల్లోలతరంగసంచయవి ♦ లోలమహాప్రమదాబ్ధిమున్గుచున్
దేలుచునున్న నీకటులు ♦ నీరసబుద్ధిజనింపఁ జేసెగా
కాలము; దానిమూలమునఁ ♦ గాదె ఘటించె బహుప్రయాసముల్
వ్యాళము వ్రాలెనన్గఱచెఁ; బాపము పండె; మదీయసౌఖ్యముల్
దూలె; నశించె రాజ్యగతి; ♦ తోడనెగల్గె వనప్రవాసమున్
జాలకయిద్దినాదుహిత, ♦ జారుసుమాంగి సరోజినీసతిన్
గూళతనానబందెనిడి ♦ గోడులఁ బెట్టినఁ దృప్తిలేక యా
భీలమృగాలవాలమగు ♦ పేరడవిన్ బడఁ జేసి యస్రముల్
నేలస్రవింపనాకమలి ♦ నీతరుణీమణితోడ రాఁగనా
పాలికిఁ బంపె; నిట్టిపలు ♦ బాములఁ బెట్టెను నీదు పేరిటన్
గాలము; దాని నేమనము ♦ కల్మషమంచుఁ దలంపఁగావలెన్
జాలురు! కాల! నీమహిమ ♦ చక్షువులం బడకుంటి కానినీ
మేలము సాగునెక్కడ! కడు ♦ మొత్తని కత్తినినొక్కవ్రేటుమై
కాలు నియిల్లు చేర్పనొకో! ♦ గాఢసుహృత్ప్రచలద్వియోగలీ

లాలలితాత్మకుండవయి ♦ లబ్ధసుఖంబుల నీవుమాపఁగాఁ
జాలినసిద్ధదైవికవ ♦ శంబునఁగంటిమి నేటికొండొరుల్
గ్రాలెను నేత్రకంజములు ♦ కర్ణపుటంబులు గ్రోలెమాధురీ
లాలితవాక్యపానకము ♦ లక్షణయుక్తిని మాశరీరముల్
వ్రాలెనునిండుఁగౌఁగిళుల ♦ భ్రాతృపరస్పర రాగ మొప్ప ; నిం
కేలత్వదీయదాష్ట్యము? ల ♦ యింపఁగఁ జేసి శుభంబులీయఁగాఁ
జాలుదు వేనిరమ్మటులఁ ♦ జాలకయుండినఁ బొమ్ము మమ్మిటుల్
వైశమవీడు చున్గదలి; ♦ భ్రాత! యమర్షము లేదు నీపయిన్
మేలొనగూర్చినాఁడవు సు ♦ మీ మమునందఱిఁగానకంపుటల్
నీలలితాత్మజన్గమలి ♦ నిన్గలహంసునకున్ సరోజినిన్
ధీలలితప్రభాకరవి ♦ నీతునకున్ రహింనిచ్చి పెండిలిన్
గేళినినీదినంబున నె ♦ నేనిఁటఁ జేసితి; నీవుహర్షతన్
గ్రాలెదవంచు నెంచెద; వి ♦ కాసమతిన్ గనుమింక వారినిన్
జాలము సేయకింకరభ ♦ సంబున రాజ్యముఁ జేరవచ్చుఁగో
పాలుఁడు ప్రేమమైమనలఁ ♦ బాలనసేయుత నెల్లకాలమున్.

సూక్ష్మబుద్ధీ? సరోజినీకమలినుల నిటు తెప్పింపుము.
సూక్ష్మ-చిత్తము (అనిపోయి మరలవారితోఁ బ్రవేశించుచున్నాఁడు).
ధన-సోదరవరా?

గీ. అతులహర్షాబ్ధినోలలా ♦ డితిని నేనుఁ
గన్యకలు మంచివరులనుఁ ♦ గాంచుటవిని
కటికివాఁడయినఁ జేయఁడు ♦ కన్నకూఁతు
నకును నేఁ జేసినట్టియ ♦ న్యాయమకట !

(నమస్కరించిన సరోజినీ కమలినులస్పృశించి) సుమంగళీభవ !

చ. కమలిని! యోసరోజిని! మొ ♦ గంబెటులెత్తెదమిమ్ముఁ జూడ? దు
స్సహమయవశంబునన్ హృదయ ♦ జాడ్యముచే నలయించితిన్ మిమున్
విమలమతిప్రభావమున ♦ నెమ్మిని మీరు వచించినట్టియా
యమృతవచస్సులన్నియును ♦ నప్పటికిన్ విషమయ్యెనక్కటా!

గీ. అమ్మలార! మీర ♦ లంతఃపురంబందు
ప్రాసివిడిచినట్టి ♦ పద్యవర్ణ
ములునునొక్కటొకటె ♦ ములుకులయి బాధించె
నన్ననుక్షమింప ♦ రమ్మదయను.

కమ-
సరో- } తండ్రీ? మాప్రారబ్ధకర్మమే మాకష్టములకుఁగారణము. విచారించింపవలదు.

ధన-(ప్రభాకరకలహంసులఁజేరి).

చ. పరుషతమీమ్మసంబులకుఁ ♦ బాటెల జేసినఁగాని యో ప్రభా
కరకలహంసులార? గుణ ♦ కాంతలఁగాంతలమీకుఁగూర్చి నే
నరుసను జెందఁ జేసితిఁగ ♦ దా? యెటులైననుమామనయ్యా? మే
దురగురుభావలీలమెయిఁ ♦ దోరపుభక్తినినాదరింపుఁడీ?

కల-చిత్తము. మాగ్రహచారవశంబున మీకట్టిబుద్ధిగలిగెను. మాపై
గృపయుంచుఁడు.

ప్రభా-ఓ మామా! ధనవర్మ!

క. పంతంబునమాకనకం
బంతయుఁ జేకొనఁగమీర ♦ లదిగనిన్యాయ
స్వాంతుఁడు భగవంతుఁడుమీ
కాంతాకనకములనిచ్చి ♦ కాచెనుమమ్మున్.

మేమల్లురమయితిమి. ఇఁకమీపయిభక్తియుండితీరవలెను.

ధన-మహాశూరుఁడవుగనుక నెత్తిపొడిచితివి. తప్పులేదు. (కీర్తివర్మహి
తులవంకఁజూచి) మీకందఱకు నేనొనరించిన యొగ్గుమఱచి క్ష
మింపుఁడు.

సూక్ష్మ-మీరొనరించినవియొగ్గులగునా? రాజులపరాధములు చేయలేరని
గదా శాస్త్రము.

ధన-మీరందఱునుసజ్జనులు. అంతకంటెమీరేమియననోపుదురు. భ్రాతృ
వరా! ఇఁకమనమందరము సురక్షితముగాఁ బట్టణమ్మునకుఁ దర
లుదమా.

కీర్తి-మంచిది. ఆనందసానందలారా? ఇఁకమీరుపోయి సుఖముగా జీవింపుఁడు.

ఆనం- } చిత్తము. వనాటులమయిన మాపైదయయుంచుఁడు.
సానం- } (అనిపోవుచున్నారు).

కీర్తి-హితులారా? నేనీయరణ్యమునకు రాకపూర్వము మీరందరు ననుభవించుచుండిన మీమీస్వాస్థ్యములఁదిరిగి మీకందఱకునిచ్చివేయుచున్నాను.

సూక్ష్మ-మహాభాగ్యము. దానికేప్పుఁడయిన లోపముజరుగునని మేమనుకొంటిమా?

కీర్తి-ప్రభాకరకలహంసులారా? మీస్వాస్థ్యమునంతయుఁదిరిగి మీకిచ్చివేయుచున్నాను. సుఖముగా మీభార్యలతో మీరనుభవింపుఁడు. ఒండొరులను భాగముకలిగి యుభయవంశములకుఁ గీర్తిప్రతిష్ఠలఁదెండు. కళానిధీ? నీమాటయేమి?

క. సరసగుణాన్వితయగునొక
తరుణీమణిఁబెండ్లియాడి తండ్రియిడినమే
దురధనభాగముఁగొనిమన
పురమునవివసించిసౌఖ్య భోక్తవుగమ్మా.

ప్రభా- } ప్రభువుసెలవిచ్చినట్లుచేయుము.
కల- }

కళా-దేవా! తాముసెలవిచ్చినసంగతి సంతోషమేగాని నాకిదివరకేపెండ్లియయినదే?

కీర్తి-అట్లులా? యెవరితో? ఆమెయెక్కడనున్నది.

ప్రభా- } భ్రాతృవరా! ఆశ్చర్యము. మాకుఁదెలియనేలేదే.
కల- }

కళా-చ. జననముబొందె దైవకృప సారతమంబగుజ్ఞానవృద్ధిచే
వనవరతానురాగమున నాభగవంతునిఁగొల్చునామె, మీ

కనులకదృశ్యమై చెలఁగుఁ ♦ గ్రాలెడుము క్తిరమాభిధానత
వినుఁడుమదీయమానసిక ♦ వీధులనెప్డురమించుచుండెడిన్.

సూత్ర-ఆహా! యెంతచక్కఁగావర్ణించినాఁడవు. కళానిధీ? జన్మమన్న నీదియేగదా. తపస్సుచేయఁగా నిన్నాళ్ళకు మంచిస్నేహితుఁడవు దొరకితివి.

కీర్తి-వహ్వా? ఎంతబాగుగఁజెప్పితివి. మంచివయిరాగ్యజ్ఞానమును సంపాదించినాఁడవు నీవుకళానిధి వేయగుదువు. అట్లులయిన నీకీర్మైహిక సౌఖ్యములపై వాంఛ లేదుగదా.

కళా-లేదు. ముమ్మాటికిని లేదు. నాసహోదరులిరువురు వారికళత్రములతో సుఖముండినఁజాలు. నాభాగమునంతయు వారిరువురకు సమానముగా నొసఁగుచున్నాను.

కీర్తి-బహుసంతోషము. మనముముఖ్యబంధువులముగనుక నాయొద్దను నీవుండి నాకుజ్ఞానబోధచేయుమని కోరుచున్నాను.

కళా-పరమసంతోషము.

కీర్తి-ప్రభాకరా! ఇఁకమనమందఱము పోవచ్చునా?

ప్రభా-చిత్తము. (అనిసారంగునిపైఁజేయివైచి) సారంగా ? నీమూలము నఁగదా నాకిట్టియమితభాగ్య మహావిభవములులభించె. నిన్నేమనికొనియాడెదను?

గీ. ప్రాణగోడ్డంబునుండిన ♦ న్నట్లుకాచి
నాసరోజినితోఁజేర్చి ♦ నవ్యతరసు
ఖాంబుధినిఁదేల్చినాఁడవు ♦ ప్రాణమిత్ర
యెట్లుదీర్చెదనీఋణ ♦ మింక నేను

(అనికౌగలించుకొనుచున్నాఁడు).

సారం-స్వామీ ! మీకు నేనేమియుపకారము చేసితిని. నావిధులయందు జాగ్రతఁగాగృషిచేసితిని పదపడి నామూలమున మీరుచాలఁ గష్టపడితిరి. దానికిక్షమింపఁ బ్రార్థించెద.

కల-ఈమహాభాగ్యములకన్నింటికి సారంగుఁడే కారకుఁడు. అతఁడునన్ను క్షమింపవలసియున్నది.

ప్రభా-సారంగా? నీమాటలునీవినయమును సూచించుచున్నవి.

క. పెద్దవువయసుననీకనా
యొద్దనెనివసింపుము సుర • లున్నవరకుమా
పెద్దలబలెనినుఁజూతుము
ముద్దియయును నేను సౌఖ్య • ములనీ వెసఁగన్.

ఇదిగో నాకునీవిచ్చిన వేయిరూప్యములనుఁదీసుకొమ్ము.

(అనిసంచినిచ్చుచున్నాఁడు).

సారం-(అందుకొని) స్వామీ? ఈధనమునాకుటుంబమునకిచ్చి నేనుమీయొద్దనేయుందును.

కీర్తి-ప్రభాకరా! ఇంకమనము పురమేగుట కేమియాలస్యము!

(అంతదేవేంద్రుఁడాకాశమునఁ బ్రత్యక్షమగుచున్నాఁడు).

ఇంద్రుఁడు-కీర్తివర్మా! నీవు సుగుణసంపన్నుండవు. నీచరిత్రమునకు దేవతలందరుమెచ్చిరి. నీరాజ్యమునుఁజేరి పెద్దకాలము నీవుసుఖింపఁగలవు. ఇఁకనేమయిననీకువరములుకావలెనా!

కీర్తి-(తనలో) ఓహో నాయందలి యపూర్వకృపచే మహేంద్రుఁడు దర్శనభాగ్యముదయచేసినాఁడు. ఆసహస్రాక్షునిఁజూడ నాకనులుచాలకున్నవి. (ప్రకాశముగా) అయ్యా! దేవేంద్రా! ఇదిగో నాసాష్టాంగములు. మీరుదర్శనమిచ్చుటచే నాభవముపావనమయ్యె. ఇఁకనాకేమికావలెను.

ఉ. కాంచితినాసరోజినినిఁ • గన్నులవిందుగ; నీప్రభాకరున్
గాంచితిమంచియల్లునిగఁ • గాంచితిఁదమ్మునిసద్గుణాఢ్యుగాఁ
గాంచితిరాజ్యవైభవముఁ • గాంచితిఁబూర్వసుఖంబులన్నియున్
గొంచక యేమికోర్కులిఁకఁ • గోరెదమిమ్ములనోసురాధిపా!

అయిననిట్లు ప్రసాదింపుఁడు. [illegible]

భరతవాక్యము కవిరాజవిరాజితము.

అనయమునీపట్ట్యాలమానిసహోదరు ♦ లందఱు బ్రేమఁజరింపవలెన్
ధనమదగర్వవిహీనతఁ గ్రాలుచు ♦ ధార్మికులయి ప్రజలుండవలెన్
ఘనతఁగవీంద్రులు గ్రాలవలెన్ ధర ♦ కమ్మనిసస్యములీయవలెన్
బ్రణుతనువృష్టిసకాలమునందుభ ♦ వద్దయభూమి స్రవింపవలెన్.

ఇం-నీవుకోరినవన్నియు వరములయి ఫలించుగాక. ఇఁక నేను బోవుచున్నాను.

(అనియదృశ్యుఁడగుచున్నాఁడు)-

కీర్తి-అయ్యా! దేవేంద్రా? నమస్కారము ఇఁకను సుముఖుఁడనయి పట్టణమునకుఁబోవుచున్నాను. అందఱునుగూడరండు. సరోజినీకమలినులారా! నావెంటనుండుఁడు.

అందఱు—చిత్తము-

(అందఱు నిష్క్రమించుచున్నారు).

గద్య-ఇది శ్రీమద్రమారమణీరమణచరణారవింద నిరంతరానూనధ్యానపారీణ బంధురాంధ్రకవితాధురీణ పరస్పరానురాగ సూరమాంబా వేంకటామాత్య పూర్వతపఃఫలరూప శౌనకసగోత్రప్రదీప తురగాన్వవాయాంభోధిసుధానిధాన వేంకటాచలాభిధానప్రణీతంబైన సరోజినీనామ నాటకంబునందు సర్వంబును బంచమాంకము

స్వస్త్యస్తు.